# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

ARUNATARA

సంపుటి: 44 సంచిక: 2 హైదరాబాద్ 322 మార్చి, 2016 పేజీలు: 60 వెల: రు. 20



ఒక్కో నదినీ ముక్కలు చేస్తూ ఎక్కడికక్కడ
గోడలు కడుతున్నాడు వాడు
ఇప్పుడు నదీ ద్వారాలను స్వేచ్ఛగా
తెరుచుకోనివ్వాలి

9-10 జనవరి 2016న విజయవాడలోని పి.బి. సిద్ధార్థ కాలేజి ఆడిటోరియంలో జరిగిన
విరసం 25వ మహాసభలలో సౌహార్ద సందేశాలు అందిస్తున్న ప్రజాసంఘాల మిత్రులు, రచయితలు


దివికుమార్


బుడ్డిగ జమీందార్


సి. రాఘవాచారి


నారాయణ


బోస్


అయ్యన్న


అంజయ్య


మల్లీశ్వరి


పిచ్చయ్య


సామల రమేష్‌బాబు


హర్షఠాకూర్


కె. కృష్ణ


అన్నపూర్ణ


మహేశ్


కొండారెడ్డి


అంజమ్మ


దేవేంద్ర


తాయమ్మ కరుణ



(322)

# అరుణతార

సాహిత్యసాంస్కృతిక మాసపత్రిక

సంపుటి : 44 ◆ సంచిక : 2 ◆ మార్చి, 2016 వెల : రు. 20/-

## సంపాదక లేఖ...

రోహిత్ బలవన్మరణంలో అనేక సంకేతాలు ఉన్నాయి. వాటిని ప్రపంచమంతా విశ్లేషించుకుంటున్నది. అది మనమున్న వాస్తవ స్థితిని సూచిస్తున్నది. ఈ దుర్మార్గమైన వ్యవస్థ ఎలా నడుస్తున్నదో, మనుషులనెలా వెంటాడుతున్నదో పలు కోణాల్లో చర్చించాల్సిన ఆలోచనా సందర్భాన్ని ఒక అద్భుత మానవుడు స్వీయ హననం ముందుకు తీసుకొని వచ్చింది. ఇది ఎంత విషాదకరం, ఎంత దుఃఖకరం.

భారత శిక్షాస్మృతిలో ఉరి శిక్ష ఉండకూడదనే ప్రజాస్వామిక వైఖరి తీసుకున్న రోహిత్ ఇలా ఉరేసుకొని దూరమైపోవడం యాదృచ్ఛికం కాదు. పూర్తిగా సామాజికం. అనేక వైరుధ్యాల దుర్మార్గ వ్యక్తీకరణ. మనుషులను వెంటాడం, పట్టుకొని చంపివేయడం, ఆత్మహత్య చేసుకోక తప్పని నిస్సహాయ స్థితిని కల్పించడం ఈ అమానవీయ వ్యవస్థ లక్షణం. స్వేచ్ఛ, భావ సంఘర్షణ, ఆత్మగౌరవం, కులనిర్మూలన, మానవీయత, సమానత్వం, దోపిడీ లేకపోవడం మొదలైన వాటి కోసం పరితపించేవాళ్లకు ఇది అతి పెద్ద సవాల్. మానవజాతి దీన్ని ఎదుర్కొంటూనే పురోగమిస్తోంది. మార్గమధ్యంలో ఎన్ని బలిదానాలు? ఎన్ని విషాదాలు, రోహిత్‌లా ఎన్ని స్వీయ నిష్క్రమణలు?

రోహిత్ తన మరణవాఙ్మూలం రాశాక, ఉరితాడుపై తుది శ్వాస విడిచే వేళ వీటన్నిటి గురించి ఏం ఆలోచించాడోగాని మనకు దుఃఖకరమైన, బాధ్యతాయుతమైన పనులు ఎన్నో అప్పగించి వెళ్లాడు. నిన్నటి దాకా మన ఆలోచనా ప్రపంచంలో, ఆచరణ రూపాల్లో పెనవేసుకొని ఉన్న సంక్లిష్టతను సహితం ఒక్క ఊపు ఊపేసి వెళ్లిపోయాడు. అందుకే 'రోహిత్' అనే మాటే ఒక ఆలోచనా సందర్భంగా దేశాన్ని కుదుపి వేసింది. ఆ మాటకొస్తే కొంత వరకు ప్రపంచాన్ని కూడా.

యూనివర్సిటీల పనితీరు, హిందుత్వ, కులం, రాజ్యం.. మొదలైన వాటిపై గతంలో కూడా చర్చ జరిగినా ఇప్పుడు సరికొత్త కంఠ స్వరంతో మాట్లాడుకుంటున్నాం. ఇది కేవలం హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయంలోని ఘటనే కాదు. మొత్తంగా మన వ్యవస్థకు సంబంధించింది. హిందుత్వ ఇక్కడ కులాన్ని తీసుకొని వస్తే, ఢిల్లీ జేఎన్‌యూలో జాతీయతను వెంటేసుకొని వచ్చింది. ఇక్కడ రోహిత్ దళిత్ కాదు అనే వాదన ద్వారా తన పక్షాన దళిత,ప్రజాస్వామిక, విప్లవ శక్తులు నిలబడకుండా చేయాలని కుట్ర పన్నితే, అక్కడి విద్యార్థులు జాతీయత లేని దేశద్రోహులనే వాదన తీసుకొని వచ్చింది. అక్కడా ఇక్కడా ముస్లిం గురించి ఆలోచించడం, ఉరి శిక్షలను వ్యతిరేకించడం సంఘపరివార్‌కు ఆగ్రహం తెప్పించింది. జేఎన్‌యూలో నేరుగా అది కాశ్మీర్ స్వయంప్రతిపత్తి ఆకాంక్షలపై ద్వేషం వెళ్లగక్కింది. దీంతో సంఘపరివార్ చెబుతున్న జాతీయ వాదం, దేశభక్తి కేంద్ర స్థానంలోకి వచ్చి చర్చనీయాంశాలవుతున్నాయి.

అంబేద్కర్ స్టూడెంట్ అసోసియేషన్ విద్యార్థులను కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి బహిష్కరించడంతో సమస్య జటిలమై అనేక రూపాల్లో సమస్య విస్తరిస్తూపోయింది. అందుకే ఆ బహిష్కరణ ఎంత మాత్రం సాంకేతిక విషయం కాదు. దానికి సామాజిక అర్థం ఉన్నది. రోహిత్ ఆత్మహత్య ఈ సంక్లిష్ట దృశ్యంలో భాగం. హిందుత్వకు కులంతో, జాతీయతతో ఉన్న సంబంధం వల్లే ఈ సంక్లిష్టమైన పరిణామాలు జరుగుతున్నాయి. అంతిమ సారంలో ఇది బ్రాహ్మణీయ కుల, మత వర్గ తత్వం. అందుకే ఈ మొత్తంలో సంఘపరివార్ ఆలోచనలకు అనుగుణంగా రాజ్యం ఎలా నడుచుకుంటున్నదో చూస్తున్నాం. కన్హయ్‌కుమార్, ప్రొ. గిలానీలపై రాజద్రోహం కేసు పెట్టింది. ఉమర్ ఖలీద్, అనిర్‌బన్ భట్టాచార్య భావాలు దేశభద్రతకు ప్రమాదకరమని రాజ్యం భావించి అరెస్టు చేసింది. భావాలు రాజద్రోహమయ్యే సమాజమిది. ఫాసిజమంటే ఇదే.

ఎడిటర్
దువ్వూరి వెంకట రామక్రిష్ణారావు
12-15-963, మాణికేశ్వరినగర్,
ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్,
తార్నాకా, హైదరాబాద్-500007.

రచనలు పంపించాల్సిన చిరునామా:
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి,
హైదరాబాద్ - 500 040.

* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా రచనలు పై చిరునామాకూ, ఇ-మెయిల్ ద్వారా arunatara1977@gmail.com కూ పంపవచ్చు

సంపాదకవర్గం :
ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్

మేనేజర్
వలేటి అరవింద్ కుమార్
భీమ్‌సేన్‌రావు, 1-9-52/ఎఫ్/2,
ఈ-సేవ దగ్గర, మదర్ హైస్కూల్ ఎదురుగా,
రామ్‌నగర్, హైదరాబాద్ - 500020.

విరసం కార్యదర్శి చిరునామా
పి. వరలక్ష్మి
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.

డి.టి.పి. అండ్ లే అవుట్
ఆర్. భాగ్యలక్ష్మి
కవర్ డిజైన్ : పి. వరలక్ష్మి,
ఆర్. భాగ్యలక్ష్మి
కవర్ పేజి ఫొటోలు : క్రాంతి,
కె.వి. కూర్మనాథ్

Like Page://viplava rachayitala sangham arunatara

facebook ://viplava rachayitala sangham virasam

Virasam website : *www.virasam.in*
*www.virasam.org*





## సంచిక - 322



గమనిక : మిత్రులారా, కామ్రేడ్స్! అరుణతార డిటిపి, డిజైనింగ్, ప్రింటింగ్, పోస్టింగ్, రవాణా ఇలా అన్ని ఖర్చులు చాలా పెరిగిపోయాయి. అనివార్య పరిస్థితులలో విడి ప్రతి వెలను ఫిబ్రవరి 2016 సంచిక నుంచి రూ.20 కు పెంచవలసి వచ్చింది. ఇది గమనించగలరు. ఎప్పటిలానే మీ ఆదరాభిమానాలను, సహకారాన్ని ఆశిస్తున్నాం. అలాగే ఫిబ్రవరి 2016 సంచిక నుంచి అరుణతార సంచికల క్రమాన్ని సంపుటి 44 గాను సంచిక 1 గాను సరిచేసాం. ఈ విషయాన్ని గమనించగలరు. - సం.


అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో పంపించండి.
డి.డి.లను **డి.వి. రామక్రిష్ణారావు,** హైదరాబాద్ పేర తీయండి.
విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-

విప్లవ రచయితల సంఘం సాహిత్య సాంస్కృతిక
మాసపత్రిక అరుణతార సంపాదకీయం

# బస్తర్ క్షతగాత్ర ముఖం ఈ దేశ ముఖచిత్రమే

**పి.వరలక్ష్మి**

సోని సోరిపై 'గుర్తు తెలియని' వ్యక్తులు దాడి చేసి ఆమె ముఖంపై ఆసిడ్ వంటి రసాయనాన్ని పులిమారు. ఇది హక్కుల కార్యకర్తలపై దశాబ్దాల దాడుల పరంపరలో ఒకటి మాత్రమే కాదు. దాడి చేసిన వ్యక్తులు "నీ ముఖానికి శాశ్వతంగా నల్ల రంగు పులుముతున్నాం. డిజిపి కల్లూరిపై, సి.ఆర్.పి.ఎఫ్. బలగాల అత్యాచారాలపై ఫిర్యాదులు వెనక్కుతీసుకోకపోతే నీ కూతురికి కూడా ఇట్లాగే చేస్తా"మని బెదిరించారు. ఢిల్లీ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ నల్లగా కాలిపోయిన ముఖంతోనే ఆమె బైటికొచ్చి, "ఈ రోజు బస్తర్ యుద్ధ ముఖమే నా ముఖం" అని దేశ రాజధానిలో ప్రకటించింది. మరోవిధంగా బస్తర్ స్థితిని వర్ణించడం ఇంకెవరికైనా సాధ్యమవదేమో. బస్తర్ లో ఆదివాసులపై అమలవుతున్న భయంకరమైన రాజ్యహింస బైటి ప్రాంతానికి ఒక విధంగా సోనిసోరి ద్వారానే వ్యక్తమైంది. 2011లో ఆమెను అరెస్టు చేసి అత్యాచారం చేసినప్పుడు, ఆమె జననాంగంలో రాళ్ళు జొనిపి, ఇనుప రాడ్ దూర్చి చిత్రహింసలు పెట్టినప్పుడు, అంతకన్నా ఈ హింసను అమలుచేసిన ఆరోపణలున్న అధికారి ప్రభుత్వం చేత శౌర్య పథకం అందుకున్నప్పుడు ఆపరేషన్ గ్రీన్ హంట్ వికృత రూపం ఎక్కువ మందికి తెలియవచ్చింది. ఆమె ఒకటిన్నర సంవత్సరాల జైలు జీవితం, ఆమె భర్తను జైల్లో విపరీతంగా హింసించి చివరికి చనిపోయేలా చేసిన రాజ్యదుర్మార్గం గురించే కాదు, ఆదివాసీ స్త్రీల ఎదలపై కరెంట్ షాకులివ్వడం, అత్యాచారానికి గురైన పదహారు పదిహేనేళ్ళ అమ్మాయిలు జైళ్ళలో పిల్లలకు జన్మనివ్వడం, ఇటువంటి దారుణమైన స్థితిలో వందలాది మంది ఆదివాసులతో చత్తీస్ ఘడ్ జైళ్లన్నీ కిక్కిరిసి ఉండటం గురించి సోనిసోరి మాట్లాడుతున్నది. ఉద్యమ ప్రాంతాల్లో మొత్తంగా ఆదివాసీ స్త్రీలపై అమలవుతున్న హింసను మరింత బిగ్గరగా ప్రశ్నించినందుకే మరోసారి ఆమెపై చీకటి దాడి జరిగింది. అంతకు ముందు కొన్ని వారాల నుండి 'నిన్ను సజీవ దహనం చేస్తామని' కూడా ఆమెను బెదిరిస్తున్నారు.

సోనిసోరిపై దాడి జరగడానికి ఒక్క రోజు ముందు స్క్రోల్.ఇన్ వెబ్ సైట్ విలేకరి మాలినీ సుబ్రహ్మణ్యంను బలవంతంగా ఇల్లు, ఆఫీసు ఖాళీ చేయించి జగ్దల్ పూర్ నుండి తరిమేశారు. బస్తర్ లో మానవ హక్కుల ఉల్లంఘన గురించి ఆమె రాస్తూ ఉంది. జాతీయ స్థాయి మీడియాకు 400 కిలోమీటర్ల దూరం ఉన్న రాయ్‌పూర్ లో తప్ప ఆ ప్రాంతంలో విలేకర్లే లేరు. మాలినీ సుబ్రమణ్యం యుద్ధ క్షేత్రమైన బస్తర్ గ్రామాలకు దగ్గర్లో జగ్దల్ పూర్ పట్టణంలో ఉంటూ గ్రామాల్లో జరుగుతున్నవాటిని ప్రపంచం ముందుకు తెస్తున్నారు. బస్తర్ జిల్లా దర్భ ఏరియాలో పదేళ్ళ నుండి విలేకరిగా పనిచేస్తున్న సంతోష్ యాదవ్ ను 2015 సెప్టెంబరులో పోలీసులు అపహరించి చిత్రహింసలు పెట్టి హత్య కేసుతో సహా అనేక తప్పుడు ఆరోపణల్లో ఇరికించారు. నిజాలు రాసినందుకు మరో విలేకరి సోమారు నాగ్ పరిస్థితి కూడా ఇదే అయింది. ఇక్కడ పోలీసులు చెప్పింది తప్ప జర్నలిస్టులకు మరోటి రాసే పరిస్థితి లేదు. ఆ ఇద్దరు బాధిత విలేకర్ల పక్షాన కూడా స్క్రోల్ డాట్ ఇన్ వంటి ఆన్ లైన్ పత్రికలు రాసిన మీదటే ఇండియన్ ఎక్స్ ప్రెస్ వంటి జాతీయ పత్రికలు రిపోర్టు చేసి చర్చనీయాంశం చేశాయి. నవంబర్‌లో భద్రతా దళాల అత్యాచారాల గురించి మాలినీ సుబ్రమణ్యం వివరమైన రిపోర్టు రాశారు. అట్లాగే డిసెంబరులో సుక్మా జిల్లాలో మావోయిస్టుల లొంగుబాటు పేరుతో పోలీసులు ఆడిన నాటకాన్ని బట్ట బయలు చేసి లొంగిపోయారని పోలీసులు చూపుతున్న 20 మందీ అమాయక ఆదివాసీలని నిరూపించారు. మూడవ దశ ఆపరేషన్ గ్రీన్ హంట్ లో భాగంగా అక్టోబర్ 2015 నుండి ఆదివాసీలపై భద్రతా బలగాల దాడులు, అత్యాచారాలు, అపహరణలు, చిత్రహింసలు, హత్యలు తీవ్రతరమయ్యాయి. రాజ్య దుర్మార్గాలకు సాక్ష్యాలు లేకుండా చేయడానికి జరుగుతున్న కుట్రలకు వ్యతిరేకంగా నిష్పాక్షిక విచారణ చేస్తున్న సామాజిక కార్యకర్తలు, జర్నలిస్టులు, న్యాయవాదులను బెదిరించి అక్కడి నుండి తరిమేస్తున్నారు. అట్లా మాలినీ సుబ్రమణ్యంను పలుమార్లు రాత్రుళ్ల ఇంటికి పోయి పోలీసులు ప్రశ్నించేవారు. ఆమె ఇంటి ఓనరును విపరీతంగా భయపెట్టారు. ఫిబ్రవరి 7న 20మంది దాకా ఆమె ఇంటి వద్ద గుమికూడి, ఆమె మావోయిస్టుల మద్దతుదారు అంటూ ఆమెకు వ్యతిరేకంగా నినాదాలిచ్చి అల్లరి చేశారు. మరుసటి రోజు ఉదయం ఆమె ఇంటిపై రాళ్ళు వేశారు. కారు అద్దం పగలగొట్టారు. ఆమె ఫిర్యాదు చేయబోతే దాన్ని తీసుకోడానికి పోలీసులు నిరాకరించారు. చిట్టచివరికి ఫిబ్రవరి 19న ఆమెను ఇల్లు, ఆఫీసు ఖాళీ చేయించి జగ్దల్ పూర్ నుండి తరిమేశారు. అదే విధంగా బేలా భాటియా అనే స్వతంత్ర పరిశోధకురాలు చత్తీస్ ఘడ్ ఆదివాసీ ప్రాంతాల్లో మానవ హక్కుల ఉల్లంఘన గురించి డాక్యుమెంటరీ తీస్తుంటే ప్రభుత్వ సాయుధ ముఠాలు ఆమెని బెదిరించి పంపేశాయి.

ఫిబ్రవరి 20న, అంటే సోనిసోరిపై దాడి జరిగిన రోజే, ఆ రాత్రే, జగ్దల్ పూర్ లీగల్ ఎయిడ్ గ్రూపు (జగ్ లగ్) న్యాయవాదులు శాలినీ గేరా, ఈశా కందెల్ వాల్ లను కూడా జగ్దల్ పూర్ నుండి వెళ్లగొట్టారు. ఈ ఇద్దరు న్యాయవాదులు 2013 జులైలో జగ్దల్ పూర్ వచ్చి ఆదివాసీ ఖైదీల కేసులు చూస్తున్నారు. ఏళ్ల తరబడి విచారణ లేకుండా జైళ్ళలో మగ్గుతున్న ఆదివాసులకు న్యాయ సహకారం అందిస్తున్నారు. సోనిసోరి విడుదలకు కృషిచేశారు. ఇటీవలి కాలంలో భద్రతా బలగాల హింస పెచ్చరిల్లుతున్న సందర్భంలో

అక్కడి సామాజిక కార్యకర్తలతో కలిసి పోలీసులు ప్రచారం చేస్తున్న పచ్చి అబద్ధాలను ఖండిస్తూ వాస్తవాలను వెలికి తీసే సాహసానికి పూనుకున్నారు. పోలీసులు స్థానిక బార్ కౌన్సిల్ చేత జగ్దల్ పూర్ కోర్టుల్లో వాదించడానికి బైటి వ్యక్తులు రావడానికి వీల్లేదని తీర్మానం చేయించారు. అసలు వీళ్ళు నకిలీ న్యాయవాదులని కూడా ప్రచారం చేశారు. వీళ్ళ ఆఫీసు కోసం భవనం అద్దెకిచ్చిన ఓనరును పోలీస్ స్టేషన్ కు రప్పించుకుని బెదిరించారు. గత అక్టోబర్ నుండి ఆదివాసీ స్త్రీలపై భద్రతా దళాల అత్యాచారాలు, లైంగిక హింసకు సంబంధించిన కొన్ని ఘటనలపై WSS (women against sexual violence and state repression) అనే సంస్థ మరికొంత మంది బృందం నిజనిర్ధారణ చేసింది. వీటిలో సామూహిక అత్యాచారాలతో పాటు, మహిళలను వివస్త్రలను చేసి ఊరంతా తిప్పిన కేసులున్నాయి. ఇళ్ళపై పడి మొత్తం లూటీలు చేసిన కేసులున్నాయి. వీటిపై ఎఫ్.ఐ.ఆర్ నమోదు చేయించడానికి సోనిసోరి, WSS, జగ్ లగ్ పోలీసులు, ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. అత్యాచార ఆరోపణలన్నీ మావోయిస్టు ప్రాపగాండా అని కొట్టి పడేయడానికి పోలీసులకు ఇటువంటి వ్యక్తులు, సంస్థలు అడ్డుగా ఉంటున్నాయి. కాబట్టి వీళ్ళందరినీ మావోయిస్టుల మనుషులు అని ప్రచారం చేస్తారు. పూర్వ సల్వాజుడుం అవతారంలో ఇప్పుడు సామాజిక్ ఏక్తా మంచ్, వికాస్ సంఘర్ష్ సమితి, నాగరిక్ ఏక్తా మంచ్, నక్సల్ పీడిత్ సంఘర్ష్ సమితి వంటి ముఠాలు పనిచేస్తున్నాయి. ఇవి మైనింగ్ కంపెనీలను వ్యతిరేకిస్తున్న ఆదివాసులపై, ఆదివాసుల పక్షాన నిలిచిన సామాజిక కార్యకర్తలపై దాడులు చేస్తాయి. మాలినీ సుబ్రమణ్యం వంటి వాళ్ళ ఇళ్లపై ఈ ముఠాలు దాడులకు దిగినప్పుడు "భారత్ మాతాకీ జై, దేశవ్యతిరేకులు ఇండియా వదిలి వెళ్ళాలి" అని నినాదాలిస్తారు! యూనివర్సిటీ విద్యార్థులు, కాశ్మీర్ జాతి స్వయం నిర్ణయాధికార హక్కు, అడవిపై ఆదివాసుల హక్కు వంటి వేరు వేరు విషయాలకు ప్రజాస్వామిక వాదుల స్పందన ఒకేలా ఉండకపోవచ్చు గాని సంఘపరివార్ ప్రైవేటు సైన్యం మాత్రం అన్ని చోట్లా భారత్ మాతాకీ జై అని దౌర్జన్యానికి దిగుతుంది. ఎందుకంటే ఈ పోరాటాలన్నీ వాళ్ళు రూపొందించాలనుకుంటున్న భారత దేశ నమూనాకు వ్యతిరేకం.

బస్తర్ పై ప్రభుత్వ యుద్ధానికి సాక్ష్యంగా నిలుస్తున్న వారి పరిస్థితి అట్లా ఉంది. ఇక యుద్ధక్షేత్రం ఎట్లా ఉందో/ఉండబోతోందో ఊహించగలగాలి. నాలుగు లక్షల బలగాలు, వైమానిక దాడులు, ఊర్లకు ఊర్లను తగలబెట్టే సల్వాజుడుం (సుప్రీం కోర్టు రద్దు చేసిన హంతక సల్వాజుడుం ముఠా, కోయ కమెండోలు, డిస్ట్రిక్ట్ రిజర్వ్ ఫోర్స్ పేర్లతో అధికారికంగానే కాక సల్వాజుడుం-2 గా కూడా మళ్ళీ వచ్చింది) దాడులు ఈ దేశ సంపదను కాపాడాలనుకుంటున్న మూలవాసులపై ఎక్కుపెట్టబడ్డాయి. పదేళ్లుగా జనాతన సర్కార్ స్వయం పాలనను ప్రకటించుకున్న ఆదివాసులపై కసిగా తెగబడుతున్న భారత ప్రభుత్వం మరోవైపు దేశం మొత్తాన్నీ జాతీయత, దేశభక్తి చర్చలోకి దించింది. అలజడి పడుతున్న రెండు మూడు విశ్వవిద్యాలయాల్లో విశ్వాసాల మధ్య, విలువల మధ్య, భావాల మధ్య సంఘర్షణ జరుగుతున్నది. దీని మూలం వర్గపోరాటంలో ఉన్నదని దండకారణ్యం చెప్తున్నది. మేక్ ఇన్ ఇండియా అంటే ఇండియా సంపదను కొల్లగొట్టడమే. దానికోసం ఎంత నెత్తురైనా పారించడానికి ప్రభుత్వం సిద్ధం. ఇందుకు నిదర్శనం దండకారణ్యమే. ఆదివాసీ మహిళల మాతృత్వాన్ని దేశభక్తి పరీక్షకు పెట్టిన (మావోయిస్టా కాదా అని పరీక్షించడానికి భద్రతా దళాలు ఆదివాసీ మహిళల పాలిండ్లు పిండి చూశారు- జనవరి 12 పెద్రాస్ గ్రామం, సుక్మా జిల్లా) క్రూరత్వం భారత మాతలను, భారత పుత్రికలను ఎన్ని అత్యాచారాలకు గురిచేస్తున్నదో దండకారణ్యం చెబుతోంది. భారత ప్రభుత్వ రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక విధానాలతో మొత్తంగా దండకారణ్యం తలపడుతున్నది. సోనిసోరి వ్యక్తీకరణకు కూడా అందనంతగా దండకారణ్యం, ముఖ్యంగా బస్తర్ క్షతగాత్రమై ఉన్నది. అయితే అది బస్తర్ ముఖం, దండకారణ్య ముఖం మాత్రమే కాదు. అది మొత్తంగా భారతదేశ ముఖచిత్రం. పాలకులు ప్రజల్ని ఎక్కడికక్కడ వేరుచేసి అభివృద్ధి పేరు మీద, సంస్కృతి పేరు మీద అణచివేత ప్రయోగించడానికి స్పష్టంగా వారి రాజకీయార్థిక లక్ష్యమున్నది. వర్గయుద్ధం చేస్తున్నారు గనక అది స్పష్టంగా దండకారణ్యంలో కనపడుతున్నది. సంస్కృతి, దేశభక్తి వంటివి పాలకపక్షం ధరించిన ఆయుధాలు మాత్రమే. వాటి పేరు మీద అది అమలుచేతున్న సర్వం విధ్వంసం లక్ష్య మార్గంలో సాఫీగా రోడ్డు వేసుకోడానికే. దాని కోసమే వ్యవస్థలో ఉన్న సకల ఆధిపత్యాలను అది వాడుకుంటుంది.

ప్రభుత్వం అమలుచేస్తున్న హింస, అణచివేత రూపాలన్నీ పరాకాష్టగా నేడు బస్తర్ లో తాండవమాడుతున్నాయి. దీన్ని ప్రధాన స్రవంతి చర్చలోకి రాకుండా చేయడం వారికి చాలా సులువయ్యింది. అన్నిటికన్నా ఆందోళనకరమైన విషయం ఇదే. ఇది మావోయిస్టు పార్టీ లేదా విప్లవోద్యమానికి సంబంధించిన విషయం మాత్రమే కాదు. ప్రభుత్వం ఎంత హింసనైనా ప్రయోగిస్తూ ఏ ప్రశ్నా ఎదుర్కోకుండా ఉండగలదు అనే సంకేతం కన్నా దేశానికి ప్రమాదకరమైనది ఏముంటుంది? ప్రజాస్వామిక వాదులు ప్రభుత్వ దుర్మార్గాల పట్ల, అది కూడా మీడియా ఎంపిక చేసిన విషయాల పట్ల సెలెక్టివ్ గా స్పందించే ధోరణి ఉన్నప్పుడు!



# పోరుబాట కా. కనకయ్య

## చల్లాపల్లి నరసింహారావు

ముసి ముసినవ్వులవాడా
ఉద్యమాల ఉపాధ్యాయ
చదువు అంటే జ్ఞానమని
సాయుధ పోరే నేటి చదువు అని
ప్రజా ఉద్యమాలకీ
వెన్ను దనుగా నిలిచినావా ॥ముసి॥

కళ్ళ ముందు కన్పించే
సత్యాన్ని చదవమని
పౌర హక్కుల కోసం
పోరాడమని
సమసమాజ సాధనకై
సారథివైనావా ॥ముసి॥

బూర్జువా కోర్టులలో
న్యాయం జరగదని
పిలుపునే ఇచ్చావా
వృత్తినే వదిలేవు
ప్రజాయుద్ధ పార్టీకీ
ప్రాణనాదమయినావు.... ॥ముసి॥

ఉద్యమే ఊపిరిగా
దోపిడీ వ్యవస్థను
అంతం చేయాలన్ని
కార్మిక కర్షకులను
ఒకటిగా చేసి పోరుకు
కదలమంటివా... ॥ముసి॥

నక్సల్బరీ ప్రేమికుడా
బూటకపు ఎన్‌కౌంటర్లు
జరిగినప్పుడు
కాల్చేహక్కు ఏ చట్టం
మీకుచ్చెనని నిలదీసి అడిగితివా?
అమరవీరుల బంధువులకు
ఓదార్పు ఇచ్చినావా... ॥ముసి॥

నీ అంతిమ యాత్రలో
చిన్నారి విద్యార్థిని విద్యార్థులు
మామంచి మాస్టారు
కనకయ్య లేడని
ఎక్కి ఎక్కి ఏడ్చినారు
కంటనీరు పేట్టేరు ॥ముసి॥

విప్లవాల పురిటిగడ్డ
పర్చూరు గ్రామానా
ఉదయించే సూర్యుడు
చాగంటి భాస్కరుడు
అందించిన నెత్తురు జెండా
కనకయ్య స్ఫూర్తిలో
తూరుపు సింధూరం ఎరుపెక్కింది

# ప్రజాస్వామ్యమా... ఆఆఅ... ఓ ప్రజాస్వామ్యమా...

## తంగెళ్ళ సుదర్శనం

ప్రజాస్వామ్యమా... ఆఆఆ... ఓ ప్రజాస్వామ్యమా...
ఎక్కడ నీ జాడా చివరికి నువ్ తోడూ ॥ప్రజా॥

వలసదోపిడి పాలన కుప్పగూలిపోవాలని
కార్మిక కర్షక రాజ్యం ప్రజల కొరకు నిలువాలని
పోరాడిన వీరులు భగత్‌సింగ్ రాజ్‌గురు ॥2॥
సుఖ్‌దేవ్‌ల పట్టుకొని ఉరి తీసినదే దేశం॥ప్రజా॥

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో
నక్సల్బరీ శ్రీకాకుళ రైతాంగ పోరులో
తెలంగాణ విప్లవాల వెల్లువలో కదిలినోళ్ల
జైళ్ళల్లో బంధించితే రాజకీయ ఖైదీలే ॥2॥
పోరుజేసి పొందిన హక్కులు తొక్కేస్తుంటే ॥ప్రజా॥

అడవిలోన బతికేటి ఆదివాసి బిడ్డల
కాళ్ళకింది ఖనిజాలు తవ్వుకునే కుట్రలో
పోస్కో వేదాంత జిందాల్ బహుళ జాతి కంపెన్లకు
అమ్ముడు బోయిన పాలకులు గ్రీన్‌హంట్ దాడులతో ॥2॥
ఆదివాసులందరిని అడవి నుండి తరుముతుంటే ॥ప్రజా॥

ప్రజల కొరకు పోరు జేసే విప్లవకారులమీద
నిర్బంధపు వల విసిరి అక్రమ కేసులు బెట్టి
వందలు వేలాది ప్రజల జైళ్ళల్లో కుక్కుతుంటే ॥2॥
చిత్రహింసలెన్నో బెట్టి చెరిచి చిదిమి చంపుతుంటే ॥ప్రజా॥

టాడా పోటా చట్టాలనే తలదన్ని నదీ ఊపా
ఎన్ని కేసులైన బెట్టి ఏండ్లకేండ్లు జైళ్లోబెడితే
తల్లి ఆలి పిల్లలొస్తే జాలి ములాఖత్‌లాయె ॥2॥
బెయిల్ మీద విడుదలయితే జైలు ముందే పట్టుకుంటే ॥ప్రజా॥

బ్రాహ్మణీయ హిందూత్వ శక్తులే అధికారులయ్యి
ఆదివాసి ఖైదులను మావోయిస్టులంటుంటే
ముస్లిము ఖైదీలను టెర్రరిస్టులంటుంటే ॥2॥
పేద ప్రజలు హక్కులను కాలరాచి వేస్తుంటే ॥ప్రజా॥

మొబామాల పాలనలో నల్లకోటులో న్యాయం
నరికి ముక్కలయ్యింది హైకోర్టు సుప్రీంకోర్టులు
పాలకుల పంచనజేరి భజనలే చేస్తుంటే ॥2॥
సామాన్యులకు న్యాయం సట్టుబండలవుతుంటే ॥ప్రజా॥

రాబందుల పంజరంలో చిక్కిన మన పక్షుల
విముక్తి కొరకు పోరుజేసే ప్రజలకండగుండాలి
ప్రజాస్వామ్యవాదులంత ప్రగతిశీల శక్తులంత ॥2॥
నూతన ప్రజాస్వామ్యం సాధించి తీరాలి

# కా. పులిమామిడి మద్దిలేటి స్మృతిలో

## డప్పు రమేష్

గద్వాల గడ్డమీద ఉదయించినా బిడ్డ అన్నా మద్దిలేటి
ఎర్రపూల వనంలోకి వెళ్ళిపోయినాడమ్మ మాయన్న మద్దిలేటి॥గద్వా॥

లింగన్వాయి వూరిలోన మాయన్న బుట్టిండు
గద్వాల పట్టణంలో మా యన్న చదివిండు
ఎస్సీ హాస్టల్లో ఉండి చదువులన్ని చదివిండు
రాడికల్ విద్యార్థి సంఘంలో చేరిండు
చదువుతోనే పోరాట పాఠాలు నేర్చిండు అన్నా మద్దిలేటి
కన్నీటి బతుకుల కారణాలెతికిండు మాయన్న మద్దిలేటి ॥గద్వా॥

చదువు పూర్తి జేసిండు మాస్టారు అయ్యిండు
శాస్త్రీయ విద్య కొరకు పోరు జెయ్యాలండు
సాహసి పురుషోత్తమన్నా అడుగులల్లో
హక్కుల సంఘంలో ఉక్కులాగ తిర్గినాడు
కరువు పోరాటాల్లో కత్తిలాగ మెర్సినాడు అన్నా మద్దిలేటి
ప్రజా పోరాటాల కెరటమై లేచినాడు మాయన్న మద్దిలేటి॥గద్వా॥

కృష్ణమ్మ ఒడ్డుమీద పాలమూరు జిల్లవున్న
తాగునీరు, సాగునీరు, సుక్కనీరు లేకపాయె
నీళ్ళ సాధనకు సంఘాలు ఒక్కటయ్యి
ఊరూరు కదిలినారు ఉద్యమాలు జేసినారు
ఆ పోరు సంఘాల సారథి యయ్యాడు అన్నా మద్దిలేటి
అలుపెరుగని పోరు కేకయ్యి నిలిచాడు మాయన్న మద్దిలేటి
॥గద్వా॥

పోలేపల్లి సెజ్ వ్యతిరేక పోరుజేసె
సీడ్‌పత్తి రైతాంగ సమరంలో ముందుండె
ముస్లిం సోదరుల పోరు కండగా నిల్సె
నెట్టెంపాడు ప్రాజెక్టు కట్టమని ఉద్యమించి
భరత్ సంహారెడ్డి ప్రజలల్లో ఎండగట్టె అన్నా మద్దిలేటి
హత్యా రాజకీయాలకు బెదరనండు మాయన్న మద్దిలేటి ॥గద్వా॥

తెలంగాణ జనసభ చేస్తున్న పోరుజూసి
గుండెలదిరిన ముఖ్యమంత్రి చంద్రబాబు
బెల్లి లలితక్కను ముక్కలు ముక్కలు జేస్తె
గుట్టంత బయటకు దీసుకొచ్చి పోరాడి
ఊరూర తెల్పిండు ఉద్యమంలో ముందుండె అన్నా మద్దిలేటి
హంతకులు బెదిరిస్తె బెదిరిపోనన్నాడు మా యన్న మద్దిలేటి
॥గద్వా॥

హక్కుల పోరునేత పురుషోత్తమన్నను
మెడ నరికి చంపివేసి రాజ్యం బెదిరిస్తే
పురుషోత్తమన్నది బాడీని దీసుకొచ్చి
అంతిమయాత్ర జేసి, సంతాప సభ జరిపి
స్థూపం నిర్మించేదాక నిద్ర పోనన్నాడు అన్నా మద్దిలేటి
సింహంలా నిలిచాడు శత్రువు గుండెల్లో మాయన్న మద్దిలేటి॥గద్వా॥

వై.ఎస్.ఆర్. పార్టీ అధికారంలోకి వచ్చి
చర్చలకు నక్సలైట్ల రమ్మని పిలిచినపుడు
పాలమూరు బాధల్ని పార్టీకి తెలుపంగ
ఆకుల భూమన్నతో అడవికెళ్ళినాడన్న
ఎన్‌కౌంటర్ జరిగినా కలవరపడలేదు అన్నా మద్దిలేటి
నిబ్బరంగ తిరిగొచ్చి ప్రెస్‌మీట్ పెట్టినాడు మాయన్న మద్దిలేటి
॥గద్వా॥

ప్రజాఫ్రంట్ ఉద్యమాన్ని అణిచేసే కుట్రతోని
ఆకుల భూమన్నను ట్రక్కుతోన తొక్కించి
ప్రజాస్వామ్య తెలంగాన ఉద్యమాన్ని పరిహసిస్తే
తెలంగాణ జిల్లాలన్ని తెగువతోని కదులుతుంటే
భూమన్న స్థానంలో అధ్యక్షుడైనాడు అన్నా మద్దిలేటి
కేసిఆర్‌కే పెద్ద సవ్వాలు విసిరిండు మాయన్న మద్దిలేటి ॥గద్వా॥

రైతుల రుణమాఫి జేస్తానన్నోడు
పాలమూరు పచ్చగ మారుస్తనన్నోడు
నేనొస్తె ఎన్‌కౌంటర్లుండవని చెప్పినోడు
రైతులాను సంపుతుండు మావోయిస్టుల కాలుస్తుండు
తెలంగాణ ప్రజాస్వామ్య వేదిక అయ్యాడు అన్నా మద్దిలేటి
ముప్పైయ్యారు గంటలు స్టేషన్లో బంధించె మాయన్న మద్దిలేటి
॥గద్వా॥

అరచేతి నడ్డుపెట్టి సూర్యకాంతి నాపలేరు
లాఠీలు తూటాలు విప్లవాన్ని ఆపలేవు
ప్రజాశక్తి ముందు ఏ శక్తి నిలవదన్నావు
అంతిమంగ ప్రజలదే విజయమని అన్నావు
మాటుగాసి ఉన్న ఆ అనారోగ్యముతో అన్నా మద్దిలేటి
విప్లవందే విజయమంటు ఒరిగిపోయినావన్న మాయన్న మద్దిలేటి
॥గద్దా॥

ప్రజాస్వామ్య తెలంగాణ సాధించె వరకూ
బెల్లి లలితక్క, నల్లా వసంతుల,
ఐలన్న, భూమన్న, పురుషోత్తమన్నల
ఆశయాల సాధనకు అడుగు ముందుకేస్తాము
పులిమామిడీ మా మద్దిలేటన్నా అందుకో జోహార్లూ....
ఉద్యమాల ముద్దుబిడ్డ మద్దిలేటన్నా విప్లవాల జోహార్లూ...

## సరస్వతి సాలెగూడైంది

### సంపత్ సోమయ్య

నేల రాలిన ఆకుసూపుతుంది
కనిపించని ఎండ కూల్చిందని తన కాడతో
మెడకోసిన కోడి చంగున ఎగిరి
నెత్తురు సల్లుతుంది హంతకుడీడేనని

ఏలుతో హెచ్చరించే అంబేడ్కర్ వారసుడవై
శత్రువును గుర్తించవా?
నీ మరణ వాంగ్మూలంతో శత్రువును దాస్తావా?

ఎనకటి కాలం ఎగిరొస్తుందా
తిండి తినొద్దని మా సంస్కృతి మీద దెబ్బ
కాలం గుర్తులు చెప్పే విజ్ఞానం మీద దెబ్బ
ఏందీ ఘోరం

సరస్వతి సాలెగూడైంది
కనిపించని జిగుడు జంఝం
ఇల్లంతా ఆక్రమించింది
పురుగుల స్వర విహారం తుమ్మిస్క బలి

ఏకలవ్యుని ఏలేకాదు, శంభూకుని తలే కాదు
అక్షరాన్ని మింగిన ఈ కలియుగ
కూర్మావతార పందులను ఏం చేయాలి

భిన్నత్వం లేదు అంతా ఏకత్వమే
రాజ్యాంగం తప్పుకాదు రాజు విధానమే తప్పు
అన్న అంబేద్కర్ మాటలు
అక్షరాలా నిజమయితన్నయి

ఓటు కాదు సీటు కాదు
రాజ్యాంగపు హక్కులకు కాలరాస్తున్న
ఈ చీకటి దొంగల బయిటికి లాగుదాము

నివురు గప్పిన హోమ గుండంలో నిప్పు రగుల్తనే ఉంది
పంది పియ్యి ఆవు నెత్తురు ఉచ్చతో తడిపేద్దాం
నిచ్చన మెట్లను బల్లపరుపుగా మార్చుకుందాం
కులమేదైనా మనిషేగా

## మైలపడ్డ ఆకిలి

### కొమ్ము సుధాకర్

పగులు నేతిరి మతిల యుద్ధ గడియలు
సుద్దీ కత్తికోకండయి తెగిపడ్డ కులాల మర్మం ఎంకులాట
పాదముద్రల నిశేదం మతమై మరణవాంగ్మూలం

అవమానం పొరలు పురి పేనుతున్న గాయం ప్రశ్నై
జగిసిన ఫ్లెక్సీముడి ఆగిన గాలిపంకల జీవి

ఉన్మాదం కాలుదువ్విన కైలాట్కం మంత్రగత్తె ఉత్తరం
కదలని వోయిల్ల రేపటితరం మేధస్సు ముద్దై
బతుకు అండతెగిన గబ్బిలమయి
మాపటి పొద్దుకు బేడమిర్కిన తలుపురెకలగేలి

గుడారం సిలికివనికి తల్లడిల్లిన తనువు వెలివాడ
ఆత్మ దిక్కుల తోవ్వల దళదోల్గిన కన్నీటి కుండయి
మైలపడ్డ ఆకిల విశ్వవిద్యాలయం

పొంచి ఉన్న ప్రమాదం
మతం నెత్తె బాలింతయి పాలిచ్చిన క్రూర జంతు సంచారం...

బడీ గుడీ పేట వీథి చౌరస్తా
మరువలేదింక మడుగుల దిగతొక్కిన
కారంచేడు పల్లెను క్రైస్తవమన్న వొంకల
మూలం బలం తొల్సిన శిక్ష వర్ణ కుట్ర!!
కనిపెట్ట లేమా ఉండీ లేని తండ్రిని దేవులాడిన
లగుడ జాడ గునం!!

ఇప్పుడు తల్లి కులమో తండ్రి కులమో కాదు సమస్య
మనువాదం చేసిన హత్యలే నడుస్తున్న పెద్ద సమస్య
దేశం కాశాయికరణ కాటుకు పుషిగొల్పుడే
ఇక్కడ దళితుల మరణాల అసలు సమస్య

అణిచివేతే పెద్ద బాలశిక్షయి అతారల పంపకం
మదరపాలు అడ్డాలై బలహీనుల తలనరుకుతున్నై
ఇగ యాడుంది వఫాదరీ కిస్(చొ) కోర్టులుంది ఇమాన్దారి

ఇన్సానియత్ ఈ భూమి ఇఫాజాత్త్ అడుగుతుంది
ఇప్పుడన్నా మేలుకో సబ్బుం వర్ణ మర్మమనిషీ
మతానికి కులానికి ష అనేదే మాస్టర్ కీ
చూపుడు వేలే నీ ఆధార్ కార్డ్ మూలవాసీ
ఆర్యుడు పరదేశి

# ప్రేమలేఖ

**శాఖమూరి రవి**

ఆ రోజు
అమావాస్య
మాట తప్ప
మనుషులెవరు
కనిపించని సమయం

అందమైన చంద్రుని లాంటి
అతని ముఖం
నా కళ్ళను కట్టేసి
నేను అతన్ని ఇష్టపడేలా చేసింది

అందమైన ఆ రాత్రుల్లో
పక్షుల అరుపులే
సెంట్రి కాస్తున్న సమయం

అతని నోటి వెంట రాలే
మద్దిపూల పరిమళం
కరిగే మంచులా
నా మనస్సును ప్రవహింప చేస్తే
నేను అతన్ని ప్రేమించకుండా ఉండలేకపోయాను

మొన్ననే
మొన్న మొన్ననే
చల్లని గాలుల
వెన్నెల రాత్రుల్లో

మా గుట్ట కింద
కాలువ గట్టులో
ముగ్గు తోడుతుంటే
నా అందమైన చంద్రుడు
నా మట్టి పూల పరిమళం
మధ్య భారత విప్లవ పరిమళాన్ని వివరిస్తూ

ఈ సంక్రాంతికి
అమరుల స్థూపంతో
మతోన్మాద
విస్థాపన జీవన చిత్రం ఉట్టి పడేలా
చెల్లెను ముగ్గేయమంటూ
రాసిన ప్రేమలేఖ నా చేతికందింది

నా కళ్ళను కట్టేసి
నా మనస్సును
ప్రవహింపచేసిన
నా పుట్టపాక మట్టి పరిమళం
విస్తరించిన విశాలమెంతో
ప్రేమించబడే జనసంద్రమెంతో

# బలమైన బంధాలు

**ఎ.ఎస్. వసంతకుమారి**

కొన్ని పరిచయాలు
మరపురానివి, మలుపుతిప్పేవి

కొన్ని బాటలు
అసంపూర్ణమైనవి, సగంలోనే ముగిసేవి

కొన్ని సంగతులు
బలహీనమైనవి, భారాన్ని పెంచేవి

కొన్ని ఘర్షణలు
సంఘర్షణలు, పరిపక్వతనిచ్చేవి

కొన్ని అసహాయతలు
అసందర్భమైనవి, అధిగమించాల్సినవి

కొన్ని బంధాలు
బలమైనవి, వదులుకోలేనివి

కొన్ని గాయాలు
లోతైనవి, పూడ్చుకోలేనివి

కొన్ని సందర్భాలు
విలువైనవి, స్పందనలను కూడగట్టేవి

కొన్ని జ్ఞాపకాలు

నిగూఢమైనవి, మనసు పొరలలో నిక్షిప్తమైనవి

రాజ్యహింసా రూపాలు
కళ్ళముందున్న కటువైన సత్యాలు

కొన్ని స్వప్నాలు
సమసమాజ నవ నిర్మాణ పునాదులు

ఎన్నో పోరాటాలు
క్రాంతి కాగడాలు, పీడిత ప్రజల ఆశాదిశలు

అన్ని సందర్భాలు
మీ త్యాగాల స్ఫూర్తి స్మరణాలు
మాలో నిండిన సజీవ సంఘర్షణ రూపాలు

# దారులు వేద్దాం..!

## కెక్యూబ్ వర్మ

ఇప్పుడు మూసుకుపోతున్న దారులను
తెరచే పని చేయాలి

ఒక్కో నదినీ ముక్కలు చేస్తూ ఎక్కడికక్కడ
గోడలు కడుతున్నాడు వాడు

ఇప్పుడు నదీ ద్వారాలను స్వేచ్ఛగా
తెరచుకోనివ్వాలి

ఒక్కో పర్వతాన్నీ పిండి చేస్తూ వాడు
గుండెల్ని తవ్వి ఎత్తుకు పోతున్నాడు

పర్వత పాదాలతో పాటు శిఖరాన్ని
నిబ్బరంగా ఎదగనివ్వాలి

నిటారుగా దారు వృక్షాలతో కలకలలాడుతున్న
పచ్చని అడవిని నరుక్కుపోతున్నాడు వాడు

నేల లోతుల్లోకి వేళ్ళని జొనుపుతూ ఆకాశాన్ని
అందుకునేలా పాతుకోనివ్వాలి

సాగర తీరాన ఇసుక లోతుల్లోకి చొరబడి
అలలనే మింగేయడానికి వస్తున్నాడు వాడు

గర్భంలోంచి ఎగసిపడే అలల కెరటాలను
తీరందాకా చేరనివ్వాలి

నిన్నూ నన్నూ మాంత్రిక పాచికలతో జూదరులను చేస్తూ
వాడు ఉనికినే తుంచుకుపోతున్నాడు

నేలను ఆనిన పాదాలతో వాడి గుండెలపై
ఎగిరి తన్ని తరిమేయాలి

# సాగర సందర్శన

## కృపాకర్ మాదిగ

నాగార్జున సాగరం కాదది
కూలి దుక్కాల మడుగు
కూలిన జీవితాల గొడుగు
మా అమ్మా అయ్యల చెమట గింజల ఒడి
కాబోయే బియ్యపు మడి
మా ఆకలి పొలం లో మెతుకుల కలల గిన్నె
కమ్మ, కాపు, రెడ్డి, రాజుల నీటి గింజల పాతర!
మా వొంటి మీద ఇంకిపోయిన కలల ఉప్పు సాగరం
దమనాల్నీదుక్కాల్నీ జాడించిన ఆరామం
బానిసల శ్రమను మూడు పంటలా
మెక్కుతున్న రాతి జాతర!
మా కష్టాలు పెంచిన కన్నీటి కుంట
ఊళ్లను మింగిన దేవర
ఈ దేవళం లో మాకు ప్రవేశం లేదుర!

# అంటరాని స్వప్నం

## మోతుకూరు శ్రీనివాస్

నల్లని రోజు
కాషాయపు రంగు
విశ్వవిద్యాలయం
మను వలయమై
సత్య శోధకుడికి
విషమిచ్చిన కులోన్మాదం
ఉరిపోసుకున్న
వెలివాడ కంఠం
దగ్ధమైన నల్లక్షరం
చెదిరిన
అంటరాని స్వప్నం
అంబేడ్కర్ అక్షరం
ఆయుధమైంది
విశ్వ మానవుడ్ని
వాగ్దానం చేసింది
(పరిశోధక విద్యార్థి రోహిత్ స్మృతిలో)



# కామ్రేడ్ పొజ్జె ఉత్తరం

**షహీదా**

"ఇయ్యాల ఎట్ల జేసి ఉత్తరం రాసేయాలి. రెండ్రోజుల్లో ఇడుమాల్ దాదావాళ్లు వెళిపోతారని చెప్పారు," ఉదయం ఆరింటి సెంట్రీకి పోతూ అనుకుంది యిర్వై ఏండ్లు యింకా నిండని పొజ్జె.

దారిలోనే ఉన్న ఆ క్యాంపు 'బి' టెంట్ వద్ద ఆగి సజొంతి ఉందా అని చూసింది. లేదు. అడిగితే, "సెంట్రీ నుండి ఇంకా రాలేదు," అని చెప్పింది రీనా.

"పొజ్జె పదింకిటి సెంట్రీ అయినంక వస్తానంటని చెప్తావా?" అడిగింది పొజ్జె.

"ఆ, కన్పిస్తే చెప్తాను," అంది రీనా.

"కన్పిస్తే కాదు రీనా, జర చూసి చెప్పు," అంది పొజ్జె బతిమాలుతున్నట్టుగా.

"ఇంగో," అని నవ్వింది రీనా.

పొజ్జె తృప్తిపడి చిరునవ్వుతో సెంట్రీ గుట్టనెక్కసాగింది.

'దక్షిణ బస్తర్ నొదిలి మాడ్ కొచ్చి ఏడాదే అవుతోంది. వచ్చిన నాలుగు నెలలకు 'మంచిగనే ఉన్నా' అని ఇంటికి ఉత్తరం రాసిన్నంటే యిక అంతే. ఊకే రాయనీకి గూడా ఏం ఉంటుంది? అని తర్వాత రాయలేదు. కానీ ఇడుమాల్ దాదా చెప్పిన రిపోర్టు విన్నాక రాస్తేనే మంచిదనిపిస్తుంది. సజొంతితో అంటే రాస్తేనే మంచిదంది తను కూడా. ఒకటే కుటుంబం, ఒకటే పంచాయితీ జనతన సర్కార్ కనుక తనకూ అన్న పరిచయమే. ఇద్దరం అనుకుని మంచిగా రాయాలి.'

రిపోర్టు విన్నప్పటి నుండి ఎన్ని పనుల్లో బిజీగా ఉన్నా పొజ్జెకు తన పెద్దన్న మనసులో మెదుల్తూనే ఉన్నాడు.

* * *

పదింటికి సెంట్రీ అయిపోగానే 'సజొంతి ఉందో లేదో' అనే తెలీని ఒక ఆత్రుతతో గుట్ట దిగింది పొజ్జె. అప్పుడే చదువు నేర్చుకునే పిఎల్‌జిఎ కామ్రేడ్స్‌కు స్కూలు చెప్పడం పూర్తి చేసి టెంటు నుండి బైటకొచ్చింది సజొంతి. ఆమెను చూడగానే పొజ్జె ముఖం విప్పారింది.

"నీకిప్పుడు ఏం డ్యూటీ లేదుగా, ఇంటికి రాయాల్ననుకున్నం కదా?" అడిగింది పొజ్జె.

"నీ గురించే చూస్తున్న. ఏపిటి కి పోవాల్నట. పదకొండున్నరకు," అంది సజొంతి ఎట్ల చేద్దామన్నట్టు పొజ్జె కేసి చూస్తో.

"ఎక్కువ విషయాలేం లేవు...," అంటూ ఆగింది పొజ్జె కొంచెం నిరాశగా, కొంచెం ఆశగా.

"సరే, ముందైతే రాద్దాం. మేం తిరిగి వచ్చేవరకూ చీకటైతది కావొచ్చు. ఇప్పుడు పూర్తి కాకుంటే రాత్రికి పూర్తి చేద్దాం, దా," అంది సజొంతి పొజ్జె ముఖంలో కదుల్తున్న భావాలను అర్థం చేసుకున్నట్టుగా.

"ఇంగో," అని తన కిట్టు 'బి' టెంటులో సజొంతి చూపిన కాడ పెట్టి తుపాకీ నేలనాన్చి అక్కడే కూచోబోయింది పొజ్జె.

"టెంట్ల వద్దులే, ఎండెక్కితే వేడిగా ఉంటుంది. చెట్టు కింద కూచుందాం," అంటూ సమావేశాలప్పుడు తీసుకెళ్లడానికి ఉంచుకున్న చిన్న జిల్లీని పరచింది సజొంతి.

"నాక్కూడా ఈ టెంట్లల్ల ఎప్పుడూ మంచిగా అన్పించదు, చెట్ల కిందే బాగుంటుంది," అని నవ్వుతూ తన నోటుబుక్కు, పెన్ను సజొంతి చేతిలో పెట్టి కూచుంది పొజ్జె.

సజొంతి ఖాళీగా ఉన్న పేజీని తెరిచి, 'చెప్పు' అన్నట్టు చూసింది. పొజ్జె కొద్దిగా సిగ్గుగా నవ్వింది. ఏమనలేదు. ఎట్ల మొదలవ్వాలి?

"ఎవరి పేరు మీద రాద్దాం?"

"అమ్మ, నాయినల పేరు మీదే రాద్దాం కదా?"

"మరి అన్న గురించి అంటివి కదా?"

"ఊ, అదే, ఎట్ల చేద్దాం?"

ఇద్దరూ కాసేపు ఆలోచించారు.

"అమ్మావాళ్లకు ఒకసారి రాసినవ్ కదా, అన్నకు రాద్దామా?"

"కానీ అన్న కూలికి పోతే ఎన్నడు తిరిగొస్తడో?"

"సరే అయితే, అమ్మావాళ్లకు రాసి అండ్లనే అన్నకూ రాద్దాం, ఉంటే ఇస్తరు, లేకుంటే వచ్చినంక ఇవ్వమని రాద్దాం," అని 'సరేనా?' అన్నట్టు చూసింది సజొంతి.

పొజ్జె చిరునవ్వుతో తలూపింది.

అలవాటుతో "ప్రియమైన కామ్రేడ్స్," అని మొదలుపెట్టి పొజ్జె కేసి చూసి నవ్వింది.

"ఏంటి?"

"కామ్రేడ్స్ అని రాసిన," అనడంతో ఇద్దరూ గలగలా నవ్వుకున్నారు.

"ఊ, ప్రియమైన అమ్మా నాన్నలకు అని రాసిన, చెప్పు."

"నేను మంచిగనే ఉన్నా. ఇంట్ల అందరూ మంచిగనే ఉన్నరు కదా. నేను ఇక్కడకు వచ్చినంక ఒక చిట్టీ పంపిన. మీకు అందింది అనే అనుకుంటున్న," అని ఆగింది పొజ్జె.

రాసింది సజొంతి. పొజ్జె ఇంకేం రాయాలి అని ఆలోచిస్తుంట సజొంతినే అందించింది.

"అమ్మకు పానం బాలేదన్నవు, మీ అక్క మాసెకి బిడ్డ పుట్టిందన్నవు, అవన్నీ రాయనా?"

"ఆ, ఆ, రాయి," అంది పొజ్జె. సజొంతి కలం నుండి వెలువడుతున్న అక్షరాలను అబ్బురంగా చూస్తూ.

'అందుకే సజొంతి కాడికొచ్చిన. తను నాకంటే మూడేళ్లు ముందే ఇటొచ్చినా అక్కడి విషయాలన్నీ తెలుసు, ఓపిగ్గా ఉంటది

కూడా, ఎంత బాగా రాస్తోందో! అక్షరాలూ అందంగా ఉన్నాయి, ఇప్పుడుగానూ రాస్తోంది. నేను ఎప్పటికి అట్ల రాస్తనో,' అనుకుంది పొజ్జె.

ఇంకా అట్లనే ఇంటి విషయాలు కొన్ని ఇద్దరూ అనుకుని రాశారు. ఇంతలో రీనా వచ్చి, "ఇంకా ఇక్కడే వున్నవా? ఏపిటికి పోయేటోళ్లు కిచెన్లో తింటున్నరు," అనడంతో సజొంతి వాచీకేసి చూసుకుని నోటుబుక్కు, కలం పొజ్జెకిచ్చేసి లేచింది.

"రాత్రి నేనే మీ టెంటుకు వస్తా, మేం ఎప్పుడు వస్తమో తెల్వదు కదా," అంటూనే ప్లేటు తీసుకుని కిచెన్ కేసి ఉరికింది సజొంతి.

* * *

తన 'సి' టెంటుకు వచ్చి కిట్టు దించుకుని తమకు సెంట్రీ, ఇతర డ్యూటీలు వేసే వసంతి కోసం చూసింది.

"అదేదో వేరు దొరికిందట, దాన్ని చితక్కొట్టి నీళ్లల్లో వేస్తే చేపలు తేల్తాయంట కదా, వసంతి, ఇంకొంతమంది మడుగు కాడికి పోయారు," చెప్పాడు రాజు.

'కొంచెంసేపైతే అన్నం తినే టైమైతది, కిచెన్ అటే వుంది కదా' అనుకుని ప్లేటు తీసుకుని మడుగు కేసి నడిచింది పొజ్జె.

అక్కడ చాలామంది కామ్రేడ్స్ మోకాళ్ల పైకి ప్యాంట్లు ఎత్తి, ఆ వేరు కలిపాక పైకి తేలుతున్న చేపల్ని పడుతున్నారు. అంతా కోలాహలంగా ఉంది. వసంతి కూడా కనిపించింది గానీ దూరంగా ఉంది.

పొజ్జెని చూడగానే ఆమె ప్లాటూన్ కమాండర్ మంగ్తు, "దా, దా పొజ్జె, చేపలు పడుదువు," అని పిలిచాడు.

పొజ్జె ప్లేటు చూపించింది.

"తిందువులే, మేమూ వస్తాం కదా, ఇంకా టైముంది, దా, దా," అన్నాడు మళ్లీ.

మామూలుగానైతే అడగకున్నా దిగేదే. బస్తర్లో పుట్టి చేపలు పట్టడానికి రమ్మని ఎవరితోనైనా అడిగించుకోవడమా? అందులోనూ మంగ్తు దాదా పిలిచాక ఆగడమా? కానీ ఇవాళ ఎందుకో పొజ్జెకి ఉత్తరం మీదే ఉండి ఇంక దేని మీదా మనసు నిలవడం లేదు.

"కమాండర్ చెప్పినంక రానంటున్నవ్, క్రమశిక్షణ ఉల్లంఘిస్తున్నవ్," అన్నాడు మంగ్తు వదలకుండా.

నిజమా? అన్నట్టు చూసింది. కానీ మంగ్తు కళ్లల్లో నవ్వు అర్థమై కిలకిలా నవ్వింది.

మంగ్తు నవ్వి, 'పో' అన్నట్టు తలూపాడు. అట్లే కాసేపు నుంచుని ఎన్ని చేపలు దొరుకుతున్నయో చూసి కిచెన్ కేసి నడిచింది.

తినేశాక వసంతి కోసం ఎదురుచూస్తూ ఊరికే ఉండడం ఎందుకన్నట్టు కిచెన్ డ్యూటీలో ఉన్న శాంతి రాత్రి కూర కోసం వెదురు కరుకు తరుగుతుంటే తనూ తన తూటాల పోచ్ లోంచి చాకు తీసుకుని తరగడం మొదలెట్టింది.

"శాంతీ, ఉత్తరం రాశావా ఇంటికి?" అడిగింది పొజ్జె.

"ఊఁ, నిన్ననే రాసి ఇడుమాల్ దాదా వాళ్ల గార్డుకిచ్చాను. నువ్వు?"

"ఇంకా పూర్తి కాలేదు. రాత్రికి పూర్తి చేయాలి. సజొంతి వస్తానంది."

"సజొంతి వాళ్ల సెక్షన్లో ఉన్నప్పుడు నాక్కూడా తనే రాసి పెట్టేది."

"ఇప్పుడు?"

"ఇప్పుడు నేనే రాస్తున్న. రాశాక ఆసుమతికి చూపిస్తా, ఏమన్నుంటే తను సరిజేస్తది. తర్వాత సాఫుగా రాసి పంపిస్తున్న," అంది శాంతి.

అలా అంటున్నప్పుడు శాంతి ముఖంలో కదులాడిన తృప్తిని చూస్తే పొజ్జెకి మంచిగా చిరునవ్వు నవ్వింది. శాంతి కూడా నవ్వింది.

"నాకు ఎన్ని రోజులు పడుతదో ఇంకా."

"రోజూ నోటుబుక్కులో రాస్తుండాలె. ఇస్కూలులో మంచిగా శ్రద్ధ పెట్టి చదవాలి. తొందరగానే వస్తది."

"భర్తీ అయినంక ఎన్ని రోజులు పట్టింది శాంతీ నీకు?"

"ఇంటికాడ కొంత నేర్చిన కదా, తప్పులు లేకుండా రాయనీకే నాకు టైం పట్టింది."

"ఇస్కూలుకు పోయినవా?"

"లే, మిలీషియాలో నేర్చుకున్నదే."

"నేనూ మిలీషియాలోనే మొదలుపెట్టాను, అక్కడ మాకు సజొంతి లాంటి గురుజీలు ఎవరూ లేకుండె. కొద్దిగా వచ్చినవాళ్లు మిగతావాళ్లకు నేర్పేది. ఇంతలోనే భర్తీ అయిన, తొందర్లోనే ఇటు వచ్చిన. ఇక్కడా రోజూ ఇస్కూలుకు పోయేలా ఉండదు కదా, డ్యూటీలుంటయి... "

"ఊఁ, కానీ డ్యూటీలు చాలా ముఖ్యం కదా. పిఎల్జిఎ సభ్యులమంటే మనం ఎంత మంచిగా మన డ్యూటీలు చేస్తే అంత మంచిగా మన లడాయి ముందుకు పోతది, వాటిలో ఎప్పుడూ వెనుకబడకూడదు. కానీ మనం మన డ్యూటీలు ఇంకా మంచిగా చేయాల్నంటే, ఇంకా వికాస్ చెందాల్నంటే మనకు చదువు రావాలి కూడా, అందుకే రెండూ జరిగేలా ప్లాన్ చేసుకోవాలె..."

"ఆహా, డ్యూటీలు చేయాల్సిందే. సభ్యులంటే తక్కువ అనుకోవద్దు, మీరు సరిగా పని చేయకపోతే విప్లవంలో జరిగే అన్ని పనుల మీదా ప్రభావం పడుతుందని మంగ్తు దాదా ఎప్పుడూ చెప్తుంటాడు. వసంతి కూడా వీలైనంత వరకు ఇస్కూలు టైంలో చదువు నేర్చుకునేవాళ్లకు డ్యూటీలు పడకుండా చూస్తది. కానీ మనుషులు తక్కువై పన్లు ఎక్కువైతే తను మాత్రం ఏం చేస్తది. శాంతీ, ఎంతైనా ఇంటికాడ నేర్చుకుని ఉంటే వేరు కదా, ఇంత టైం పట్టదు."

"నిజమే, కానీ ఏం చేద్దాం, ఇప్పటికీ చాలా ఏరియాల్లో మన స్కూల్లు లేవు. ఉన్నవి కూడా ఈ గ్రీన్హంట్ దాడుల్లో ఎంతకాలం నడుస్తయో. మన ఏరియాలోనేమో మన చిన్నప్పుడు ఇస్కూల్లు లేకుండె, జనతన సర్కార్ ఇస్కూల్లు మన ఏరియాకు వచ్చేవరకూ మనకు మిలీషియాలో చేరే వయసొచ్చింది, తర్వాత ఇటు," అని నవ్వింది శాంతి.

పొజ్జె కూడా నవ్వింది. ఇంతలో వసంతి కనిపించడంతో చాకుని తుడిచి పోచ్లో పెట్టుకుని అటు వెళ్లింది పొజ్జె.

"వసంతీ, నా సెంట్రీ మళ్లెప్పుడు? ఇయ్యాల ఇంకేమైనా

పన్లున్నయా?" అడిగింది పొజ్జె.

"రాత్రి ఎనిమిదికి పడచ్చేమో, ఏం?"

"సజొంతి వస్తానంది. ఉత్తరం రాయాలె ఇంటికి, పది తర్వాత వేస్తావా? కుదురుతుందా?"

వసంతి అన్నం తింటూ కాస్సేపు ఆలోచించింది. ఇక్కడికొచ్చిన ఏడాదిలో పొజ్జె ఒక్కసారి కూడా ఇట్ల అడిగింది లేదు. ఏ పనన్నా ఠంచనుగా చేస్తది. తనూ ఇప్పటికే రెండు సెంట్రీలు వేసుకుంది. పొజ్జె తనకేసే ఆత్రుతగా చూడ్డం చూసి, 'సరే అంతగా అయితే మూడోదీ చేద్దాం,' అనుకుని,

"మన ప్లాటూన్ నుండి కూడా ఏపిటి కి పోయిన్రు. మనుషులు తక్కువ ఉన్నరు. సరేలే, ఎట్లయిన చేద్దాం. ఒకవేళ వాళ్లు ఏపిటి నుండి రావడం లేటయితే..."

వసంతి పూర్తి చేయకుండానే, "అట్లయితే వసంతి కూడా రాదు కదా, అప్పుడు ఎనిమిదింటికే చేస్తా. ఇంకేంది ఇయ్యాల?" అంది పొజ్జె.

"పుట్టకొక్కులు తేనీకి పోతవా?"

"పోతా."

"సరోజ వాళ్లు పోతున్నరు. కలువు."

* * *

ఎనిమిది అవ్వొస్తుంది. ఏపిటి కి పోయిన వాళ్లు రాలేదు. దాంతో పొజ్జె సెంట్రీకి వెళిపోయింది. పదింటికి సెంట్రీ దిగి వచ్చి, 'ఇక ఉత్తరం రేపే అయితది' అని నిట్టూర్చింది. తన జిల్లీ దులుపుకుని పడుకుంది కానీ రోజూలా ఇవ్వాళ నిద్ర రావడం లేదు.

'నేను ఇంటి కాడ ఉన్నప్పుడు అన్న కూడా మిలీషియాలో మంచిగనే పని చేస్తుండె. నేను భర్తీ అవుతానని ఇంట్ల చెపితే కూడా వ్యతిరేకించలేదు. కానీ ఇప్పుడు ఎందుకు యిట్ల దూరమైతుండు? నేను పార్టీలో ఉన్ననని కూడా ఆలోచిస్తలేడు ఎందుకు? నేనంటే ఎంతో ప్రేమగా ఉంటుండె. ఇడుమాల్ దాదాను విడిగా కూడా అడిగాను. ప్రత్యేకం ఏం జరగలేదు, అటు కేంద్రంలో, రాష్ట్రంలో బిజెపి వచ్చినంక గ్రీన్‌హంట్ దాడులు బాగా పెరగడంతో కొందరు అట్ల అయితున్నరు అన్నడు. చూద్దాం, నేను ఉత్తరం రాస్తేనన్నా ఆలోచిస్తడేమో. ఏ రంది లేకుంట మంచిగా ఉండి అన్నీ నేర్చుకుంటున్న పార్టీలో. మొదటిసారి ఇట్ల రందిలా అన్పిస్తుంది. అన్న ఇట్ల చేయకుంటే మంచిగుండె.'

కన్నంటుకునే వరకు పొజ్జె లోపల ఇవే ఆలోచనలు సుళ్లు తిరుగుతూ ఉండినయి. కానీ కొద్దిసేపటికే ఎప్పట్లా గాఢంగా నిద్రపోయేసింది.

* * *

"మనం ఈ క్యాంపు ఏర్పర్చుకున్న మీటింగు పూర్తయ్యింది. సాయంత్రం జెండా దించుతరు. రేపు అందరం ఎవరి ఏరియాలకు వాళ్లం పోవాలి. ఇవ్వాళ అంతా కెమోఫ్లేజు చేయాలి. డ్యూటీలు వేస్తరు. ఒక ఏపిటి కి కూడా పోవాలి. పోవల్సినవాళ్ల పేర్లు వసంతి తర్వాత చెప్తది. ఇంకేమన్నా ఉందా?" అడిగాడు మంగ్తు ఉదయం రోల్‌కాల్‌లో.

అందరూ 'ఏం లేదు' అనడంతో రోల్‌కాల్ ముగించాడు మంగ్తు.

ఎక్సర్‌సైజులు కూడా లేవు ఇవ్వాళ. అందరూ ఎవరికి డ్యూటీలు వేసినకాడికి వాళ్లు వెళిపోయారు. డ్యూటీ చేసి టిఫిన్ తిని సజొంతి కాడికి పరుగులాంటి నడకతో వెళ్లింది పొజ్జె. దారిలోనే ఎదురైంది ఆమె.

"నీ కాడికే వస్తున్న. రాత్రి బాగా లేట్ అయ్యింది, అందుకే రాలే."

"తెలుసు. మా టెంట్ల వాళ్లు కూడా మీతో వచ్చిండ్రు కదా. ఎట్ల మరి, రాద్దామా?"

"ఇడుమాల్ దాదా రేపు పోతున్నాడు కదా, మాట్లాడతా రమ్మన్నడు. అటే పోతున్న. రాగానే నీకాడికే వస్తాను. ఉంటావు కదా?"

"ఉంటాను. ఇడుమాల్ దాదాని మళ్లొకసారి అన్న గురించి కూడా అడుగు. నేను అడిగాను గానీ...."

"ఇంగో," అంటూ సజొంతి ఇడుమాల్ టెంటు ఉన్నవైపు పోవడంతో పొజ్జె ఏం చేద్దాం అన్నట్టు ఒక్క నిమిషం అక్కడే నిలబడింది.

"ఏమో దాదాకు ఎక్కువ టైం లేకపోతే సజొంతి తొందరగానే వస్తదేమో. టెంట్లోనే ఉంటే మంచిది," అనుకుంటూ వెనక్కి తిరిగింది.

తిరిగి వచ్చేవరకూ స్కూలు మొదలైంది. తనూ తన పుస్తకాలు తీసుకుని అందులో కలిసింది.

పదింటికి స్కూలు పూర్తయ్యింది కానీ సజొంతి జాడ లేదు.

'స్నానం చేస్తే బాగుండు. రెండ్రోజులైతుంది. రేపు ప్రయాణమే ఎటూ,' అనుకుంది. 'కానీ పోయాక సజొంతి వస్తే ఎట్ల? ఈ ఉత్తరం పని అయిపోతే కానీ ఏదీ మనసుకు పట్టేలా లేదు,' అనుకుంది.

చెట్టు కింద జిల్లీ వేసుకుని కూర్చుని ముందు రోజు రాసినమేరకు ఉత్తరాన్ని చదవడం మొదలుపెట్టింది. ఇంతలో సజొంతి రానే వచ్చింది.

"ఏమన్నడు దాదా?" కుతూహలంగా అడిగింది పొజ్జె.

"ఏం లేదు. నేను వచ్చి మూడేండ్లు అయితుంది కదా, ఎట్లున్నవు ఏంది, ఎట్ల వికాస్ అయితున్నవు, ఏమాలోచిస్తున్నవు అని తెలుసుకున్నడు అంతే," అంది సజొంతి కొంత సంతోషంగా.

పొజ్జెకి కూడా అలా అడిగిండంటే మంచిగా తోచి చిరునవ్వు నవ్వింది.

"నీకెప్పటి సంది తెలుసు అన్న?"

"ఇంటికాడ ఉన్నప్పటి సంది తెలుసు. నేనిటు వచ్చినంక ఎప్పుడు కలిసినా తప్పక మాట్లాడతాడు. నాతోనే కాదు, మన డివిజను నుండి ఎవరు ఎక్కడకు పని చేయడానికి వెళ్లినా వాళ్లు కలిసినప్పుడు వాళ్ల వికాస్ గురించి తప్పకుండా తెలుసుకుంటాడు. అందరూ అంటారు."

"రిపోర్టులో కూడా అందరి కుటుంబాల గురించి ఎంత వివరంగా చెప్పిండు కదా. అన్నకు చాలా ఓపిక."

"ఓ, అన్నకు తెల్వని కుటుంబం లేదు. అన్న మన ఏరియాకు వచ్చి ఎన్ని ఏండ్లు అయితుందో తెలీదు, కానీ ముసలోల్లు కూడా

గుర్తుపడతరు. అప్పుడు ఊర్లల్లోనే ఎక్కువ ఉండేదట. అట్ల అందరి ఇండ్లు, ఇండ్లల్లో ప్రతి ఒక్క మనిషి వాళ్లకు తెలిసేదట. అన్న ఏ డివిజనుకు పోయినా మన డివిజను నుండి భర్తీ అయ్యి అక్కడ పని చేసేవాళ్లకు గంట, రెండు గంటలు అక్కడి రిపోర్టు అంతా చెప్తాడు. అన్ననే కాదు, పై కమిటీ కామ్రేడ్స్ అంతా అట్లే చేస్తరు. ఒక డివిజను నుండి ఇంకో డివిజనుకు పోయినా వాళ్లకు తమ పాత ఏరియా విషయాలు అన్నీ తెలవాలి కదా."

"ఇంగో. అట్ల తెలిస్తేనే మంచిది. నేనిదే మొదటిసారి వినడం. నేనిటు వచ్చాక అన్న రావడం ఇప్పుడే కదా."

"ఊ, సమావేశానికని వచ్చిండు, నీ గురించి కూడా అడిగిండు, మంచిగనే ఉంది అని చెప్పిన, మళ్లీసారి తప్పక మాట్లాడ్తాను తనతో, ఇప్పుడిక టైం లేదు అన్నాడు," అని సజొంతి అనగానే పొజ్జెకి చాలా సంతోషంగా తోచింది.

'పొజ్జెని మంచిగా నిలబెట్టుకోవాలె, మంచి కామ్రేడే అని రిపోర్టు వస్తున్నది. మీరంతా ఆమెకు విషయాలు చెప్తూ సహాయం చేయాలి,' అని అన్న చెప్పిన మాటల్ని సజొంతి పొజ్జెకు చెప్పలేదు. అవి చెప్పేవి కావు, మనసులో పెట్టుకుని పాటించాల్సినవి.

తమకంటే ముందు వచ్చినవాళ్లు తమకు సహాయం చేసినట్టే తమ తర్వాత వచ్చినవారికి తాము సహాయం చేయాలి అనేది ఉద్యమంలో గత ముప్పై ఏండ్లకు పైగా నిజానికి అందరికీ సహజాతంగా మారిపోయిన విషయమే. కానీ అన్న అదే మాట చెప్తే అదొక ప్రేరణ. అప్పుడే అవన్నీ మాట్లాడుకుని వచ్చిన తనలో అది ఉరకలేస్తోందని కూడా సజొంతికి విడిగా అర్థమయ్యిందేమీ లేదు.

పొజ్జె అడగని ప్రశ్నని కూడా ఊహించి, "మీ అన్న గురించి అడిగాను, మనకు రిపోర్టులో చెప్పిందే చెప్పిండు. ఎక్కువమంది మంచిగనే ఉన్నరు, కొంతమంది నిర్బంధానికి భయపడి దూరం అయితున్నరు అన్నడు," చెప్పింది సజొంతి.

"అదే అర్థం కావట్లేదు, లడాయి లేకుంట ఎట్ల అసలు? ఏం చేస్తరు? అట్లుంటే ఏం లాభం?" అంది పొజ్జె ఇంత తేటతెల్లంగా ఉండే విషయం వాళ్లకు ఎందుకు అర్థం కావట్లేదా అన్నట్టు ఆశ్చర్యంగా, కొంచెం నిరాశగా.

"అదే కదా. సరే, ఏం రాయమంటావు?"

'అన్నకు ఎట్ల రాస్తే అర్థమైతది, అయినా ఉత్తరంలో ఎంత రాస్తాం' అనిపించి ఒక్క నిమిషం ఏం మాట్లాడలేదు పొజ్జె. సజొంతి ఓపిగ్గా ఆమె చెప్పేవరకూ అన్నట్టు తనకేసే చూస్తోంది.

"నువ్వే రాయి, నువ్వయినా నేనయినా ఒకటే కదా," అంది పొజ్జె చివరకు.

సజొంతి తలూపి కొన్ని వాక్యాలు రాసి వాటిని తిరిగి చదువుకుంది. తర్వాత పొజ్జె కేసి తిరిగి, "చదువుతున్నా విను - అన్నా, నీవు ఎట్ల ఉన్నవు? నీ ఆరోగ్యం ఎట్ల ఉంది? ఈమధ్య నువ్వు మిలీషియాలో అంతగా వస్తలేవు అని తెలిసింది. నీకు తెలుసు కదా పార్టీ లేకుండ, లడాయి లేకుండ మన పేదోళ్లకు బతుకు లేదని. మరి ఎందుకిట్ల చేస్తున్నవ్? నువ్వు మంచిగా పని చేయాలని కోరుతున్నాను," అని చదివి ఆపింది.

'ఊ, మంచిగనె ఉంది," అని కాసేపు ఆలోచించి, "ఇంకా ఇట్ల రాద్దామా? మన పార్టీ మీద లూటీ సర్కార్ నిర్బంధం ఇంకా పెరుగుతుంది తప్ప తగ్గేదేం లేదు. మనందరం ఇంకా మంచిగా లడాయి చేయాలి. భయపడితే ఇప్పటికి మనం గెలుచుకున్నవి కూడా పోతయి. మన పేదోళ్లకు అధికారం వచ్చేదాకా ఈ లడాయి చేయాల్సిందే కదా. నువ్వు నాకంటే ముందు నుండి పని చేస్తున్నవ్. నీకన్నీ తెలుసు. ఆలోచించు," అంది పొజ్జె.

"ఊ, అట్ల రాద్దాం. మంచిగుంటది," అంటూ సజొంతి అదంతా రాసింది.

"ఇంకా?"

"ఇంకేం రాస్తం? ఎటు తిప్పి చెప్పినా విషయం అంతే కదా?"

"అంతేలే, పూర్తి చేసేయనా అయితే?" అడిగింది సజొంతి. పొజ్జె తలూపడంతో ఇంకో రెండు వాక్యాలు రాసి వినిపించింది సజొంతి.

"నీకు ఈ ఉత్తరం అందితే తప్పక జవాబు రాయి. అమ్మావాళ్లను మంచిగ చూసుకో. ఏమన్నా తప్పులుంటే కలుపుకుని చదువుకోగలవు," అని సజొంతి ఆపగానే

"విప్లవాభినందనలతో పొజ్జె," అని జోడించి కిలకిలా నవ్వింది పొజ్జె.

"ఊ, విప్లవాభినందనలతో నీ చిన్న చెల్లి పొజ్జె," అని రాసింది సజొంతి తనూ నవ్వుతూ.

మళ్లొకసారి రాసినదంతా లోపల్లోపల చదువుకుంది సజొంతి. ఒకటి రెండు చోట్ల దీర్ఘం పెట్టాలా లేదా అని ఆమెకు సందేహం వచ్చింది. ఎవరన్నా ఉంటే అడుగుదామన్నట్టు పొజ్జె వాళ్ల టెంటు వైపు చూసింది. ఎవరూ కనిపించలేదు.

'ప్రతి ఉత్తరంలో అందరూ రాసేలాగే తప్పులుంటే కలుపుకుని చదువుకోమని చివర్లో రాసిన కదా, సరిపోతదిలే,' అని తనకు తానే సర్ది చెప్పుకుంది.

కాయితం జాగ్రత్తగా చింపి పొజ్జె చేతికిచ్చింది. పొజ్జె దాన్ని షర్టు జేబులో పెట్టుకుంది.

'అందరు ఎటు పోయిన్రు?' అంటూ లేసింది సజొంతి.

"కమోఫ్లేజు, సర్దడం పనులకు పోయుంటరు. ఉత్తరం గురించి చెప్తే వసంతి పూర్తి చేసి రమ్మంది. నేను కూడా పోవాలె," అంది పొజ్జె.

వాచీ చూసుకుంటూ,"ఇంకేంది, ఒకటేసారి అన్నం తిని పోదువు," అని బైల్దేరింది సజొంతి.

రెండడుగులు వేసిందో లేదో, "సజొంతీ, సజొంతీ," అని పిలిచి దగ్గరకొచ్చింది పొజ్జె.

"మనం అమరవీరుల గురించి రాయలే కదా? మన జనతన సర్కార్ నుండి భర్తీ అయిన సన్ని మొన్ననే అమరురాలైంది కూడా కదా?"

"అవును కదా, మర్చేపోయినం, తే," అని చేయి చాచింది సజొంతి.

పొజ్జె ఇచ్చిన ఉత్తరం, పెన్ను తీసుకుని అటిటు చూసి ఒక చిన్న రాయి కనబడితే కూచుని రాయబోయింది గానీ కుదరలేదు.

"నోటుబుక్కు తీస్కరా," అనగానే పొజ్జె ఉరికిపోయి తెచ్చిచ్చింది.

ఉత్తరం మొదట్లో ఎక్కడైనా ఇరికించడానికి జాగా ఉందా అని చూసింది సజొంతి కానీ దగ్గర దగ్గరగా రాసిన అక్షరాల్లో జాగా కనిపించలేదు. ఉత్తరం కాయితానికి ఒకవైపు నిండి రెండోవైపు పావుభాగమే నిండి ఉంది. అందుకని మిగతా ముప్పావు ఖాళీగానే ఉంది. అక్కడే పొజ్జె అని సంతకం పెట్టిన కింద ఇలా చేర్చింది.

"అమరవీరులకు జోహార్లు చెబుదాం. అమరవీరుల ఆశయాలను కొనసాగిద్దాం. మొన్నీమధ్యే మన పంచాయితీ జనతన సర్కార్ నుండి ఒడిశాకు పని చేయడానికి వెళ్లిన మన ప్రియమైన కామ్రేడ్ సన్ని అక్కడ శత్రువుతో పోరాడుతూ అమరురాలైన విషయం మీకు తెలిసే ఉంటుంది. సన్ని త్యాగాన్ని మనం ఎప్పుడూ మరవద్దు. ఆమె నుండి నేర్చుకుందాం, మేమిక్కడ సంస్మరణ సభ జరిపాం. అక్కడా జరిపి ఉంటారని ఆశిస్తున్నా," అని రాసి చదివి వినిపించింది.

పొజ్జె 'సరిపోతుంది' అన్నట్టు తలూపింది.

"మంచిగ గుర్తు చేసినవ్ పొజ్జె, లేకుంటే అట్లే పోతుండె ఉత్తరం," అంది సజొంతి మెచ్చుకోలుగా.

"అదే, నాకూ ఏదో మర్చిపోయినం అన్పించింది గానీ ఏందో గుర్తు రాలేదు, సన్నిని చూసినవా నువ్వు?"

"ఆ, తను ఒడిశాకు వెళ్లేముందు. నాలుగేండ్ల ముందు. అప్పుడు ఇరవై ఏండ్లు కూడా లేకుండెనేమో."

"వసంతి కంప్యూటర్ రాజేష్‌ను అడిగి నాకో ఫోటో తీయించి ఇచ్చింది," అని జేబులో ప్లాస్టిక్ జిల్లీలో జాగ్రత్తగా ఉంచుకున్న అరచేయంత తెల్ల కాయితం మీద ప్రింటర్‌తో ప్రింట్ చేసిన సన్ని ఫోటోను తీసి చూపించింది పొజ్జె.

"బాగుంది కదా. నాకు కూడా ఒకటి తీయించమంటే బాగుండు."

"చెప్తాను. కానీ సామానంతా సర్దేశారేమో. ఇక్కడంటే సమావేశం కోసం కంప్యూటర్ వచ్చింది. మనం ఏరియాలకు పోతే ఇక దొరకనట్టే. పోనీ ఇది తీస్కుంటవా?"

పొజ్జె దగ్గర పిఎల్‌జిఎ సభ్యులందరి వలెనే కిట్టులో ఒక జత యూనిఫారం, దుప్పటి, పరుచుకునే జిల్లీ, నోటుబుక్కు, పెన్ను, పలక, బలపాలు, సూది, దారం, నూనె, సబ్బులు వంటి నిత్యావసరమైన అతి కొన్ని వస్తువులు తప్ప 'ఇవ్వడానికంటూ' ఏం ఉండవు., చాలా అరుదుగానే ఇలాంటి ఫొటోల వంటివి దొరుకుతాయి. అమరులవి కనుక అవి మరింత అపురూపం. కానీ వాటిని కూడా 'వేరేవాళ్లకూ కావాలనిపిస్తది కదా' అనుకుంటే వెంటనే ఇచ్చేస్తూ ఉంటుంది పొజ్జె. అదే అలవాటుతో 'తీస్కుంటవా?' అని అడిగింది పొజ్జె.

"వద్దులే, నీ దగ్గరే ఉండనీ. వీలైనప్పుడే తీసుకుందాం. టైమయితుంది, పోవాలి, మా ప్లాటూన్ సమావేశం ఉండొచ్చు, పోతున్నా," అంటూ వాచీ చూసుకుంటూ హడావుడిగా వెళిపోయింది సజొంతి.

పొజ్జె ఉత్తరాన్ని ఒకసారి చదువుదామా అనుకుంది. కానీ తనకు చదవడానికి సమయం పడుతుంది. అందరూ డ్యూటీల్లో ఉంటే తను మరింత సమయం ఉత్తరం కోసం తీసుకోవడం సరిగా ఉండదనిపించింది.

'రాత్రికి చదువుదాంలే, రేపు ఉదయం ఇడుమాల్ దాదాకు ఇస్తే సరిపోతుంది,' అనుకుని దాన్ని జేబులో పెట్టేసుకుంది.

* * *

డ్యూటీలు, సమిష్టి అధ్యయనం, ఇంకేవో చిన్న పనులు అన్నీ అయ్యేవరకూ రాత్రి పది అవ్వనే అయ్యింది. పొజ్జె ఉత్తరం చదవుకోడానికి టెంటు బైటకొచ్చి ఒక రాయిని చూసుకుని కూర్చుంది.

అడవి నిశ్శబ్దం చుట్టూ పరుచుకుని అంతటా ఒక ప్రశాంతతను నింపుతోంది. రాత్రిపూట మాత్రమే ఆహారం వెతుక్కోవడానికి బైటకొచ్చే కీటకాలు చేసే చిన్న చిన్న చప్పుళ్లు మాత్రం వినొస్తున్నాయి, అవీ అందరికీ కాదు. కొన్ని చెట్ల నిండా మిణుగురులు ఎంత దట్టంగా మిలమిలలాడుతున్నాయంటే ఆకాశం నుండి చుక్కలన్నీ దిగి వచ్చి అక్కడే వాలినట్టుగా ఉంది.

'అరే, పొజ్జె వచ్చిందే' అన్నట్టు చందమామ కూడా మబ్బుల చాటు నుండి బైటకొచ్చి వెన్నెలను ధారాళంగా కురిపించాడు. దాంతో అక్కడి ప్రతి ఆకూ, గడ్డిపరకా వింత శోభతో మెరవసాగాయి. సాయంత్రం స్నానం చేయకున్నా తల వరకూ కడుక్కున్న పొజ్జె జుట్టును రబ్బర్ బ్యాండు వేయకుండా వదిలేసింది. చల్లగాలి మెల్లగా వీస్తో ఆమె ముంగురులతో ఆడుతోంది. వాటిని వెనక్కి తోసుకుని ఒకసారి చందమామ అంతగా వెలిగిపోతున్నాడేంటి అన్నట్టు పైకి చూసింది. పున్నమి మర్నాడే అని అర్థమైంది.

'ఏపిటి కి టైముకే వచ్చావా అయితే,' అన్నట్టు చూసి తనను ఏమాత్రం పట్టించుకోకుండా తన పనిలో మునిగిపోయిన పొజ్జెను చూసి 'చౌదవీ కా చాంద్'కు కొంచెం కినుకగా అన్పించినా, టార్చిలైటు వేసుకుని ఆమె ఏం చదువుతోందా అనే ఆసక్తి పైచేయి సాధించింది.

పొజ్జె ఉత్తరం మొత్తాన్ని ఒకసారి చదివింది. మళ్లొకసారి అలా పై నుంచి కింది వరకూ చూసింది.

'బాగానే ఉంది. అన్ని విషయాలూ రాసినట్టే అన్పిస్తుంది, ఇంతకీ మాసే బిడ్డను ఎన్నడు చూస్తనో, ఇప్పట్లో పోయేలా లేదు కదా,' అనుకుని దాన్ని మడిచి జేబులో పెట్టుకుంది.

"ఏం పొజ్జె, ఇంకా పడుకోలేదు?" సమావేశం నుండి అప్పుడే వస్తున్న మంగ్తు పలకరించాడు.

"లేదు దాదా, నువ్వు వస్తావనే చూస్తున్న."

"ఏంది, ఏం పని?"

"ఇంటికి ఉత్తరం రాసిన, అన్నకు కూడా, నీకిద్దామని. రేపు ఇడుమాల్ దాదా వాళ్లతో పోతది."

"ఇవ్వు మరి, ఇప్పుడు మన ప్లాటూన్ వాళ్లు రాసిన ఉత్తరాలన్నీ కలిపి ప్యాక్ చేసేదే ఉంది."

"ఒకసారి చదివి నువ్వే ప్యాకింగ్ చేసేయ్," అంటూ దాన్ని అందించింది పొజ్జె.

"ఇంగో. మొన్న 'ఎన్‌కౌంటర్' అయ్యింది మాకు అని రాసినవా

లేదా?"

కిలకిలా నవ్వి 'లేదు' అన్నట్టు తల ఊపింది.

నిజానికి అది ఎన్‌కౌంటర్ కాదు. రాత్రిపూట వేట చేస్తున్న వాళ్ల లైట్లు చూసి పొరబడి అలర్ట్ అయ్యారు. గ్రామస్తులు ముందే ఒక ప్లాటూన్ సభ్యునితో కబురు పంపారు కానీ అతను మిగతావారికి చెప్పడం మర్చిపోవడంతో అలా అయ్యింది. అదంతా గుర్తొచ్చే పొజ్జెకంత నవ్వొచ్చింది. ఆ సమయంలో పొజ్జె అర్ధరాత్రి నిద్రలోంచి లేచి ఆ గందరగోళంలో కూడా ప్లాటూన్ సమిష్టి సామానును దేన్నీ వదలకుండా, మర్చిపోకుండా పట్టుకురావడంతో మంగ్తుకు పొజ్జె అంటే అభిమానంతో పాటు గౌరవమూ పెరిగిండె.

"మాడ్ కొండల్ని మొదటిసారి చూసి ఇవన్నీ ఎలా ఎక్కి దిగాలా అని భయపడ్డానని రాశావా లేదా?"

మళ్లీ 'ఊహు' అన్నట్టు తల అడ్డంగా ఊపింది.

"అయితే సరే నేను రాసేస్తాలే కింద," అన్నాడు ఆమెనే సీరియస్‌గా చూస్తూ.

నిజంగానా అన్నట్టు చూసింది. మంగ్తు పెదాల చివర్లు ఆపుకోలేని నవ్వుతో అదరడం చూసి విషయం అర్థమైంది.

"ఎందుకు దాదా, నేనిప్పుడు భయపడ్డం లేదు కదా. మా దక్షిణ బస్తర్‌లో అన్ని కొండలు లేవు కనుక రాగానే అట్ల అన్పించింది అంతే," అని మళ్లీ నవ్వింది.

ఆమెనలా నవ్వించడానికే ఆమె కన్పిస్తే చాలు మంగ్తు ఏదో ఒకటి అంటూ ఉంటాడు. పొజ్జె నవ్వు చూడ్డం అతనికి హాయిగా తోస్తుంది.

"నేను అలా రాయకుండా ఉండాలంటే ఒకటే షరతు. నువ్వు ఇంకా పెద్ద కొండలున్న ప్రాంతానికి పోనీకి ఒప్పుకోవాలి," అన్నాడు ఇంకా సీరియస్‌గానే చూసే ప్రయత్నం చేస్తూ.

'నిజంగానే నన్ను అలా పంపిస్తారా?' అని సందేహం వచ్చింది పొజ్జెకు. కానీ మళ్లీ 'లడాయి కోసం ఎక్కడికైనా పోవాల్సిందే కదా' అనీ గుర్తొచ్చింది.

"ఏంటి అంత ఆలోచిస్తున్నావు? సమిష్టి అధ్యయనంలో అనుకున్నవన్నీ మర్చిపోతున్నవు పొజ్జె," అన్నాడు మంగ్తు కొంత నిష్ఠూరం ధ్వనించేలా ఆమె ముఖంలో మారుతున్న భావాల్ని పరిశీలనగా చూస్తో.

"లేదు దాదా, మర్చిపోలే. ఎక్కడెక్కడి ప్రాంతాలకో వెళ్లి పని చేసి అమరులైనవాళ్ల గురించి నువ్వు చెప్పింది గుర్తుంది. కానీ వాళ్లలా నాకు చదువు రాదు కదా, అంత దూరం పోయి ఎట్ల పని చేస్తాను అని..."

"నిజమే పొజ్జె. ముందంతా చదువుకున్న అన్నలూ, అక్కలూ అట్ల పోయి పని చేసిన్రు. కానీ ఇప్పుడు మన సంఖ్య పెరిగింది, వాళ్లది తగ్గింది. చాలామంది అమరులైపోయిన్రు. మళ్లీ మన పార్టీ బైట అంతా విస్తరిస్తే వాళ్ల సంఖ్య పెరుగుతది కావొచ్చు. అలా విస్తరించాలన్నా మళ్లీ మనమే కష్టపడాలి. అందుకనే యిప్పుడు చూడు, చదువు వచ్చినా రాకున్నా ఎక్కడ ఏ ప్రాంతానికైనా మన ఆదివాసీ కామ్రేడ్సే పోయి పని చేసి అన్నీ నేర్చుకుంటున్నరు, లడాయిని విస్తరిస్తున్నరు," అన్నాడు మంగ్తు.

"అవును. ముందు తెలంగాణ, ఆంధ్ర నుండి మన బస్తర్‌కు, గడ్చిరోలికి కామ్రేడ్స్ వచ్చి పని చేస్తే ఇప్పుడు దండకారణ్యం నుండి తెలంగాణ, ఆంధ్ర, ఒడిశా, ఇంకా ఎక్కడికంటే అక్కడకి పోతున్నరని నువ్వు చెప్పినది గుర్తుంది."

"దండకారణ్యం నుండే కాదు ఝార్ఖండ్ నుండి కూడా ఛత్తీస్‌గఢ్, ఒడిశా, బెంగాల్ ఇంకా ఎక్కడికంటే అక్కడకి పోతున్నరు. అక్కడా మొదట బీహార్, బెంగాల్ నుండి చదువుకున్నోల్లు వచ్చి పని చేసిన్రట."

"కానీ దాదా, మాకంటే ముందు మీరంతా ఏరియాలను, డివిజన్లను వదిలిపెట్టి పోయి పని చేస్తున్నది చూసినం కాబట్టి మాకు ఇలా రానీకి అంతగా ఏం అన్పియ్యలే. కానీ ఇలా పోవాలన్నప్పుడు మీకు, మీకంటే ముందు వచ్చినవాళ్లకు ఎలా అన్పించిందో? మొదట్లో ఏరియా, డివిజను మారడమే వేరే దేశానికి పోయినట్టు ఉండేదేమో కదా?"

"ఊ, ఏమనుకున్నావు, ఇల్లు కదిలితే పిల్లి కరుస్తదన్నట్టు పుట్టి పెరిగిన ఊరును, ప్రాంతాన్ని వదలాల్నంటే ఇష్టంగా ఉండేది కాదు. భయంగా కూడా ఉండేది. మళ్లీ అప్పుడు ఆ అన్నలు, అక్కలు మన దగ్గరకు రాకుంటే మనం ఇవన్నీ నేర్వకపోదుం కదా అన్పించేది. దేశం అంతా విముక్తి చేయాలంటం మరి మనం పక్క పక్కనే మన కోయ భాషే మాట్లాడే ప్రాంతానికే పోకుంటే ఎట్ల అని కూడా అనిపించేది. ఇప్పుడు చూడు నీకంటే చిన్నోళ్లు కూడా ఎటంటే అటు పోయి పని చేస్తున్రు. నువ్వేమో పెద్ద కొండలుంటే పోనంటున్నవ్," అన్నాడు మళ్లీ బనాయించే మూడ్ లోకి వస్తూ.

"పోనని ఎక్కడ అన్నాను దాదా, మీరసలు ఎన్నడూ అడగందే...," అంది పొజ్జె కొంచెం కంగారుగా.

"ఎటూ పంపేది లేదు, ఊకే అన్నాలే. పొజ్జె లేకుండ మా ప్లాటూన్ ఎట్ల నడుస్తది?" ఇంకా పరేషాన్ చేయడం వద్దులే అన్నట్టు అప్పుడిక పళ్లన్నీ బైటపెడ్తూ పకపకా నవ్వాడు మంగ్తు. పొజ్జె కూడా నవ్వేసింది, 'ఈ దాదా ఎప్పుడూ ఇంతే,' అన్నట్టు.

"కానీ మన లడాయిని విస్తరించకుండా యుద్ధాన్ని గెలవలేం, గుర్తుంచుకో మరి. పార్టీ చెప్పినప్పుడు ఎటు అంటే అటు పోవాల్నంటే ఇక్కడ మన ప్లాటూన్లో ఉన్నప్పుడే అన్నీ తొందరగా నేర్చుకోవాలి, పో మరి, పడుక్కో," అన్నాడు మంగ్తు తన జిల్లీకేసి పోతూ.

పొజ్జె బుద్ధిగా తలూపి పోయి జిల్లీ దులుపుకుని పడుకుంది.

రెండు రోజుల్నుండి అన్న గురించి, అన్నకు రాయాల్సిన ఉత్తరం గురించే ఆలోచిస్తూండిన పొజ్జెకు ఒకసారంటూ ఉత్తరం రాసి ఇచ్చేశాక ఇక అదంతా మరుగున పడిపోయింది. తను పూర్తి చేసుకోవాల్సిన లక్ష్యాలు కళ్ల ముందు ఉండగా అలాంటి వాటిని అంతకంటే ఎక్కువేం ఆలోచిస్తది?

'ఊహు, ఈసారి మాత్రం నా ఉత్తరం నేనే రాస్తాను. తొందరగా చదువు నేర్చుకోవాలి. ఉన్న టైమునే మంచిగా ఉపయోగించుకోవాలి. అందరూ నాలాగుంటే మన లడాయి గెలిసినట్టే. లేదు, లేదు, నేను తొందరగా వికాస్ కావాలి. లేకుంటే ఈసారి ఇడుమాల్ దాదా కలిసి సజొంతిని అడిగనట్టు నీ వికాస్ ఎంతవరకొచ్చింది అంటే ఏం చెప్తుంది?

# అనిల్ అమెరికా కల

వీరబ్రహ్మాచారి

"ఇయ్యాల నా బర్త్‌డే. బాబాయ్‌ది గుడ. హాయ్! ఎంత బాగ కలిసింది!..." పళ్ళు తోముకుంటూ అనిల్ "... అపుడు తమ ఆరో తరగతిలున్నపుడొచ్చిండు. అంతకు ముందెప్పుడోంచుండో తనకు తెల్వదు. మల్ల తను తొమ్మిదో తరగతిలకొచ్చినంక మొన్న, మూన్నెల కింద."

'వీడు నిజెంగనే రెండేండ్లకో మూడేండ్లకోపారి వస్తాండంటవా...' మొన్న బాబాయొచ్చి పోయినంక బాపమ్మ తాతతో అన్నది యాదికొచ్చింది. వగరు యాదిని ముందుకు సాగకుండా పక్కకు నూకిండు. తనకిష్టమైన తీయని యాదికి మళ్ళిండు. "... మొన్నొచ్చినపుడు బాబాయ్ తనను దగ్గెర్కు దీస్కొని తొడమీద గూకోవెట్కొని తల నిమురుకుంటూ మంచిగ సదువుకో. నీవు గుడ అమెరికాకు రాఒచ్చు. అడ నీకు నేను నౌకరి జూపిస్త అన్నడు. ఔ నేను గుడ బాబాయి లెక్క మంచిగ సద్వుత. అమెరికవోయి బాబాయి లెక్క మాంచి ఉద్యోగం జేస్త" బాబాయి మాటలు యాదిరాంగ అనిల్ ఆలోచనలు మళ్ళీ అమెరికా విమానం ఎక్కినయ్. అంతలో మళ్ళీ...

'గదేంది! అట్లడిగితివి!'

'ఏమో! పెండ్లయినంక మనమడిషిగాకుండవాయె. సూస్తాండవా పదేన్డ్లిలాకింద దేసంలకొచ్చి సూటిగ అత్తమామలింటికే వోయిండు. మనం గిన్నొద్దులకు యాదికొచ్చినం."

అనిల్ మెదడులో వగరు జ్ఞాపకాలు

"ఊకో పిచ్చిదానా. నీకేం దెల్సు ఏందేందో అన్కుంటవు. ఐద్రబాద్‌కు అచ్చినంక సిన్న సిత్క పనులెన్నుంటయో' తననూ పొడుస్తున్న నొప్పిని కన్పీయనీయకుండా భార్యకు సర్దిచెప్పిండు లచ్చయ్య.

"ఎంత మామూళ్లగా మోమాటం లేకుండ చెప్పిండో నా కొడ్కు" బాపమ్మ తాతయ్యల నడుమ జరిగిన సంభాషణ యాది మళ్ల మళ్ల వెంటాడుతుంది అనిల్‌ను.

"చేసేదేముంది. కొత్తదా మనోద్దేనా ఈ వర్స. మనకంటే పెద్దోలు ఎన్నట్కి ఎన్నడో జెప్పిండ్లు. అడ్డాలనాడు బిడ్డలు గని గడ్డాలనాడు గారు అంటని'

స్నానం ముగించి బాబాయిదెచ్చిన రెండు దుస్తుల్లో నుండి ఒకదాన్ని ఎంపిక చేసి తొడుక్కున్నడు. గుండీలు పెట్టుకొంటూ వసారాలోకి వచ్చిండు.

వసారాలో బీడీ కాలుస్తూ విడుస్తున్న పొగలోన్కి నిర్వికారంగ చూస్తూ కూచున్న తాత వంక చూసిండు. "ఏంది ఇయ్యాల తాతనెవరూ పనికి పిల్వలేదా" అనుకుంటూ కాళ్ళచప్పుడు గాకుండా తాతను సమీపించి 'తాతా'

బెదిరించినట్లున్న పిలుపుకు ఉలికిపడి మనవడి వంక చూసి, "ఏంది పిలగా గట్ల బెదరగొడ్తివి" అని కిందికి మీదికి ఎగాదిగ జూస్తూ 'ఏందియ్యాల కొత్త పెండ్లి కొడుకు లెక్క తయ్యారైనవ్.'

---

నాకు తెల్సిన ఆదివాసీ కామ్రేడ్స్ ఎక్కడెక్కడికో పోయి పని చేస్తున్నరు. ఏవేవో నాకు పేరు కూడా తెల్వని భాషలు నేరుస్తున్నరు, నేను కోయలో రాయడం కూడా నేర్చుకోకుంటే ఎట్లా?

కానీ చదువుకున్న అన్నలు, అక్కలు ఇంకొంతమంది వస్తే బాగుండు, తొందరగా నేర్వచ్చు, మంగ్తు, సజొంతి, వసంత వాళ్లే అన్ని పన్లు చేయాల్నంటే వాళ్లకూ ఎంత కష్టం, పాపం! కానీ ఎవరొచ్చినా రాకున్నా మనం లడాయి చేయాల్సిందే కదా. అందుకే నేనూ తొందరగా ఎదగాలి, వాళ్లకు మద్దతు ఇవ్వాలి.'

తన ముందున్న కర్తవ్యాల్ని బేరీజు వేసుకుంటూ, తన భవిష్యత్తు ప్రణాళికల్ని రచిస్తూ ఆలోచిస్తూ అట్లే నిద్రలోకి జారింది పొజ్జె. ఎప్పట్లాగే త్వరగానే గాఢంగా నిద్రపోయేసింది.

పన్నెండింటికి సెంట్రీ నుండి వచ్చి తన జిల్లీ వద్దకు పోవడానికి టార్చి వేసిన వసంతికి పొజ్జె జిల్లీ మీంచి కిందకి జారిపోయి సగం నేల మీద పడుకుని కనిపించింది. చిన్నపిల్లల్లా నోరు కొద్దిగా తెరుచుకుని ఉంది.

'ఇరవై ఏండ్లు వస్తున్నా పసితనం పోలేదు, ఉత్త అమాయకం, రేపు ఎట్లయితదో ఏమో,' అని మురిపెంగా విసుక్కుంటూ, "పొజ్జె, లే, జిల్లీ మీదకు రా, మొత్తం మట్టిలోకి పోతున్నవు," అని లేపి ఆమెని సరిగా పడుకోబెట్టి తనూ పడుకుంది వసంతి.

పొజ్జె ఉత్తరం చదువుతున్నప్పుడు కుతూహలం ఆపుకోలేక తనూ ఆ ఉత్తరం అంతా చదివేసిన చందమామ వసంతిని చూసి నవ్వుకుంటూ, 'ఎప్పుడూ ఈ ఆడపిల్లల చుట్టేనా, కాసేపన్నా సెంట్రీ చేస్తున్న రాజుకు తోడుగా ఉందాం పా,' అన్నట్టు అటుకేసి మళ్లాడు.

1 ఏపిటి – అపాయింటుమెంటు అనే ఇంగ్లీషు పదాన్ని సూచించడానికి వాడేది. ముందే అనుకున్న సమయానికి, అనుకున్న చోట సమన్వయం, ఇతర పనుల కోసం కలవడం.

2 వికాస్ – అభివృద్ధి, వికాసం అనే అర్థం వుండే హిందీ పదం. ఈ రెండూ దండకారణ్య పిఎల్‌జిఎలో రోజువారీ కోయ వాడుకలోకి వచ్చేసిన పదాలు.

3 కరుకు – లేత వెదురు పిలకలు, సన్నగా తరిగి కూరలాగా వండుకుని ఎంతో ఇష్టంగా తినేది.

4 కెమోఫ్లేజ్ – క్యాంపు వేసినట్టు (ప్రభుత్వ బలగాలకు) అర్థం కాకుండా వుండనీకి గుర్తులన్నీ లేకుండా చేయడం

5 పిఎల్‌జిఎ – పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీ (ప్రజావిముక్తి గెరిల్లా సైన్యం)



'ఇయ్యాల నా పుట్టిన రోజు. బాబాయిది గుడ' అంటూ జారిపోతున్న జీన్స్ ప్యాంట్ బెల్టును బిగించుతున్నడు.

'ఔ ఈ డిరస్ నీకు సరీగ సరిపోనట్లుంది? ఔ లే. ఈ రడిమేదు కాలానికి మనం సరిపోవాలె అవి మనకు సరిపోవాలంటని లేదు...' అంటూ కుడిచేతిని, బనీన్‌కున్న ఎదకాడి జేబులోన్కి పోనిచ్చిండు. "...బాగ సద్వుకో. పైసల కోస్రం పరుల పంచన జేరకు. వాళ్ళ కూడిగెం జేయకు. శాన మంది పుడ్తరు–సస్తరు...'

సిమాంటని పిలగాడు పుట్టిన రోజంటని ఎదుర్గ నిలబడ్డె సావు గురించి మాట్లాడవడ్తివేందయ్య' వెనుక గల్మకాడున్న కాశమ్మ మొగని మాటలిని అన్నది. నా మాట పూరగానిచ్చినావె. వాస్తవాలు మంచి యాల్లమీన్నే జెప్పాలె...' యాలపాల లేకుండా చెప్తే మనసుకు వట్టవ్". అంటూ మనవడి వైపు తిరిగి, 'పుట్టుక సావుల నడ్మ ఎట్ల బత్కినమనేదే ముఖ్యం. మడిసిపోయిన్నాడు ఎంత మంది ఏడ్సిండ్రన్నదే మనిసి బత్కుకు కొల్త' అని జేబులోనుంచి బైటకు దీసిన చేతి వంక జూసి, 'నిజెంగనే నీయాల బాగుందోయ్! ఇర్వయి రూపాల నోటు దొరికింది.' అంటూ అనిల్‌కందించిండు.

తాత బాపమ్మ మాటలను జాగ్రత్తగ వింటూ, నోటును మురిపెంగా జేబులో దూర్చి ఒంగి చేత్తో తాత కాళ్ళను తాకిండు. 'సల్లంగ నూరేళ్లు బత్కి పదిమంది మెచ్చే పేరు దేచ్కో' లచ్చయ్య మనవడి తలను నిండా రెండు చేతుల్తో పట్టుకొని ముద్దుపెట్టుకున్నడు.

"అత్తా ఆటో ఒచ్చే యాలయితాంది. తానాన్కి పో జెప్పన తయార్‌గా." బైట గేటు దిమ్మనానమ్మకొని కూకున్న మంజుల వీధి వైపు నుంచి తల వెనక్కుదిప్పి తల దువ్వుకుంటూనే పొరుగూరికి మిర్చి ఏరనికి పోవలసిన విషయాన్ని అత్తకు గుర్తుజేసింది.

'అమ్మా నేను స్కూల్‌కు వోతుండనే ఇయ్యాల నా బర్త్‌డే' తల్లికాడికి వచ్చి ఒంగి కాళ్లు తాకిండు.

'యాదికుంది నాయినా, ఇగో ఈ పది రూపాలు' అని జాకెట్లో నుంచి తీసి ఇచ్చి...బాబాయి లెక్క బాగ పెద్దగ సదువుకో..'

తనను దాటి వీధి రోడ్డు మీదికి నడుస్తున్న కొడుకు వంక జూస్తూ, 'అల్ల బాబాయి ఒచ్చి చెప్పిపోయిన కాన్నించి చాలా సంబరంగున్నడు కొడ్కు ముందుకంటె శానాసేపు మన్సువెట్టి సద్వుతాండు' మురిపాలుపోయింది మంజుల.

వీపుకు పుస్తకాల సంచి వేసుకుని నడుస్తున్న అనిల్‌ను మళ్లీ "...బాబాయి పోయేటప్పుడు వేయి రూపాల నోట్ల కట్టొకటి బాపమ్మకు ఇయ్యజూపినపుడు "ఇల్లు మంచిగనే గట్టిస్తివి. సెల్లెకు మంచి కట్నమిచ్చి కల్మిగల్ల ఇంటికిస్తివి. మా రుణం సెల్లుబాటు జేస్తివి. నీవు పరాయోడివైనంక నీ పైసలెందుకింక కొడుకా....' బాపమ్మ మాటలకు బాబాయి మొకం మాడిపాయెందుకో! తాతకాడ్కి వోయి, 'బాపూ అనిల్‌గాన్ని ఊల్లే బళ్లె నుంచి దీసి చిట్యాల్లనో అన్మకొండలనో మంచి ప్రైవేట్ స్కూల్లెయ్యండి'. 'అని నోట్ల కట్ట తాత ఒడిలో వెట్టి కాళ్లు మొక్కి కారెక్కి పాయె. 'టంగ్ టంగ్ టంగ్...' జ్ఞాపకాల్లో నడుస్తున్న అనిల్‌కు గంట శబ్దం వినబడడంతో తను బడికాడికి వచ్చానని ప్రార్థన గంటయితుందని తెలిసింది. గేటు ముందున్న దుకాణంల చాక్లెట్‌ల పొట్లం కొనుక్కొని గబగబా వెళ్ళి తన తరగతి వరుసలో వెనకగా వెళ్ళి నిలబడ్డడు.

ప్రార్థన ముగిసినాక మొదట.స్టాఫ్ రూమ్‌లోనికెళ్లి సార్లకు చాక్లెట్లు ఇచ్చి తరగతిలోనికెళ్ళాడు.

సాంఘిక శాస్త్రం సారు లక్ష్మారెడ్డి పీరియడ్‌కొచ్చి, అనిల్ చదువుల్లో ముందుండడాన్ని అభినందిస్తూ, తన కొడుకు కూడా వాడి బాబాయ్‌లాగే అమెరికాల సాఫ్ట్‌వేర్ ఇంజనీరు అని చెప్పి; అమెరికా అంటే భూమ్మీదనే ఉన్న అందమైన చందమామనీ, అమెరికా జీవనవిధానంలోని సుఖాలను, సౌఖ్యాలను ఊరించి ఊరించి చెప్పగా అనిల్ అమెరికా కలల విమానం మరింత పైపైకి ఎగిరింది.

బడి నుంచి ఇంటికొచ్చేవరకు ఇంటి ముందు ఒంటరిగా గూకొని ఉదయం లాగనే బీడీ కాలుస్తూ నిర్వికారంగా ఉన్న తాతను ఆటపట్టించాలనిపించింది, అనిల్‌కు.

'ఏమప్పా. ముసలాయన. పనికి వోక బేఫికర్‌గ దొరలెక్క గూకొని బీడి గాలుస్తున్నవేంది? గిట్లయితే నీకు బువ్వానించి ఒస్తది. ఎవ్వర్ బెట్టర్. ఆయ్!'

'మా పిల్ల ఇంజినీర్ సాబ్ నౌకరిజేసి బువ్వేంది, బిర్యానేవెడ్తడు.అడ్మాన్సుగా సపరిచ్చుకుట్ట గూకున్న.'

'అట్లనా. అయితే జెరనిలవాడు. ఇప్పుడీ నీకో మాంచి ఏక్ నెంబర్ సార దీస్కోస్త.' తాగినంకనే గదా తినుడు' పరాచికాన్ని కొనసాగిస్తూ స్కూల్ బేగ్‌ను ముందు గదిలో జారవిడిచి ఇంటెన్కకు వోయిండు.

'పదిహేనిర్వయి నిమిషాల్లో నిశ్శబ్దంగా తాతముందుకొచ్చి,' ఇగో తాతా సాచ్చమైన వేడి వేడి సార' అంటూ కాఫీ కప్పు ముఖం ముందుంచిండు.

'మా బాబే, ఇదేంది! ఇంత ఘుమాయిస్తాంది. ఇది జేసుడెప్పుడు నేర్సుకుంటివి!' అసలేందిది!' నేను నీ కంటికి మీ ముసలి బాపు లెక్క కన్పిస్తానా ఏంది?'

'గట్లకాదోయ్ తాత. మా బాపుకు నీమీదున్నంత పాఉరం ఉంది నీగ్గాడ. నా మీన' ఇంతకూ గీ కొత్తగా ఘుమఘుమలాడే ఉడుకుడుకు సారాపేరేందో జెర జెప్పు.'

'ఇయ్యాల నీకు ఏదన్నా కొత్తరుచి చూపెడ్దామంటని ఇన్‌స్టెంట్ బ్రూ సాచె దెచ్చిన.' అదేందో అర్కీబ్ అర్థం గాలే. పోనీ ఎట్ల జేసినవో చెప్పు.' ఏంలే. శాన అల్కగ. పాలుగాగవెట్టి పొట్లంలో కాఫీ పొడి పోసి సక్కరేసి కల్పిచ్చుడే. ఒడబోసుడు గిట్ల ఏం లేదు. చెబుతూ స్కూల్ బేగ్ ముందరేస్కొని కూచున్నడు.

'అద్సరేగని తాతా బాబాయి గంత బాగ సద్వుకొని అమెరిక పోయి పేద్ద జీతం వచ్చే నౌకరి జేస్తె నీకు బాపమ్మకు ఇష్టం లేదా' అసలు విషయం అడిగాడు.

'అదేం?!'

'మరి బాపమ్మ ఆయాల బాబాయొచ్చి పోయెటపుడు అట్ల మాట్లాడింది. బాబాయ్ చిన్నబోయిండు. మారుమాట్లాల్లే.'

'ఆ ఈడదొర్కినకాడ్కెనాయె. పూనల నౌకరి జేసినపుడు గదేమన్న తక్వ జీతమా? నెలకు అర్వయి వేలు. ఈ దేశంలుండి అదేనౌకరి జేస్కుంట ఉండి ఉంటే అంద్రం దగ్గెర ఒగరి కండ్లముందొగరం ఉండెటోల్లం గదా అని దాని ప్రేమ.'

'బాబాయొచ్చినపుడున్న సంతోషం పోయేటపుడు లేదెందుకు? సాటు సాటుకు ఏడ్సిందెందుకు?' 'చెప్పలేదా. కొడ్కు ఇట్లొచ్చి అట్లబాయె. ఒక్కటే పగలు ఒక్కటే పగలు. ఇంక నాల్దినాలుండక

పాయెందని. అది ఎర్రిముండ. దానికేందెల్సు. ఈ. కాలం నౌకర్ల కతలు. అదే నేను నచ్చజెప్పిన గద.' జవాబు చెప్పి- ఇగ వీడు నన్నిడ్సెటట్టులేడు. నా కడ్పులున్నదంత కక్కించెటట్లున్నడు. మా ఏడ్పంత వాని ముందలేస్తె వాని సద్వుల కలలు అమెరికా నౌకరి కలల మీద నీల్లు జల్లినట్లైతది.- అనుకొని లేచి దండెంమీదున్న కండువను భుజానేస్కొని 'నేను బైటికోయొస్త. ఓం వర్క్ జేస్కో' అంటూ బైటపడ్డడు.

బైటకు నడిచి రోడ్డెక్కిన లచ్చయ్యకు పెండ్లాం ముచ్చట యాదికొచ్చింది."ఔ. దాని మాటా నిజమే. గన్ని దినాలముందు దేశాన్కొచ్చినోడు ఎత్మినానమ్మ అత్తగారింట్ల తిని పండి పోయేముందట అట్లొచ్చి ఇట్లవాయె.అమెరికా పని అల్సట నుండి ఊపిరిదీస్కోనీకె సల్లబడనీకె ఈ ఇల్లు ఈడ మన్సులు ఆనలే. ఐతెవాయె తీ. యాన్నో ఓ తాన సల్లగుంటె సాల్తీ...' పరధ్యానంగ సావిడి కాడ తన సోపతిగాల్ల కాడికి జేరిండు.

బాపమ్మ తాతల అసంతృప్తికి కారణం అర్థమయ్యీ అర్థంగాని అస్పష్టతతో, 'అమెరికవోతే నేను బాబాయి లెక్క జేయ. కనీసం యాడాదికోపారన్న ఇంట్లోలందర్ని తీన్కపోయి నెలరోజులుంచుకొనుడో, లేదా తనే వచ్చి పదో ఇరవై దినాలుండో అమ్మనాయిన బాపమ్మ తాతయ్యలనే గాదు. ఊల్లె నాతో కల్సి సద్వుకున్న దోస్తులను గుడ పేద్ద కార్ల యాద్కుంటె గాడ్కి దిప్పుత.' కలల ప్రణాళికలేస్తూ హోంవర్క్ చేస్తున్నడు. '...ఔ బాబాయి అంత పెద్ద సద్వులు ఎట్ల సద్వుకున్నడు. మావాడల గూడ సద్వుకున్నోల్లు మా కులంలో బాగనే వున్నారు. టీచర్, పోలీస్, డ్రైవర్, నౌకర్లు జేసెటోల్లున్నరు. మా మాదిగిండ్లల్ల గింతబాగా సద్వుకొని నౌకరి జేసే ఊల్లుగుడ శాన తక్వనే.'

'అమ్మ బాపమ్మ ఒచ్చినాద్ర.' పట్నాన్కి పనికివోయొచ్చిన రమేశ్ ఇంట్లోకడుగు పెడుతూనే అడగటంతో ఆలోచనలాపిండు అనిల్.

'ఆ గింతకు ముందే ఒచ్చిండ్లు.'

'నీల్లు కాగవెట్టిండ్లో అడ్గుపో' అంగీ విడిచి మంచం మీద కూలబడి టీవీ రిమోట్ బటన్ నొక్కిండు.

ఇంటి వెన్కకు వెళ్ళిన అనిల్ రెండు నిమిషాల్లో తిరిగొచ్చి, 'ఆ నీల్లు కాగినయ్ బాపమ్మ రమ్మం... టం...' తండ్రి తన మాట విన్పించుకోటం లేదని టీవీ మీద ఏదో ఆసక్తిగా జూస్తాండని గమనించి తను టీవీ వైపు చూపు మరలించిండు.

'ఏందో మామూలు ప్రోగ్రామే.' అనుకుని, నాయినా నీల్లు కాగినయ్. బాపమ్మ రమ్మంటుంది."

కొంచెం గట్టిగ చెప్పిండు.

'ఉండ్రా, గాడ స్క్రోలింగ్‌లేమో వస్తాంది సూడు.'

తండ్రీ కొడుకులు వేగంగా కదలుతున్న స్క్రోలింగ్ మీద చూపు నిలిపిండ్రు. రెండు మూడు సార్లు నిర్ధారణగా చూసినంక ఇద్దరిలో ఆందోళన శురువైంది.

అంతలో అదే వార్త బ్రేకింగ్ న్యూస్‌గా. 'అమెరికాలోని న్యూజెర్సీలో ఒక దుండగుడు జరిపిన కాల్పుల్లో అరుణ్‌కుమార్ అనే తెలుగు రాష్ట్రానికి చెందిన యువ ఇంజినీర్ తీవ్రంగా గాయపడ్డాడు.పోలీసులు వెంటనే ఆస్పత్రికి తరలించారు. పరిస్థితి విషమం. అత్యవసర చికిత్స అందుతూంది.'

బైటకు వెళ్ళిన లచ్చయ్య వచ్చిండు తను టీవీ ముందు కూచున్నాడు.

అనిల్ ఇంటి వెనుకకు పోయి బాపమ్మ తల్లికి విషయం చెప్పిండు. వాళ్లంత టీవీ గదిలోకి వచ్చేటాలకు, 'అమెరికాలో న్యూజెర్సీలో ఒక దుండగుడు జరిపిన కాల్పుల్లో భారత్ తెలుగు సంతతికి చెందిన యువ సాఫ్ట్‌వేర్ ఇంజినీర్ అరుణ్ కుమార్ మృతి'గా ప్రసారమవుతుంది. చావు కబురు చల్లగా అందించినట్లున్నరు మీడియా.

కాశమ్మ కిందపడి స్పృహ కోల్పోయినది. అందర్నీ దుఃఖపు వరద ముంచేసింది.

* * *

రెండో రోజు గడుస్తున్నా శవం రాలేదు సరిగదా. తాజా సమాచారం తెలుసుకోని స్థితిలో ఉన్నరు లచ్చయ్య కాశమ్మల కుటుంబమంతా. పేపర్లో వచ్చిందే విషయం. 'అరుణ్‌కుమార్ మృతదేహాన్ని స్వాధీనం చేసుకోడానికి బంధువుల పయనం' ఆ బంధువులు వీళ్ళు కారు.

విషయం తెల్సినప్పటి నుండి ఫోన్ ద్వారా వివరాలు తెల్సుకోడానికి రమేశ్, అరుణ్ మామ వాళ్ళతో కాంటాక్ట్ కావడాన్కి ప్రయత్నిస్తూనే ఉన్నడు. కాంటాక్ట్ దొర్కడం లేదు.

'వాళ్ళకు టీవీ కన్నా ముందే తెల్సుంటది. వాల్లే పోయిందిగని విషయాన్ని మనతో పంచుకొనేటందుగ్గాని చెప్పేటందుగ్గని ఔసరం లేనోల్లం మనం..'అంటాకు ముందే వచ్చిన చిన్నాడపడుచు పెద్దాడపడుచుతో అంటున్నది. '... అల్లు ఎక్కువోల్లు. అందుకే అన్నరు పెద్దోల్లు 'నెయ్యం వియ్యం కయ్యం సమానపోల్లతో జెయ్యాలంటని.'

"మనకు జెప్పి వాల్లోల్లకు జెప్పి పెండ్లి జేస్కున్నరా తమ్ముడు మర్దలు. చేస్కున్నంకనే ఆల్లకైనా మనకైనా దెల్సింది. మర్దలు తల్లోలు కులం పైసలు నౌకర్లు అన్నిట్ల పెద్దోల్లు. తెలవుండి ఉషారుండి పెద్దనౌకరున్నోడు అల్లుడంటని కులం పట్టిస్కోకుండా సొంతం జేస్కుండ్రి తమ్ముని." పెద్దాడపడుచు దీర్ఘాలు తీసింది.

ఇంట్లో వాల్ల మాటల ద్వారా పరామర్శకు జనం ఒచ్చినపుడు బాపమ్మ వలపోత ద్వారా అనిల్ సందేహాలు చాలవరకు తీరిపోతనే ఉన్నవి. ఐనా సమాధానం దొరకని ప్రశ్నలు ఒకట్రెండు మిగిలే ఉన్నయి. ఇది అడిగి తెలుసుకొనే సమయంగాదిదని తర్వాత తెలుసుకోనవచ్చనుకున్నడు. అమెరికా కల ఎప్పుడో చెదిరి నిరాశ వెంటాడుతున్నదిపుడు.

అంతలో బైటకు పోయిన రమేశ్ గేటుదాటి హడావుడిగా లోపలకు వస్తూ 'గాజర్ల సారన్ననెన్‌కౌంటర్ జేసిండ్రంట' అంటూ వాకిట్లో వసారాలోనున్న జనాలను దాటుకొని ముందుగదిలోనికెళ్లి టీవి ఆన్ చేసిండు.

రమేశ్ వెంబడే బయటున్న వాళ్ళంతా టీవి ముందుకు చేరిండ్రు. గాజర్ల సారన్న చంపబడ్డాడన్న వార్త దృశ్యం మాత్రం చూసి, మిగిలిన ప్రసార వివరాలు పట్టించుకోకుండా, ఇగ ఇనేదేముంది ఈ పోలీసుకుక్కల ముచ్చెట ఈయాల కొత్తదా' అంటూ లేచిన కాశమ్మవెంబడే మిగిలిన వాళ్లూ బైటకు వచ్చిండ్రు.

'ఈల్ల మొదలార. ఈల్ల తాడుదెంచ. రండబాడ్కా...' వాకిట్ల కూలబడి రెండు అరిచేతుల్తో నేలమాడ్చి ఎత్తిపోస్తూ, ప్యాదోల్లల్ల జెర

తెల్వి కల్లోన్ని, జెనం కోస్రం కొట్లాడె ప్యాదోడుగని ఉన్నోడుగని ఎవ్వన్ని వానోల్లకు గాకుండ జేస్తరు. గద్దల్లెక్క ఎత్కపోతరు, ఈల్ల పెండ్లాల్ ముండమొయ్య...' రెండు రోజులుగ కొడుకు దుక్కంతో తినక తాగక గొంతు పోయిన కాశమ్మ దుక్కం ఆగ్రహంగా మారి గర్జించింది.

'... బాపమ్మ ఎవర్ని తిడుతుంది. బాబాయి అతడెవరో సారయ్య సావులకు బాధ్యులు ఒకరేనా?కారుగద! వాల్లకు వీల్లకేందో సంబంధమున్నట్లు కల్పి తిడుతాంది. ఈ సారయ్యేవరసలు. మావోయిస్టు. వీల్లెవరు ఏప్పుడు సంపుడో సచ్చుడేనా ఈల్లపని. పోలీసోల్లకు ఈల్లకు పగేంది. తన కేరిలున్న పోలీసునౌకరిజేసె బాబాయ్‌లు మంచోల్లే గద...'. సారయ్య మరణవార్త అది బాపమ్మనేగాదు ఊల్లె దాదాపు అందర్ని విచారంలో ఆందోళనకు గురిచేయడాన్ని గమనిస్తూ కొత్త ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరవుతున్నాడు అనిల్.

'టిర్ ర్ర్ర్....టిర్ ర్ర్ర్...' చేతిలో ఫోన్ మోగడంతో ఫోన్ చెవికాడుంచుకొని గేటువైపు మూలకు సిగ్నల్ స్పష్టత కోసం నడుస్తున్న రమేశ్ మీదనే అందరి చూపు పడింది.

హలో... హలో... నమస్... నమస్తేనండి.. మీతో... ఆ.ఆ...' రమేశ్‌ను మాట్లాడనీయకుండా ఫోన్ పెట్టేసింద్రవతలివాల్లు.

'అరుణ్ బాడి రేప్పొద్దుగాల కల్ల ఈడ్కే ఒస్తదట. అరుణ్ వాల్ల బామ్మర్ది ఫోన్‌జేసిండు.' వార్త తను విన్నట్లుగనే అందర్కీ వినబడేటట్లు చెప్పిన రమేశ్ మొకంలో ఏదో చిన్నబుచుకున్న ఛాయ.

'ఆ' అదే భావంతో నేమో అక్కడున్నందరి నోళ్లూ తెరుచుకున్నయ్. అనిల్‌కేదో అర్థమయ్యీ కానట్లు.

* * *

పదిహేనిరవై నిమిషాల ముందే బాబాయి అంత్యక్రియలు ముగించి కుటుంబసభ్యులతో కలిసి ఇంటివైపు వస్తున్న అనిల్ ఉరుములవంటి చప్పుడేదో వినబడి తలపైకెత్తి మబ్బులవైపు చూస్తూ ఈవానలేందో గిప్పుడు అనుకున్నడు అంతకుముందే కురిసి పలుచనైన తుంపరను తల్చుకొని. కాని తను విన్నది ఉరుముకాదని ఎక్కడో జనం గుంపుగా చేస్తున్న చప్పుళ్లని తెలిసింది.

ఉరుములవంటి చప్పుళ్లు ఊరివైపునుంచొస్తున్నాయని తెలిసేలోగా అవి మాటలుగా నినాదాలుగ స్పష్టమవుతున్నయ్.

'గాజర్ల సారన్న - అమర్‌హై' సారన్న ఆశయాలను కొనసాగిస్తాం' మీ రక్తం వృథా కాదు... నినాదాలు హోరెత్తితున్నయి. ఎదురుగ డొంకదారి నిండుగ ఏరుపొంగి ఒడ్డుమీదకు ప్రవహించినట్లు డొంకకిరువైపులా రాతికట్టాల కావల జనం. తట్టుకుంటు దాటుకుంటు - నిక్కినిక్కి డొంకలో జనం నడుమ నడుస్తున్న ట్రాక్టర్ మీది పార్థివ దేహంవైపు చూసే ప్రయత్నం చేస్తూ.

కుటుంబసభ్యులతో సహా అనిల్ డొంకదారి నుండి పక్కకు జరిగి రాతికట్టంవైపు జరిగి ఒదిగి నిలబడిండు. రాతి గోడ ఎత్తు ప్రదేశం మీద ఉండడం వల్ల డొంకలో ఎర్రజెండాలతో నడుస్తున్న జనం కదలిక పారుతున్న నిప్పులవాగు లెక్క కన్పించాయి. అతనెవరో చూద్దామని రాతికట్టంమీదెక్కిండు అనిల్. తెరలు తెరలుగ కురిసిపోతున్న వానతుంపరకడ్డంగా పట్టుకున్న గొడుగులు. శవపేటిక చుట్టు ఉన్న జనం వల్ల అనిల్ కోరిక తీరకపోవడంతో నిరాశగ ఎదుటివైపు గోడ కావలం ఉన్న పొలాలవైపు చూపు మల్లించిండు.

నవంబర్ నెల, క్రమం తప్పిన కాలం. అంతకుముందే ఒక ఝల్లు కురిసి వెలిసింది. నేలంతా చిత్తడి చిత్తడి. దూరంగా బీళ్లకావలనుండి కాలిబాటలు బండ్లబాటల మీదుగా, బాటల కద్దదారులు వెతుక్కుంటూ జనం. చీమల బార్ల లెక్క. ఎవరో తరుముతున్నట్లో, ఏదో పోగొట్టుకున్నట్లో పోతే తిరిగిరానిదేన్నో గడువు తీరేలోపు అందుకోవాలన్నట్లో ఆత్రంగా వస్తున్న జనం.తమన్న కట్టం వెనకవైపు చూసిండు. అదే దృశ్యం. నేలమీద కురిసిన చినుకులు పాయలై పిల్లకాల్వలై పెద్ద కాల్వలోన్కి, అటునుంచి వాగులోన్కి పారే వీళ్లలెక్క తట్టుకుంట తనుసుకుంట. కాళ్లు అంతిమ యాత్రవైపు. చూపులు ట్రాక్టర్‌వైపు-మెడలు సాగదీసి.

దారి ఖాళీ ఖాళీ కావడంతో అందరితోపాటు డొంకలోన్కి అడుగులేస్తూ 'బాపమ్మా ఎవరీ సారయ్య, మనూరేడానా' అనిల్. తల్లి విన్పించుకునే స్థితిలో లేదని గమనించి, 'గాజర్ల సారయ్యటని ఇదే ఊరు. గన్నడే కాష్టం జేయనీకె ఈడ్కిదెచ్చిండ్లు' రమేశ్.

'నేనెప్పుడు సూడలే'.

'ఆయన ఊరిడ్సి ఇర్వయ్యయిదేండ్లు దాటింది. నీపు పుట్నెంక ఊల్లె కెన్నడు రాలే.'

'బాబాయికి మీకు అందర్కి పరిచయమేనా బాగా. అంతగొప్పగా బత్కిండా!' కిందటి పుట్టినరోజున తాతమాటలు యాదికి రాంగ అడిగిండు.

'ఇర్వయ్యయిదు ముప్పై ఏండ్లకంటె తక్కువున్నోల్లకు దప్ప అందర్కిదెల్సు. మీ బాపు అయ్య మీ బాబాయి అందరు ఇపుడు నీవు సదువుతున్న బల్లెనే సదివిండ్లు' కాశమ్మ పరధ్యానం నుండి బైటపడి మనవడికి వివరించింది. 'అయ్యు జెరటిటు మీనాయిన తోటోడు. ఒకటో రొండో ఏండ్లు పెద్దగాఉచ్చు. బాబాయి వీల్లందరికంటే ఐదారేండ్లు సిన్నోడు...' మనవడికింకా చాలా చెప్పాలనిపించినా ఆగిపోయిందెందుకో.

ఇక అసలు ప్రశ్న అడగాలన్పించి, తను నడుస్తున్న గుంపు వైపు ఒకసారి, వెన్కకు తిరిగి దూరమవుతున్న సారయ్య అంతిమయాత్ర వైపోసారి చూసిండు.

ఇద్దరు ఊల్లె లేరు. అయ్యు బాబాయికంటె ముందే ఊరిడ్సి పోయిండు. ఆయనకోస్రం అంతమంది ఎక్కడెక్కడోల్లో వేయిలల్ల. మన బాబాయి కోస్రం మనం మనసుట్టాలు, కొందరు దగ్గెరోల్లు. అంతగల్సి నూటాబై రొండొందలు. అని ఆగి తల ఎత్తి బాపమ్మ తండ్రి మొఖాలలోన్కి మార్చి మార్చి 'ఎందుకు?' అన్నట్లు చూసిండు.

అడుగుల చప్పుడు తప్ప మరే అలికిడీ లేని సమయమది. అనిల్ ప్రశ్న గుంపులోనడుస్తున్న వాళ్ళందర్నీ లోపలెక్కడెక్కడో తాకి ఇబ్బందిపెట్టి గంభీరమైన ఆలోచనల్లో ముంచెత్తినట్లుంది. అందరి తలలూ మరింత వంగినయ్.

కాశమ్మ రమేశ్‌లుకూడా మాట్లాడలేదు.

'ఎట్లయిన కారణం స్పష్టంగ తెల్సుకోవాలనే ఆరాటంతో' అమర్‌హై అంటే ఏంది బాపు' కావాలనే జెర అల్కటి ప్రశ్న అడిగిండు అనిల్.

'మరణం లేనివాళ్ళు అని. మరణించీ బతికుండే టోల్లని.'

'సచ్చిపోయి బతికుండుడా!' అదెట్లన్నట్లు తండ్రి మొఖంలోన్కి చూసిండు.

'చాలామంది జనం యాదిల ఎప్పట్కీ ఉంటరని.'

జవాబులు కొత్త ప్రశ్నలు అడగమంటున్నయి. అసలు ప్రశ్న ఇంకా లోపలే. ముందూ వెనుకా పక్కలకు చూసిండు. 'బాపమ్మ తాతేదే' అప్రయత్నంగా వచ్చింది, తాజా ప్రశ్న.

రమేశ్ కాశమ్మలు నడకనాపి తమ చుట్టూ, తమను దాటి బాగా ముందుకు పోయిన బంధువుల గుంపువైపు చూసిండ్రు. 'నిజెంగనే యాండ డీతని!' లోపలి ఆశ్చర్యాన్ని బైటకే తెలియజేస్తూ, ఏదో అనుమానం వచ్చి వెన్నకు తిరిగి సాగిపోతున్న సారయ్య అంతిమయాత్ర వైపు చూసింది కాశమ్మ. జనయాత్ర వెంట నడుస్తున్న లచ్చయ్య కనిపించిండు.

తనూ ఓసారి చివరి చూపు చూస్తే బాగుండనన్పించింది. ముందుకు చూసింది. సుట్టాలందరు శాన ముందుకు పోయింద్రు. వాళ్లింటింకే రారు నిర్ధారించుకొని "రమేశూ నేను పోయేస్తరా'.

'సరే పొమ్మా నేనుగుడవస్త'.

వెనుకకు తిరిగి నాల్గడుగులు వేసిందో లేదో అనిల్ జబ్బను గట్టిగా అదిమి పట్టుకొని నిలబడింది. 'రమేశూ కండ్లు తిర్గుతానయ్‌రా మబ్బులు కమ్ముతానయ్.'

'పక్కన రాతికట్ట మీద కూకుందుపా' తండ్రీ కొడుకులు కాశమ్మను చెరో పక్కన ఆసరాగా ఉండి డొంక పక్క రాతి కట్టం కాడ్కినడిపించి జెర పరుపు బండజూసి కూచోబెట్టింద్రు.

నానమ్మ పక్కనే కూచున్న అనిల్ తన చూపును జనయాత్ర మీద నిలిపిండు.

'అంతమంది సారయ్యకు కావల్సినోల్లోనే బాపూ!'

కొడుకు ఏం పోల్చుకుంటున్నడో, ఏ విషయం పూరాగ తెల్సుకోవాలని ఆరాటపడుతున్నడో పసిగట్టిన రమేశ్, 'బాబాయి అరుణ్ తనకు తన కుటుంబాన్ని సుట్టాలకు మాత్రమే కావల్సినోడు. సారయ్య ఊరికి జిల్లాకు రాష్ట్రాన్కి పక్క రాష్ట్రాల జనాలకు గుడ ముక్కెంగ కష్ట జీవులకు ధర్మం న్యాయం వైపున్న పెద్దోల్లకుగుడ కావల్సినోడు'. వివరించిండు.

'మనకుగుడనా?'

'ఆ మనగ్గుడ. బాబాయి అంత సద్వి అమెరిక పోయేటంతో దయ్యిండంటే అది సారన్న పున్నెమే.'

'ఆ ఔనా!' అంటూ తనను వెంటాడుతున్న ప్రశ్నకు జవాబు అడక్కుండనే రావడంతో ఆశ్చర్యంగ తండ్రి బాపమ్మలవైపు చూసిండు. అంతలో... దూరంగ అంత్యక్రియల వద్ద గుంపుకాడ నుండి ఏదో పాట దరువు.

కాశమ్మ రమేశ్‌లకది తెలిసిందే. చానా ఏండ్ల కింద వెన్నెల రాత్రుల్ల వాళ్ళు గుంపులుగా జేరి కొలాటాలల్ల,సెమ్మసెక్క ఉయ్యాల ఆటలల్ల ఉల్లాసంగ గంతులేసి పాడుకున్న పాట. వెంటనే పోల్చుకోగలిగింద్రు.

'పల్లె పల్లె దిరిగినారు–మా పల్లెకొచ్చినారు/ ఏ తల్లి పిల్లలమ్మ ఓలి–సెమ్మ కేలిల ఓలి' పాట తలుచుకుంటూ కాశమ్మ పూర్తిగా గతంలోనికెళ్ళి మైమరిచింది. అసంకల్పితంగానే నోరు విప్పింది. 'పిల్లలు యాడపుట్టిరో యాడవెర్గిరో! కూటికి గుడ్డకు లేనోల్లేంగాదు. ఉన్నోల్ల పిల్లలే. పట్నంల పెద్ద పెద్ద సద్వులు సద్వేటోల్లే రాడికల్ ఇద్యార్థులంట. సద్వులిడ్సి కాలేజీ ఆస్టల్ బిల్డింగు లిడ్సి యాలపూట కమ్మటి కూడు ఇడ్సిపెట్టి కష్టజీవుల గుడిసెలల్ల కొచ్చిరి. కులం జూల్లే గోత్రం జూల్లే. ప్యాద మాలమాదిగ పాకలి కుమ్మరిండ్లల్లకు. మేం దినే గొడ్డుకారం పుల్సు గట్క దినిరి. మా లెక్కనే న్యాల మీన పండిరి. మాతోటి కూలకచ్చిరి. పొద్దూకెల ఇంటికొచ్చినంక జెనాన్ని కూడేసి దోపిడి పెపంచకం సుద్దులు జెప్పిరి. అద్దమ్మ రేతిరి దాన్క అచ్చెరాలు కూలిపని లెక్కలు నేర్పిరి. మా చేత కూలి రేట్లు జీతాలు పెంచే పోరు జెపిచిరి. ఎట్టపని బంజేయిచ్చిరి...' గుక్క దిప్పుకోకుండా పూనకం ఒచ్చిన దానిలెక్క ప్రవాహంలాగ, పుస్తకపాఠాన్ని బిగ్గరగా చదువుతున్న విద్యార్థి లెక్క చెప్పుక పోతున్నది.'..ఆ రాడికల్ పిల్లలే కొన్నాళ్లకు పీపుల్స్‌వార్ పార్టీ వాల్లయి దళాలుగ వచ్చిరి. ఆల్ల పహరాల అందతోటి ప్యాదజనం ఆడోల్లం మొగోల్లం క్రిష్టమయ్య రాంరెడ్డి వెంకటార్వ్ పటేళ్ల దొరల భూములల్ల ఎర్ర జెండాలు పాతి కబ్జ జేస్తిమి. దొరలు గడీలిడ్సి, ఊరిడ్సి పట్నాన్కి పారిపోయిరి. గొడ్లు నాగలి పెట్టుబడిలేక పంచిన బూములల్ల అందరు ఎవుసం జేసుకోలే. అట్ల ఇడ్సిపెట్టిన భూములు ఇంకా పంచంగ వాల్లకంటని ఇడ్సిపెట్టిన భూములల్ల సేరెదార్లు వెంకటయ్య రంగయ్యలు దొరల తరపున ఎవుసం జేపిచ్చుకుంట కబ్జజేసిన భూమిని కాంతారావు పట్వారిని కట్టుకొని పట్టజేపిత్తమంటని గిట్టినకాడ్కి ఒచ్చినకాడ్కి అమ్మిపెట్టిరి. కౌలుకిచ్చిన భూమిని గుడ కౌలుదార్లకు అమ్మిపెట్టిరి. ఈ విషయాలు తెల్సి సారయ్య దళంతోని ఊల్లెకొచ్చె. ఊరోల్లందర్ని సావిడికాడ పోగుజేసి ప్రజాకోర్టువెట్టి, కాంతారావు పట్వారితోని పహణీ దెప్పించె. దొరలభూములాన్ని లెక్కగట్టిచ్చె. వందల వందలెకురాలు. వెంకటయ్య రంగయ్యల ఈపులు వలగొట్టి, 'అన్నలు అక్కలు పెద్దోల్లు అందర్కి లాల్ సలామ్. దొరల భూములను అమ్ముడేగాదు ఎవరన్న కొన్నా సాటుమాటుకు పైసలిచ్చి పట్టాజేపిచ్చుకున్నా సేరెదార్లపనే గాదు కొన్నోల్ల పని గుడ బేకారైతది. ఈ వెంకటయ్య రంగయ్య మామలు పట్వారి కాంతారావు సాకలి ముత్తయ్యన్న మంగలిబాలకిష్టి మామ మాదిగ లచ్చయ్య బాబాయిలు భూములు పంచే కమిటి. ఇదివరకమ్మిన కొన్న భూములతోగుడ కల్పి రేగడి సౌడు తరిమెట్ట చెల్క అన్నిభూముల్ను సరీగ లెక్కజూసి దున్నుకునే భూమి లేనోల్లందర్కి పంచాలె. అంత నిశ్శబ్దంగ జర్గిపోవాలె. పోలీసులు గీలీసు లెవలన్న ఊల్లె కొచ్చింద్రంటె ఎవర్కేమన్నయిందంటె పట్వారి సేరెదార్లదే బాధ్యత. ఊల్లె వీల్లు పట్నంల దొరలు మిగలరు. కమిటి చైర్మెన్ లచ్చయ్య బాబాయ్. కమిటి జేసిందే ఫైసలా. కాంతారావు పట్వారి పంచిన లెక్క కాయితం పహాణి కాపి మాకందించాలె. అందిస్తడు. బాబాయ్ అన్నా మామా తేడాల్రానీకుండ్రి' దాదాపు నాదు సారయ్య స్థాయిలోనే చెప్పి అలిసి ఆగిపోయింది. మొసపోయ సాగింది.

కొంతసేపు నిశ్శబ్దం తర్వాత తల ఎత్తి దూరంగ చితివద్ద గుంపు మీద చూపు నిల్పింది. అక్కడ ఏవోమాటలు అస్పష్టంగా వినబడుతున్నయ్.

అనిల్ రమేశ్‌లు తల్లివైపే చూస్తున్నరు. కాశమ్మ విప్పారిన కండ్లలో నుండి నీరు ఉబికి చెంపలమీదుగా.

'అట్లా మనమూ తరి మూడెకరాలు, మెట్ట రెండెకురాలు ఒచ్చె. ఆ కాన్నించి తల్లి ఆపిన కథనాన్ని రమేశ్ కొనసాగించిండు. నేను పసులుగాసే జీతం మాని బాపమ్మ తాతకు తోడుగ వ్యవసాయం జేస్తిమి.'

'ఏందీ! నీవు పసులగాసినవా? ఎవర్వి? నీతోటోడయితె ఆయనెట్ల మంచిగ సద్వి పట్నంల కాలేజీ యూనివర్సిటి దాన్క పోయిండు!

'అల్లు గొండ్లోల్లు. ఆల్లకు దొరలంత కాదుగని పెద్దరైతులు. ఓ పది పన్నెండెకురాల భూములుండె. అల్ల అమ్మనాయిన ఆయన్ను మంచిగ సద్విచ్చింద్రు మనకు మొదట్నించి భూమి లేదు. ఊల్లె పెద్ద మోతుబరి రైతుల గొడ్లను ఓ ఎనబై, తొంబైదాన్క ఇద్దరం ముగ్గురం మాదిగమాల్లోల పిల్లలం భూమిలేని గొల్లోల పిల్లలిద్దరు గల్సి కాసెటోల్లం. భూములొచ్చినంక పేదోల్ల బత్కు బాగాయె. మేం ముగ్గురం కాపుదనంజేసి బాబాయిని మంచిగ పెద్దోల్ల పిల్లల్తోటి సమానంగ పట్నం బంపి సద్విస్తిమి.

'పంచినప్పుడు మీకొచ్చిన భూమి యాండదిప్పుడు, మీరంతా మల్ల కూలి జేస్కుంటున్నరేంది!' 'పట్నానికి పారిపోయిన దొరలు ఎలక్షనల్ల గెల్సి నాయకులైరి. అంతకుముందే పంపిన పోలీసులకు తోడుగ ఇంకా ఎక్కువ పోలీసులను అప్పుడప్పుడు మిలట్రీని దించిరి. నిర్బంధం పెంచిరి. ఇన్‌ఫార్మర్ల సాయంతోటి కొందరు పార్టీలున్నోల్లను చంపిరి నిర్బంధం తట్టుకోలేక కొందరు లొంగిపోయిరి. పార్టీ పల్చవడె. నిర్బంధం నిఘా పెరిగి పార్టీ నాయకులు దండకారణ్యం వైపు బోయిరి. మా భూములను మల్ల గుంజుకుద్రి.'

'గాజర్ల సారన్న-అమర్ హై, కామ్రేడ్ ఆజాద్ అమర్ హై-మీ నెత్తురు వృథా కా...' చితి అంటించే ముందు నినాదాలు మబ్బులు గర్జిస్తున్నట్టు స్పష్టంగా కాశమ్మ,రమేశ్‌లు లేచి నిలబడ్డారు. అనిల్ అనుసరించిండు.

క్షణంలో మంటలు లేచాయి. సంధ్యాచీకటి కమ్ముకుంటున్న నల్లమబ్బులు మంటల వెలుగులో ఆకాశంలో ఎగురుతున్న ఎర్రజెండాల్లాగా. అన్ని సందేహాలు తీరిన అనిల్ బాపమ్మకు మరింత దగ్గరగా జరిగి 'గాజర్ల సారయ్య ఆ-జా-ద్' ఒక్కో అక్షరం విడిగా ఒత్తి పలుకుతూ పేరును యాదిలో స్థిరపరుచుకోడానికన్నట్లు బైటికే అన్నడు.

కొంచెం ఆశ్చర్యంగా కొడుకు వైపు చూసి, వాడి మాటకు చేర్పుగ 'అమర్ హై' అన్నాడు పిడికిలెత్తి.

తన చేతిని పట్టుకున్న మనవడి తనకేదో హామీ పడుతున్నట్లన్పించి, "అమరవీరుల ఆశయాలు అన్నది కాశమ్మ పిడికిలెత్తి. 'కొనసాగిస్తాం – కొనసాగిస్తాం.' రమేశ్, అనిల్‌లు నినదించారు పిడికిళ్లెత్తి.



***గమనిక : ఫిబ్రవరి 2016 సంచికలో అచ్చయిన పుస్తకావిష్కర్తల వరుస క్రమంలో పొరపాటు చోటు చేసుకుంది. సరి చేసిన జాబితా ఇక్కడ ఇస్తున్నాం.***

ఆవిష్కరించిన పుస్తకాలు: రెండురోజుల సభల్లో మొత్తం ఇరవై పుస్తకాలు, రెండు కవిత్వం ఫోల్డర్ల ఆవిష్కరణ జరిగింది.

| పుస్తకం | ప్రచురణ | ఆవిష్కర్త |
|---|---|---|
| జనతన రాజ్యం (పాణి) | విరసం | వివి |
| మార్క్సిస్టు మహోపాధ్యాయుల జీవన రేఖలు | విరసం | వివి |
| ఫాలింగ్ (నల్లూరి రుక్మిణి కథ) | విరసం | కొండారెడ్డి |
| దండకారణ్యంలో చలసాని ప్రసాద్ | విరసం | పాణి |
| సాహసయోధురాలు (గజ్జెల సరోజ రచనలు) | విరసం | భూపాల్ |
| దండకారణ్య కథలు | విరసం | కూర్మనాథ్ |
| లొంగిన ప్రతిసారీ (కిరణ్ కవిత్వం) | విరసం | అరసవెల్లి కృష్ణ |
| చిగురించే పాదం (మేడక యుగంధరరావు కవిత్వం) | విరసం | మాచర్ల మోహనరావు |
| అమర శ్రుతి (వరంగల్ యూనిట్ కవిత్వం) | విరసం వరంగల్ యూనిట్ | తాయమ్మ కరుణ |
| మందిపాట ఒరవడిలో (సిటీయూనిట్ కవిత్వం) | విరసం సిటీయూనిట్ | ఉదయ్ |
| కలం యోధుడు చెరబండరాజు (చెంచయ్య) | విరసం | తాటి శ్రీకృష్ణ |
| దండకారణ్య సాంస్కృతికోద్యమ చరిత్ర (పునర్ముద్రణ) | విరసం | రత్నమాల |
| సీమ గొంతుక వినండి (అరుణ్ వ్యాసాలు) | విరసం కర్నూలు యూనిట్ | భాస్కర్ |
| కాశీం కవిత్వం | స్నేహ ప్రచురణలు | కళ్యాణరావు |
| తెలంగాణ సాహిత్య వ్యాసాలు (కాశీం) | స్నేహ ప్రచురణలు | ఎన్.వేణుగోపాల్ |
| పోరుపల్లి(పాలమూరు అధ్యయన వేదిక కవిత్వం ఫోల్డర్) | పాలమూరు అధ్యయన వేదిక | క్రాంతి |
| మానవులు (రాఘవాచారి దీర్ఘకవిత ఫోల్డర్) | పాలమూరు అధ్యయన వేదిక | కాకరాల |
| ఈలం విముక్తి పోరులో మహిళలు | శ్రామిక వర్గ ప్రచురణలు | సి.యస్.ఆర్.ప్రసాద్ |
| కవిత్వంతో ములాఖత్ (ఎన్.వేణుగోపాల్) | స్వేచ్ఛా సాహితి | ఖాదర్ మొహియుద్దీన్ |
| అమరుడు కామ్రేడ్ సంజయ్ | దిక్సూచి | సుదర్శన్ |
| రైజింగ్ సన్ (సూర్యం స్మృతి) | సూర్యం మిత్రులు | కిరణ్ |
| సామ్రాజ్యవాద దోపిడి మండలాలు (రత్నమాల) | నూతన ప్రచురణలు | అన్నపూర్ణ |

# ఈ-కుక్క ఇప్పుడేం అంటోంది?

**మాతంగి**

'ఈ కుక్క, మరికొన్ని కథలు' చంద్రబాబునాయుడికి సంబంధించినవి. అట్లని వీటిలో నేరుగా ఆయనే హీరో అని కాదు. అట్ల రాస్తే కథకుడిగా కెవి కూర్మనాథ్ ప్రత్యేకత ఏముంది? ఈ పన్నెండు కథలకు చంద్రబాబు రాజకీయార్థిక పాలనా విధానాలు ఇతివృత్తం. అయితే ఇవి నారా చంద్రబాబు అమరావతి చంద్రబాబు కావడానికి ముందు హైటెక్ చంద్రబాబుగా పాలించిన తొమ్మిదేళ్ల కాలానివి. ఇన్నేళ్ల తర్వాత ఇప్పుడు చదువుకుంటే మరింత బాగా అర్థమవుతాయి. ఈ-కుక్క కార్పొరేట్లకు ఎలా తోక ఊపుతున్నదో, ఈ కథలు రాసినప్పటి కంటే ఇంకింతగా ఎట్ల తెలివిమీరిందో తెలుస్తుంది. అమరావతి, ల్యాండ్ మాఫియా, ఊకదంపుడు అభివృద్ధి, కోట్ల కోట్లు వెదజల్లి బూటకపు సమ్మతిని ప్రదర్శించుకోవడం... ఒకటేమిటి? చంద్రబాబు ఇవ్వాల్టి విశ్వరూపాన్ని ఆనాడే ఈ కథలు సూక్ష్మదర్శినిలో చూపించిన కథలివి.

ఈ సంపుటిలో మొదటి కథ పేరు క్షుద్రక్రీడ. ఇది 1999 ఏప్రిల్‌లో రాశారు. చివరి అధ్యాయం అనేది చివరి కథ. ఇది 2004 డిసెంబర్‌లో అచ్చయింది. నిజానికి ఇది చంద్రబాబుకు కూడా చివరి అధ్యాయం ఏమీ కాదు. ఆ తర్వాత మరో పదేళ్ల దారుణమైన రోజులు గడిచాయి. రాజకీయాల్లో జుగుప్స కలిగే అవినీతి, హింస, నిత్య అసంబద్ధ ప్రేలాపనలు ప్రజలు భరించలేకపోయారు. దశాబ్దాల పార్లమెంటరీ రాజకీయాల ఉచ్ఛదశ అది. దీన్ని కొనసాగిస్తూ ఇవాళ మళ్లీ చంద్రబాబు. అమరావతి అవినీతి, అధికార దుర్వినియోగం...

ఇలా రాజకీయ పరిభాషలో ఎంతని చెప్పగలం? ఎంత చెప్పినా తక్కువే. వీటిని సాహిత్యంలోకి ఎలా తీసుకరావాలి? సృజనకారుడు వీటిని కాల్పనికంగా ఎలా చూస్తాడు? కథగా మలిస్తేగాని ఉపన్యాసాల్లో, గాఢ విశ్లేషణల్లో సహితం ఒదగనివన్నీ వ్యక్తం కావు. ఈ కథలతో కూర్మనాథ్ ఆ పని చేశారు. అందువల్లే ఇవి ఆనాటి చంద్రబాబు కథలనిపించవు. ఇప్పటి చంద్రబాబు కథలు కూడా అని ఇప్పటికీ అనిపిస్తుంది. ఒక్క చంద్రబాబు మాత్రమేకాదు. పేర్లు ఎందుకు గాని; దేశంలోని, రాష్ట్రంలోని అన్ని రంగుల పాలకుల జుగుప్సాకరమైన, హింసామయమైన విధానాలు ఈ కథలకు ఇతివృత్తం. అత్యంత నిర్దిష్టమైన, స్థల కాలబద్ధమైన వస్తువును ఎంచుకొని రాస్తున్న కథలివి అని ఆరోజుల్లో అందరికీ అనిపించింది. ఇంత నిర్దిష్ట కథలు రచయిత దృక్పథం వల్ల మొత్తంగానే పాలక వర్గ రాజకీయాలను వ్యక్తం చేస్తున్నాయి.




e-కుక్క, మరికొన్ని కథలు
కె.వి. కూర్మనాథ్
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
జనవరి 2005, వెల : రు. 30/-

దీనికి దృక్పథంతోపాటు, రచయిత ఎంచుకున్న శిల్పం కూడా దోహదపడింది. ఈ శిల్పంలో చెప్పకపోతే ఈ ఇతివృత్తం ఇన్ని పొరల్లో పాఠకులకు చేరేది కాదు. ఒక గడ్డు వాస్తవాన్ని చెప్పదల్చుకున్నప్పుడు ఇలాంటి శిల్పం తప్పనిసరి. ఈ వస్తువు, శిల్పం విప్లవ కథలో ఇప్పటికీ కొత్తదే. ఆ రకంగా ఈ సంపుటిలోని కథలు విప్లవ కథ వికాసాన్ని ముందుకు తీసకపోయాయి. వాస్తవికతా వాద శిల్ప పద్ధతికి భిన్నమైన ఈ శిల్పం ఒక కఠినమైన వాస్తవ ప్రపంచాన్ని కాల్పనీకరించింది. దీని వల్ల వాస్తవికత మరింత గాఢంగా, బహు కోణాల్లో, అనేక స్థాయిల్లో వ్యక్తమైంది. భూస్వామ్య సమాజంలోని సరళ వాస్తవికతకు భిన్నమైన మార్పులు మన దగ్గర ఎన్నడో మొదలయ్యాయి. కనీసం ఇరవై ఏళ్ల నుంచి ఈ సంక్లిష్టత అలుముకొని పోతున్నది. ఏకకాలంలో అనేక స్థాయిల్లో జరిగిపోతున్న మార్పులివి. ఒకనాటి వల్లెటూరి ఆలోచనారీతులకు అంతుపట్టని వ్యవహారాలివి. వ్యవస్థ ఇంత సంక్లిష్టంగా సాగుతున్నదా? రూపానికి-సారానికి మధ్య ఇంత ఎడం ఉంటుందా? కంటికి కనిపిస్తున్నదేమిటి? వాస్తవమేమిటి? అనే ఎన్నో ప్రశ్నలు, సందేహాలు తలెత్తే అవకాశం ఉన్నది.

ఇలాంటి వాస్తవికత మధ్య తిరుగాడే రచయిత దీన్ని సాధారణంగా చెప్పి తన పని అయిపోయిందను కోలేడు. ఈ మొత్తాన్ని ఎలా చిత్రించాలి? అనేది దృక్పథ సంబంధమైనదే కాదు, శిల్పానికి సంబంధించింది కూడా. ఈ అవగాహన ఉండటమే కూర్మనాథ్ ప్రత్యేకత. ప్రపంచ కథా సాహిత్యాన్ని చదవడమేగాక అధ్యయనం చేసే లక్షణం ఉన్నందు వల్ల మన నేల మీది ఈ సంక్లిష్ట, అసంబద్ధ, దుర్మార్గ, తల్లకిందుల వాస్తవికత కోసం ఈ శిల్పాన్ని ఎంచుకున్నారు.

ఇప్పుడు ఈ కథలను చదివితే ఇలా కాకుండా మరోలా రాసి ఉంటే ఎంత నష్టం జరిగి ఉండేది అని తప్పక ఎవరికైనా అనిపిస్తుంది. మామూలుగా అయితే వాస్తవికతావాద శిల్పానికి భిన్నమైన వాటి గురించి మాట్లాడేప్పుడు ప్రయోగం అనే అలవాటు మనకు ఉన్నది. ఆ రకంగా కూర్మనాథ్ ఈ కథల్లో ప్రయోగం చేశారా? ఏ ప్రయోగాన్నయినా మొదట స్వాగతించాల్సిందే. కాని ఈ కథలు

# ప్రపంచ ప్రసిద్ధ సోవియట్ విప్లవ రచయిత ఫెదయేవ్ నవల 'వెనుకంజ'

నాగభూషణ్

(2)

(గత సంచిక తరువాయి..)

మొరోజ్కా నేర విచారణ ఘట్టాన్ని రచయిత అత్యంత సహజ వాతావరణంలో, పాఠకుల్లో భావోద్వేగాల్ని కలిగించేలా అత్యంత ప్రతిభావంతంగా నిర్వహించాడు. మీరే చూడండి గ్రామ పాఠశాలలో జరిగిన ఆ సమావేశాన్ని :

సమావేశ సమయానికి ముందుగానే కొంత మంది రైతులు వచ్చారు గానీ, వ్యవసాయపు పనులు ముమ్మరంగా సాగే రోజులు గనుక, ఎక్కువ మంది రాలేదు. వచ్చిన వారు కూడా వ్యవసాయపు పనిముట్లు లేకపోవడం వగైరాల వల్ల తమ ఇబ్బందుల్ని కమాండెంటుకి చెప్పడం, తమలో తాము మాట్లాడుకోవడం సాగించారు. వారిలో ఒకరు వేరే ఊళ్లో జపాను వాళ్లు చేసిన ఆగడాల గురించీ, గ్రామ స్త్రీలపై చేసిన అత్యాచారాల గురించీ చెప్పి వాపోయాడు. జరిగేదంతా నిశ్శబ్దంగా చూస్తూ, వింటున్న లెవిన్‌సన్, జపాను వారి గురించిన వారి ఆందోళనపై తగిన జాగ్రత్తలు తీసుకోవాలని భావించి, బాక్లనోవ్‌ని పిలిచి, ఆశ్వికదళ వ్యక్తిని కాపలాగా నియమించమని సూచించాడు. ఇంతలో అనుకున్న సమయం కావడంతో దళ సభ్యులంతా వచ్చారు. ఆఖరిగా వచ్చిన వారు గని పనివారు. వారి నాయకుడు ద్యుబోవ్ గొప్ప బలశాలి. 'సుబానోస్క్' గని పనివాడు. అతడిప్పుడు ఒక ప్లటూన్ కమాండర్. వారంతా గుంపుగా వచ్చి ఒక చోట కూర్చోగా, ఆరోపణ లెదుర్కొంటున్న మొరోజ్కా మాత్రం వేరేగా, ఒంటరిగా కూర్చున్నాడు.

ద్యుబోవ్ వచ్చీరాగానే, ఏళ్లు గడిచినట్లు లెవిన్‌సన్‌ను చూసి, "నువ్వు కూడా వచ్చావ్?" అని సంతోషంతో అంటూ, "ఈ మన మిత్రుడు ఎంతటి ఘనకార్యానికొడిగట్టాడు!" అని విచారంతో అన్నాడు. అంతటితో ఊరుకోకుండా," వాడికి గట్టి పాఠం చెప్పాలి. ఇంకెప్పుడూ ఇలాంటి బుద్ధి తక్కువ పని చెయ్యకుండా" అంటూ లెవిన్‌సన్ ఏమంటాడోనన్నట్లు చూశాడు.

ఇంతలో విద్యార్థి నుంచి గెరిల్లా అయిన 'ఛిజ్' అనే యువకుడు, "ఇంతకుముందే మొరోజ్కా పని పట్టాల్సి ఉంది. మొత్తం దళానికే చెడ్డ పేరు తెస్తున్నాడు" అనే సరికి, ద్యుబోవ్ విసురుగా, "ఊరుకోవోయ్ పక్షీ! తమరి అభిప్రాయం చెప్పమని ఎవరూ అడగలేదిప్పుడు" అన్నాడు. దాంతో ఛిజ్ ఉక్రోషంతో గుంపులో కలిసిపోయాడు. అంతటి సరిపెట్టకుండా ద్యుబోవ్, "ఆ కుర్రాణ్ణి చూశావా... ఏదో దొంగతనం చేస్తే కాలేజీ నుంచి వెళ్లగొట్టార్ట అతణ్ణి. ఎందుకలా వాణ్ణి వదిలేస్తావ్?" అని ప్రశ్నించాడు లెవిన్‌సన్‌ని. ప్రతి గాలివార్తనూ నమ్మొయ్యి కూడదంటూ ఛిజ్ గౌరవాన్ని కాపాడే యత్నం చేశాడు లెవిన్‌సన్.

తన పొలంలో జరిగిన చిన్నపాటి దొంగతనాన్ని చర్చించేందుకు ఇంతమంది గుమికూడడాన్ని నమ్మలేనట్లు చూస్తున్న రియాబెట్స్, సమయం మించిపోతోందని కమాండెంటుని తొందర చేశాడు. అతణ్ణి చూసిన కొద్దీ ఇప్పుడిదంతా అర్థం లేని వ్యవహారంలా అనిపించింది. ఇంతలో మొరోజ్కా గుంపు నుండి సందు చేసుకుని,

---

కేవలం ప్రయోగ దృష్టితో రాసినవి కూడా కాదు.

ఇవాళ మన ముందున్న వాస్తవికతలో ఒక రకమైన నాటకీయత ఉన్నది. అసహ్యకరమైన, అమానవీయమైన లక్షణాలు దానికి ఉన్నాయి. పరమ విధ్వంసకారుడు. నిర్మాణం గురించి అలవోకగా, సాధికారికంగా మాట్లాడుతూ ఉంటాడు. ఆ సంగతి అందరికీ తెలుస్తూనే ఉంటుంది. ఈ తెంపరితనం ఏమిటి? అని ఆశ్చర్యపోతుంటాం. వాడి చుట్టూ వాడి నటనకు ఒక సాధికార వలయం అల్లుకొని ఉంటుంది. అది కూడా మనకు కనిపిస్తూనే ఉంటుంది. ఈ రంగ స్థలం మీది నుంచే ఆ తెంపరితనాన్ని, ఆ సాధికారంలోని మర్మాన్ని, మొత్తంగా వాడి విధ్వంస లక్షణాన్ని మనకు చూపించగల కాంతి పుంజం రచయిత దగ్గర ఉండి దాన్ని అలా వేదిక మీదికి ప్రసరింపజేసినప్పుడు అసలు దృశ్యం మనకు కనిపిస్తుంటుంది. కూర్మనాథ్ దగ్గర అలాంటి దృక్పథం, శిల్పం అనే కాంతి పుంజాలు ఉన్నాయి. అందువల్ల ఈ కథలు కేవల ప్రయోగ సంబంధమైనవి కావు. ఈ సుగుణం వల్ల ఒక నిర్దిష్ట స్థలకాలాల్లోని కథలు ఇప్పటి కథలు కూడా అయ్యాయి. ఎందువల్లనో ఈ రచనా సంవిధానం మీద తెలుగు కథా ప్రపంచంలో పెద్దగా చర్చ జరగలేదు. విప్లవ కథకులు కూడా అంత పట్టింపుతో వ్యవహరించినట్టనిపించదు. ఇవాళ మన ముందున్న వాస్తవికతలోని విప్లవ కథా వస్తువు, శిల్పం గురించిన చర్చకు ఒక ఉదాహరణకు పనికి వచ్చే కథలివి. కూర్మనాథ్ ఈ కథలను ఆ కాలంలో ఒక పథకం ప్రకారం వరుసగా రాస్తూపోయారని అనిపిస్తుంది. ఆ తర్వాత తన వైపు నుంచే ఈ కృషి కుంటుపడిందా? అని అనుమానం. ఈ కథలు రాసినప్పటి స్థలకాలాల్లోనే ఇప్పటికీ మనం ఉన్నాం. కనుక ఇలాంటి కథలు ఇప్పుడు మరింత అవసరం. రచయిత ఆనాటి ఘటనలనే ఇతివృత్తంగా తీసుకున్నా.. వాటిని మౌలికంగా పాలకుల రాజకీయార్థిక విధానాల క్రమంలో గుర్తించారు. ఇలా చూడటం వల్లే ఈ కథలు విప్లవ కథల్లో గొప్పగా నిలిచిపోయాయి. ప్రభుత్వాలు ఏవైనా అవే మరింత జోరుగా సాగుతున్నాయి. ఇలాంటి కథలు ఇంకెన్ని రాస్తే ఇవ్వాల్టి సాహిత్య అవసరం తీరుతుంది? ☆

విచారంగా భీకరమైన మొహంతో వచ్చి ద్యుబోవ్ పక్కన నిలబడ్డాడు. ఇక అప్పుడు లెవిన్‌సన్ లేచి, ఇది సభ్యులందరికీ సంబంధించింది కాకుంటే, అందర్నీ పిలిచి వారి పనుల్ని పాడుచేసి ఉండేవాణ్ణి కాదనీ, అంతా ఏం నిర్ణయిస్తే, అదే అమలవుతుందనీ చెప్పి కూర్చున్నాడు.

దాంతో అతడక్కడలేనట్లే భావించి, జనం ఒక్క పెట్టున మాటలు సాగించారు. ఎవస్తఫీ తాత లేచి, పూర్వపు జార్ రోజుల్లో అయితే ఇలాంటి పని చేసినవాణ్ణి కొడుతూ రోడ్లన్నీ తిప్పి, గుండు కొట్టించి, సున్నం పూసి, మసిబొట్లు పెట్టే వారిమని చెప్పాడు. మరొక రైతు లేచి, జార్‌తో మనకిప్పుడు పనిలేదన్నాడు. దాంతో తాత, ఎవరి రోజులైనా ఒక్కటే. దొంగ పని మంచిది కాదని చెప్పాడు. "దొంగల్నెవరూ సమర్థించడం లేదిక్కడ. తెలీకడుగుతాగానీ, పుచ్చకాయల్ని ఇష్టపడటం కూడా దొంగతనమేనంటావా?" అన్నాడు రెండో రైతు. "సరేనయ్యా, పుచ్చకాయలు కోశాడనుకో, చేనునెందుకు పాడు చెయ్యాలి?" మరొకడన్నాడు. "ఇదేమంత భయంకరమైన విషయం? నన్నడిగితే నేనిచ్చేవాణ్ణి అతడు తిన్నన్ని... నీక్కావలసినన్ని కోసుకొమ్మనేవాణ్ణి... ఇందులో ఏమంత కొంపలు మునుచుకు పోయాయని?" అన్నాడు మరొకడు. వారి గొంతులో కోపచిహ్నాలు రవ్వంత కూడా లేవు. పాత చట్టాలు బూజు పట్టిపోయాయి. ఈ నేరం కొత్త పద్ధతిలో పరిష్కరించాలన్న విషయంలో వారంతా ఏకాభిప్రాయాన్ని కలిగివున్నారు. "వారిలో వారినే, ఆ ప్రెసిడెంటునూ, వాళ్లనూ తేల్చుకోమందురూ, మనకెందుకొచ్చింది ఈ పీడ?" అన్నారు కొందరు.

ఇలా ఎవరికి వారు మాట్లాడుతూండే సరికి, లెవిన్‌సన్ లేచి, ఒక్కరుగా మాట్లాడాలని చెబుతూ, మొరోజ్కా ఎక్కడని ఆరా తీశాడు. వెళ్లమని ద్యుబోవ్ ముందుకు తోసినా, వెళ్లేందుకు మొరోజ్కా మొదట తటపటాయించినా, చివరికి వేదిక వద్దకు వెళ్లేలోగా ముచ్చెమటలు పోసి వణికి పోసాగాడు. తలెత్తి చూడలేకపోయాడు. అంతా తననే గమనిస్తూంటరని అతడికి తెలుసు. చివరికి ఎలాగో తలెత్తి చూస్తే, శాపర్ గోంచరెంకో తననే తీవ్రంగా చూస్తూ కనిపించాడు. దాంతో అతడు మొహం తిప్పేసుకున్నాడు.

'ఇక కార్యక్రమాన్ని ప్రారంభిద్దాం' అంటూ లెవిన్‌సన్, 'ఎవస్తఫీ' తాతను మాట్లాడమనే సరికి, "చెప్పేందుకేముంది ఇందులో" అన్నాడు తాత. మీలో మీరే తేల్చేసుకోమని రైతులంతా అరిచి చెప్పారు. దాంతో ద్యుబోవ్ దిగ్గున లేచి, "మాలో మేమే తేల్చేసుకోవాలా? అంటే మీకు దమ్ముల్లేవన్న మాటేగా?" అని ఆవేశంగా అని, "సరే, మేమే తేల్చేసుకుంటాం" అంటూ అతడు మొరోజ్కా వంక కోపంగా చూశాడు. "నువ్వు కూడా గని కార్మికుడివే కాబోలు, పాపం మిగతా సుబాన్స్క్ వారి మంతా పనికిమాలిన వారిమి, నువ్వొక్కడివే ఘటికుడివి కాబోలు కదూ? మాలో ఒకడిగా ఉండదానిక్కూడా నీకు బహుశా నామోషీగా ఉందేమో కూడా, అవునా? ఓరి సున్నప్పిడతా, గని కార్మికుల పరువు తీశావు కదరా..." అన్నాడతడు కంచుకంఠంతో.

దీంతో మొరోజ్కా మొహం మాడి పోయింది. ద్యుబోవ్ వంక చూడలేక తలదించుకున్నాడు. అయినా అంతటితో ద్యుబోవ్ ఆగలేదు. "సరే నీ ఇష్టం వచ్చినట్లు తగలడు... మా ఆసరా లేకుండా నువ్వెంత కాలం వెలిగిస్తావో చూస్తాంరా. ఇంక మా ఉద్దేశంలో దళం నుంచి తొలెయ్యడమొక్కటే సరైన మార్గం..." అన్నాడు లెవిన్ వంక తిరిగి. "నిదానంగా ఆలోచించండి..." అన్నాడొక పార్టిజాన్. వెంటనే గోంచరెంకో లేచి, "అతణ్ణి వెనకేసుకొస్తున్నాననుకోకండి... వాడు శుద్ధ దగుల్బాజీ పనే చేశాడు. ఇటువంటి వాటి జోలికి పోవద్దని రోజూ అతడికి చెబుతూంటాను. అయితే అతడు మంచి సైనికుడన్న సంగతిని మనం మరిచి పోకూడదు. 'ఉజురిస్క్' రంగమంట్లోనూ ప్రథమ శ్రేణిలో మేమిద్దరం కలిసి ఉన్నాం. అతడెన్నడూ వెనుకంజ వెయ్యలేదు. ఇక ముందు కూడా వెయ్యబోడనే నా నమ్మకం..." అన్నాడు.

"మీలో ఒకడా?" అతణ్ణి తీవ్రంగా ఎదుర్కొన్నాడు ద్యుబోవ్. "మాలో మాత్రం ఒకడు కాదూ? ఒక రోజు కాదు, మూణ్ణెల్ల పాటు మేమిద్దరం ఒకే పక్క మీద పడుకున్నాం తెలుసా? కర్మకాలి ప్రతివాడూ మాకు పాఠాలు బోధించేందుకు తయారయ్యారు" ద్యుబోవ్ కోపంగా అన్నాడు. అతడి వంక ఆశ్చర్యంగా చూసిన గోంచరెంకో, "ఏమైనా దళం నుంచి ఒక్కసారిగా తొలగించడం మంచిది కాదు. ఈ విషయంలో అతడి అభిప్రాయం కూడా తెలుసుకోవడం అవసరమని నా అభిప్రాయం" అన్నాడు.

"ఔనౌను, వాణ్ణే అడుగుదాం... తనకి అంతరాత్మ అనేది ఒకటుందో లేదో..." అంటూ ద్యుబోవ్, మొరోజ్కా వంక చూశాడు. దీంతో ఏం చెయ్యాలో అర్థం కాలేదు మొరోజ్కాకి. కానీ లెవిన్‌సన్ హెచ్చరించే సరికి, "నా... మీ ఉద్దేశంలో... నేనటువంటి పాడు పని చేసేవాడినేనా... పాడు పుచ్చకాయల దొంగతనం... ఎవడైనా చెడ్డవాడయినందువల్ల చేస్తాడా? చిన్నతనం నుంచి ఎప్పుడూ పుచ్చకాయలు కొయ్యడం దొంగతనంగా భావించలేదు... అంచేత ద్యుబోవ్ చెప్పినట్లుగా..." మొరోజ్కా మాటలు తడబడ్డాయి. కళ్లు చెమ్మగిల్లాయి. గుండెల్లోంచి వచ్చినట్లుగా, "కామ్రేడ్... మీలో ఎవరి కోసమైనా నా చివరి రక్తపు బొట్టు వరకూ ధారపొయ్యడానికి సిద్ధం... నేచేసిన పాపానికి ఏ విధంగా పరిహారం చేసుకోను? ఈ గనిపనివాడి మాటలు... వాగ్దానాన్ని మీరు నమ్మవచ్చు... ఇక ముందెప్పుడూ ఇలాంటి పరువు తక్కువ పని చెయ్యను" అన్నాడు. "మాట తప్పితే?" అని లెవిన్‌సన్ ప్రశ్నించే సరికి, "అప్పుడు నన్ను కాల్చి పారెయ్యండి" అని మొరోజ్కా అన్నాడో లేదో, ద్యుబోవ్ వెంటనే "తప్పకుండా కాల్చి పారేస్తాం" అన్నాడు కటువుగా.

ఆ విధంగా ఆ నేరం పరిష్కారమైంది. చివరగా, గెరిల్లాలంతా తమ విరామ సమయంలో రైతులకు వ్యవసాయం పనుల్లో సాయం చెయ్యాలన్న తీర్మానాన్ని ప్రతిపాదించాడు లెవిన్‌సన్. అంతా ఆమోదించడంతో సమావేశం సమాప్తమయింది. సమావేశం నుండి తన మకాంకి వస్తూండగా ఆ రోజు మిష్కాకి ఇంకా నీళ్లు పెట్టలేదని గుర్తొచ్చింది మొరోజ్కాకి. అతడు గబగబా మిష్కా వద్దకు చేరుకునే సరికి, అది కోపంతో సకిలించింది. తన నోటి వద్దకు దాని ముక్కు చేర్చేసరికి, "ఇప్పటికి నీకు తృప్తి తీరిందా?" తప్పంతా దానిదేనన్నట్లు చూశాడు మొరోజ్కా.

లెవిన్‌సన్ గురించి దళంలోని వారందరికీ తమను

నడిపించడానికే పుట్టాడని భావిస్తారు, అతన్ని బాగా ఎరిగిన స్తాషిన్స్కీ, గోంచరోవ్, ద్యుబోవ్‌లకు తప్ప. ఇక అతణ్ణి పూర్తిగా అనుకరించే బాక్లనోవ్ లాంటివారైతే అతణ్ణి లోపాలే లేని మానవాతీతుడిగా భావిస్తారు. అలాంటి ప్రతిభావంతుడైన లెవిన్‌సన్‌కి కొద్దిరోజులుగా అందుతున్న వార్తలు ఆందోళనకరంగా ఉన్నాయి. జపాను వాళ్లు 'క్రిలోవ్కా'ను వదిలేసి వెళ్లారని తెలీడంతోనే అతడి తటపటాయింపు పెరిగిపోయింది. ఇంతలో ఆగస్టు నెల మొదట్లో ఒకనాటి మధ్యరాత్రి పార్టిజాన్ల డివిజనల్ కేంద్ర కార్యాలయాధికారి అయిన 'సుహోవీకొవ్నన్' నుంచి దారుణ పరాజయ వార్త వచ్చింది. పార్టిజాన్ దళాలు ప్రధానంగా కేంద్రీకరించిన 'అనూచినో'పై జపాను వారు చేసిన దాడిలో వందలాది పార్టిజానులు చిత్రహింసలకు గురయ్యారనీ, తనక్కూడా 9 గుండు దెబ్బలు తగిలాయనీ, ఇక తన పని ముగిసినట్లేననీ ఆ వార్త సారాంశం.

ఈ పరాపజయ వార్త గాలికన్నా వేగంగా వ్యాపించి భయభీతుల్ని కలిగించింది. 4 పక్కల నుండీ వార్తల్ని సేకరించే సరికి 4 రోజులు పట్టింది. అప్పటికీ భవిష్యత్తు కార్యక్రమాన్ని నిర్ణయించలేకపోయాడు లెవిన్‌సన్. 'మెతెలిత్సా' నాయకత్వాన ఓ రైతుల ప్లటూన్ తిరోగమనం ప్రారంభించింది. 'క్రిలోవ్కా' నుంచి పట్నం పంపిన 'కానున్నికోవ్', కేంద్ర కార్యాలయం నుండి వార్త వచ్చిన నాలుగు రోజులకు పెరిగిన గడ్డంతో, నిద్రాహారాలు లేకుండా వచ్చాడు. పట్నం మీద కూడా దాడి జరిగింది. 'క్రీజెల్మన్'ను నిర్బంధించారు. 'అలెక్సాంద్రోవ్స్క్' లోనూ, ఓల్గా తీరాన జపానువారు తిష్ఠ వేశారు. సచాన్స్క్‌ను నేలమట్టం చేశారు... ఈ వార్తలు చెబుతూ, తన చొక్కా మడతల్లో నేర్పుగా సర్దిన ఉత్తరాల కట్టను వెలికి తీశాడు కానున్నికోవ్. ఉత్తరాలు చదివాక, పోరాట దళాలను సిద్ధం చేయ్యాలన్న నిర్ణయానికి వచ్చి, బాక్లనోవ్‌కూ, క్వార్టర్ మాస్టర్‌కూ కబురు చేశాడు. 'అంతా సిద్ధమేనా?' క్వార్టర్ మాస్టర్‌ని అడిగాడు.

"నేనెప్పుడూ సిద్ధమే... ఓట్లు మాత్రం తడిశాయి. వాటిని రవాణా చెయ్యడం అసాధ్యం... గుర్రాలు కొన్నింటికి జబ్బు చేశాయి...' సారాంశం ఏమంటే, అతడేమాత్రం సిద్ధంగా లేడనీ, పెట్టుకోబోయే ప్రయాణం ప్రమాదభరితంగా ఎంచుతున్నాడనీ, కమాండెంటు వంక కన్నెత్తి చూడలేక, రెప్పలార్చుతూనట్లు కొట్టాడు క్వార్టర్ మాష్టరు. అతడి కోటుని దొరకపుచ్చుకుని, "నువ్వు మాట్లాడేదాంట్లో అర్థం లేదు" అని లెవిన్‌సన్ అనే సరికి, అతడి ఉద్దేశం బయటపడింది. దానితో లెవిన్‌సన్ అతణ్ణి ఓ ఊపు ఊపి, "ఒక్క క్షణం వ్యవధిలో నువ్వు కదలడానికి సిద్ధంగా ఉండాలి. బాక్లనోవ్, నువ్వితడికి సహాయం చెయ్యి" అని ఆజ్ఞాపించాడు. దాంతో క్వార్టర్ మాస్టర్‌కి తను చెప్పిన ఆటంకాలన్నీ అర్థం లేనట్లే అనిపించి, అబ్బే... ఆటంకం ఏం ఉంది... అవసరమనుకుంటే, ఈ రోజే బయలు దేరవచ్చు..." అన్నాడు. వెడుతూ వెడుతూ మాత్రం, లెవిన్‌సన్‌ని ఉద్దేశించి" దొంగ పీనుగ... జిత్తులమారి" అనుకున్నాడు.

సాయంకాలానికి దళ సమితిని, ప్లటూన్ కమాండర్లని సమావేశపరిచాడు లెవిన్‌సన్. దళం కదలాలన్న ప్రతిపాదనను వయో వృద్ధుడైన 'క్యుబ్రిక్' తప్ప, అంతా బలపరిచారు. క్యుబ్రిక్ ఆ ప్రాంతం వాడే అయినందున అతణ్ణి ఎవరూ బలపరచలేదు. గొల్ల 'మెతెలిత్సా' అతడి వాదాన్ని ఎదుర్కొని, ఇక్కడే ఉంటే వంటింటి కుందేలుగా చిక్కుతాం" అన్నాడు. అతడే దళం తిరోగమనానికి స్వంత ప్లాను కూడా ప్రకటించాడు. కానీ దాన్ని బట్టి అతడికి సైనిక వ్యూహరచనలో ఏ మాత్రం ప్రవేశం లేనట్లు అర్థమవుతుంది. అతడి చురుకుదనాన్ని బాక్లోనోవ్ మెచ్చుకున్నాడు. "మొన్నటి దాకా గుర్రాల్ని కాసిన ఇతడు రెండేళ్లలో చూడండి... మనందరి మీదా కమాండర్ అవుతాడు" అన్నాడు. "అవునవును" అంటూ అతణ్ణి లెవిన్‌సన్ బలపరుస్తూనే, తెలివిగా మెతెలిత్సా ప్లానులో తన ప్లానుని జొప్పించి, దానికి ఆమోదం పొందాడు. ఆ తర్వాత పట్నానికి లేఖ రాస్తూ, దళాన్ని 'రోహెట్జ్' నది వద్ద 'షితీషీ' గ్రామానికి తరలిస్తున్నట్లు చెప్పాడు. అలాగే డాక్టర్ స్తాషిన్స్కీకి రాస్తూ, ఆర్డర్ పంపేదాకా ఆస్పత్రిని అక్కడే ఉంచాలని చెప్పాడు. ఆ రాత్రి పనులన్నీ ముగించుకునే సరికి చాలా పొద్దు పోయింది. అప్పుడు 'కానున్నికోవ్' తెచ్చిన మరో ఉత్తరం సంగతి గుర్తొచ్చింది లెవిన్‌సన్‌కి. అది భార్య రాసిన ఉత్తరం. అందులో ఆమె, తనకు పనేమీ దొరకలేదనీ, ఇంట్లోని సామాన్లన్నీ అమ్మేశాననీ, రెడ్‌క్రాస్ ధర్మమా అని ఏదో కాలం వెళ్లబుచ్చుతున్నట్లు, పిల్లలు రక్తహీనతతో బాధపడుతున్నట్లూ రాస్తూనే, అతని ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూసుకోమని హెచ్చరించింది. ఉత్తరం చదువుకుని నిట్టూర్చాడు లెవిన్‌సన్. వెంటనే అతడు ఇతరులెవ్వరికీ అర్థం కాని సన్నని లిపిలో కాగితాలు నింపాడు.

ఆపై రాత్రి కాపలాదారు ఎలా ఉన్నాడో పరీక్షించేందుకు లెవిన్‌సన్ గుర్రం ఎక్కి బయలుదేరాడు. పొదల చాటునున్న కాపలా చౌకు చేరబోతుంటే, కాపలాదారు రైఫిల్ గురిచేసి ప్రశ్నించాడు. అతడితో మాట్లాడి, నదిదాటి చేలల్లోకి ప్రవేశించేసరికి, అడవి ముందున్న గుట్ట మీద నలుగురు రౌతులు తిరగడం చూశాడు. వారిలో ఇద్దరు చౌకాదార్లు, ఇద్దరు కొత్తవారు. అక్కడి కెళ్లి, వారెవరని ప్రశ్నించాడు లెవిన్‌సన్. "ఆ సోకిన పంపిన వేగులు. జపాను వాళ్లు 'మేరియనోవ్కా'లో ఉన్నారట" చెప్పారు చౌకీదారులు. "అయితే, అసోకిన్ దళం ఎక్కడ?" అనడిగితే, "క్రిలోవ్కా"లో చెప్పారు వేగులు. తమ దళం వెనుకంజ వెయ్యాల్సి వచ్చిందనీ, దారుణమైన పోరాటం జరిగిందనీ, లెవిన్‌సన్ దళంతో సంబంధం పెట్టుకునేందుకు తమను పంపారనీ వారు చెప్పారు. దాంతో వారిని తీసుకుని హెడ్ క్వార్టర్‌కి చేరాడు లెవిన్‌సన్. వారి మాటల వల్ల తాను అక్కణ్ణుంచి వెళ్లిపోవాలని తీసుకున్న నిర్ణయం సరైందేననుకున్నాడతడు.

లెవిన్‌సన్ రాసిన ఉత్తరం ప్రకారం స్తాషిన్స్కీ ఆస్పత్రి పరివారాన్ని తగ్గించేందుకు ప్రయత్నించాడు. చిన్న చిన్న గాయాల వారిని కట్లు కట్టి పంపేసింది వార్యా. ఇక ఇప్పుడు మిగిలింది ఫ్రోలోవ్, మెచిక్‌లు మాత్రం, పీకాకు ఏ రోగం లేదు. కానీ అతడెక్కడికి వెళ్లడానికీ ఎవరూ లేరు. "త్వరలోనే నువ్వూ వెళ్లిపోతావు" మెచిక్‌తో అంది వార్యా. "ఎక్కడికి వెళ్లను?" అన్న అతడి ప్రశ్నకు, "ఏముంది, లెవిన్‌సన్ దళంలో చేరు. మాది అశ్వికదళం. నీకూ స్వారీ వచ్చే ఉంటుంది. రాకుంటే, రెండ్రోజుల్లో నేర్చుకోవచ్చు" సలహా చెప్పిందామె, అతని పక్కనే కూర్చుని.

"ఏం ఫర్వాలేదు. నీవు చక్కని యువకుడివి... పైగా సిగ్గు..." అంటూ అతడి నుదుటిని ముద్దాడిందామె. "షాల్డిబా దళానికే

తంటాలు. అతనికి దళంలోని వారంతా గ్రామస్తులు. కానీ మా దళంలో అంతా గని పనివాళ్లు, ఆ పరిసరాల వాళ్లను. వీళ్లతో మెలగడం తేలిక. నీకు వీలు కుదిరినప్పుడల్లా నా దగ్గరకు వస్తూండు" చెప్పిందామె. "మరి మొరోజ్కానో?" అని అతడనేసరికి, "మరి ఫొటోలోని అమ్మాయి?" ఆమె ప్రశ్నించింది. "ఆమెను ఎప్పుడో మరిచిపోయా. దాన్ని చించేశా కూడా" అతడన్నాడు. "మొరొజ్కో సంగతి కూడా అంతే. అంత మాత్రాన విడిపోయామని కాదు. నీకేం ఫర్వా లేదు. మా వాళ్లను చూసి భయపడకు. నువ్వంటే నాకెంతో ప్రేమ" అందామె. "నిరుత్సాహమెందుకు?" అనుకున్నాడు మెచిక్. 'స్వంత కాళ్ల మీద నిలబడి, ఇతరులతో సమానంగా వ్యవహరించాలి' అనుకుంటూ, వార్యాతో కలిసి గుర్రబ్బగ్గీలో విహరిస్తున్నట్లు ఊహల్లో తేలిపోయాడు మెచిక్.

కొద్ది రోజుల్లోనే దళం నుండి డాక్టరుకి రెండో జాబు తెచ్చాడు మొరోజ్కా. భార్య దగ్గరకెళ్లి "అడవిలోకి పోదాం పద" అని తొందర పెట్టాడు. "అంతకు మించి వేరే దృష్టి లేదు నీకు" మెచిక్‌ని తలుచుకుని నిస్సారంగా అంది వార్యా. అయినా అతనిలో నడిచింది. లోపలి కెళ్లాక, "నీ పుర్రెలో ఏదో పురుగు ప్రవేశించింది" అడిగాడు మొరోజ్కా. తన భార్య పెళ్లవ్వకముందు సరే, పెళ్లయ్యాక కూడా తన ఒక్కడికే పరిమితం కాదన్న సంగతి పెళ్లయిన మర్నాడే గ్రహించాడు. అప్పట్నుంచి అతడు పూర్తిగా తామరాకుపై నీటిబొట్టు ప్రాయమైంది అతడి ప్రవర్తన. నిజానికి సాంసారిక జీవితాన్ని పూర్తి స్థాయిలో ఎన్నడూ అనుభవించలేదు. కానీ ఈసారి ఆ మెచిక్ లాంటి బడుద్ధాయి వెంటపడుతూండటమే అతడికి చిరాకు తెప్పిస్తోంది. "ఇంతకీ నీ కన్నెవరి మీద... ఆ పాల బుగ్గల పసివాడి మీదనే పడింది?" అడిగాడతడు. "నా ఇష్టం... నీకేంటంట? పెళ్లయిన మూడేళ్లయినా ఓ బిడ్డను ఇవ్వలేక పోయావుగానీ..." అందామె గయ్యిన లేచి. "పది మంది నడిచే తోవలో గడ్డిపరక ఎలా మొలుస్తుంది? అయినా అనవసరంగా అరవకు..." అన్నాడతడు కరుగ్గా. "'ఏం, కొట్టాలనుకుంటున్నావా? కొట్టు చూస్తా..." ఎదుర్కొంది. దాంతో ఎత్తిన చెయ్యి దించేశాడు మొరోజ్కా. "నీ ఒళ్ళు మరమ్మత్తు చెయ్యడం అవసరమేననుకో, కానీ ఆడ పురుగు మీద చెయ్యి చేసుకోలేను" అంటూ అతడు వచ్చిన దారినే వెళ్లిపోయాడు. వార్యా పిలిచినా, వినిపించుకోలేదు.

వెడుతూ, వెడుతూ మొరోజ్కా మెచిక్ దగ్గరకెళ్లి, తనాతణ్ణి ఎలా మోసుకొచ్చిందీ వివరంగా చెప్పి బూతుల వర్షం కురిపించాడు. పీకా, వార్యా అతణ్ణి వారించేనిదుకు పరుగులు తీస్తూ రావడం చూసి, గుర్రం పైకి ఛెంగున దూకి, జాబు తీసుకెళ్లమని డాక్టర్ అరుస్తున్నా, వెళ్లిపోయాడు. దారి మధ్యలో తాను మెచిక్‌ని తగినంతగా దూషించలేదని అనుకున్నాడు గానీ, కొంత దూరం వెళ్లేసరికి అతడి కోపం చల్లారిపోయింది. ఇక వార్యాతో ఉండటం అసంభవమను కున్నాడు. గుర్రపుశాల దగ్గర ద్యుబోవ్ ప్లటూన్‌లోని గస్తీ వారిని కలుసుకోగా, వారంతా అతణ్ణి నవ్వుల్తో, వెటకారాలతో ఆహ్వానించారు. అప్పటిగ్గానీ అతనికి తాను ఆస్పత్రి నుంచి జవాబు తేలేదని గుర్తుకు రాలేదు. దాంతో అతడు కుంగిపోయాడు. లెవిన్‌సన్ జవాబు తెచ్చావా అనడిగితే, తేలేదన్నాడు. లెవిన్ ఏదో ఆలోచనలతో ఉండి, మంచిదని ఊరుకున్నాడు. దాంతో మొరోజ్కా ధైర్యం తెచ్చుకుని, "ఇదుగో లెవిన్‌సన్, నిన్నొకటి అడగాలనుకుంటున్నా. అది గనుక చేశావంటే, నువ్వు నాకు శాశ్వత మిత్రుడివన్న మాట ప్రమాణ పూర్తిగా" అన్నాడు. "శాశ్వతమిత్రుడు? సరే చెప్పు, అదేమిటో" లెవిన్‌సన్ అడిగాడు. "నన్ను ప్లటూన్‌కు తిరిగి వెళ్లనివ్వు. ఆర్డర్లీగా 'ఏఫియ్కా'ను వేసుకోవాలంటే అతడు గుర్రపు స్వారీలో ఎన్నో బహుమతులు కొట్టేశాడు కూడా" అన్నాడు. "సరే, అతణ్ణి పంపించమని ద్యుబోవ్‌తో చెప్పు" లెవిన్‌సన్ అంగీకరించే సరికి, సంతోషం పట్టలేక, ప్లటూన్ దగ్గరకెళ్లి, అంతా చెప్పి, ఆనందంతో డాన్స్ చేశాడు. మధ్యలో పట్టు తప్పి, కమాండర్‌పై పడే సరికి, అప్పటికే ద్యుబోవ్ ఊడదీసిన రివాల్వర్ భాగాలు చెల్లాచెదురుగా పడిపోయాయి. "ఏందీ" అంటూ ద్యుబోవ్ ఒక్క చరుపు చరిచాడు. పెద్ద దెబ్బే అయినా పట్టించుకోలేదు మొరోజ్కా. ప్లటూన్‌లోని వారంతా అతణ్ణి అభినందించారు. పాత గాంగులోకి మొరోజ్కా వచ్చి కలిసినందుకు అభినందనగా అతణ్ణి రాత్రి కాపలా కోసం నియమించాడు ద్యుబోవ్. తానూ మంచి సైనికుడేనని, ఉపయోగపడేనని అనుకున్నాడు మొరోజ్కా.

ఆ రాత్రి ద్యుబోవ్‌కి నిద్రలోని హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఇంతలోనే కాల్పుల శబ్దం వినిపించింది. వెంటనే లేచి, మిగిలిన వారందర్నీ లేపే ఏర్పాట్లు చేశాడు. ఆపై అంతా ఆయుధాలు తీసుకుని గుర్రాలతో పెరట్లోకి వెళ్లారు. అందర్నీ కార్యాలయం దగ్గరకు వెంటనే రావాలన్న కబురొచ్చింది. తీరా తన వాళ్లని లెక్కేస్తే, సగం మంది కూడా లేరు. మిగిలిన వారు సాయంకాలం సమావేశానికి గ్రామంలోకి వెళ్లి, యువతులతో ఖుషీ చేస్తున్నారు. వారిని తీసుకురమ్మని రీతుల్ని పంపి, అందర్నీ పోగేసే సరికి చాలా సమయం పట్టింది. వీరు వెళ్లే సరికి, మిగిలిన ప్లటూన్లన్నీ ప్రయాణానికి సిద్ధంగా కనిపించాయి. ద్యుబోవ్‌కి సిగ్గనిపించింది. "ఏం.. ఇంత త్వరగా దయచేశావేం... మళ్లీ ఎప్పుడూ మా గని పనివాళ్లమంటూ గప్పాలు కొడుతుంటావ్?" కుర్రకుంక బాక్లనోవ్ అవమానించడానికి అవకాశం దొరికినందుకు బాధపడ్డాడు ద్యుబోవ్.

కాల్పులు ఉత్తుత్తివే. దళం సన్నద్ధతను తెలుసుకునేందుకే లెవిన్‌సన్ ఈ పని చేయించాడు. మొత్తానికి అందరికన్నా క్యూబ్రిక్ ప్లటూన్‌లో వాళ్లే ఎక్కువ మందిలేరు. క్యుబ్రిక్ కూడా గ్రామంలో బంధువుల వద్ద వీడ్కోలు తీసుకోవడానికి వెళ్లి తప్ప తాగి వచ్చాడు. "నీ వంటి పంది వెధవను మీరంతా గౌరవించగలరా?" ఏడుస్తూ అన్నాడతడు. అతడు తాగిన సంగతిని కావాలనే లెవిన్‌సన్ తెలియనట్లు నటించాడు. లేకుంటే అతణ్ణి డిస్మిస్ చెయ్యాలి. ఆ పని చేస్తే, అతని స్థానాన్ని భర్తీ చేసే వారెవరూ లేరు. శ్రేణుల్ని తనిఖీ చేస్తున్న లెవిన్‌సన్, తమ ప్రయాణం ఇప్పుడేనని, గమ్యం స్థానం చెప్పలేనని, దాగి ఉండేందుకు వెడుతున్నా, శత్రు సేనలు అధికంగా ఉన్నందున, ప్రమాదం తప్పినట్లు కాదనీ చెప్పాడు. తాము గెరిల్లా అనే పేరును సార్థకపరచలేదనీ, ఎందుకంటే ముసలమల్లా ఈడిగల పడ్డామనీ, జపాను వారు నిజంగా దాడి చేసినట్లయితే, కోడి పిల్లల మెడ విరిచేసినట్లు చేసేసే వారని, ఇది సిగ్గు చేటనీ చెప్పాడు. నిజమేననుకున్నారంతా. సరుకు శకటాలతో ద్యుబోవ్ ప్లటూన్ వెంట

వెళ్లాలనీ, ఎందుకంటే అతని ప్లటూన్ వేగంగా వెడుతుంది కనుక అన్నాడు లెవిన్‌సన్. ద్యుబోవ్ అందుకు సిద్ధం చేశాడు. తెలి రేఖలు విచ్చుకుంటూండగా దళమంతా కదిలింది.

రెండో భాగం: ఆరోజునే మెచిక్ తనంతటతానులేచి తిరగడం మొదలెట్టి ఆనందపడిపోయాడు. కానీ ఫ్రాలోవ్‌నిచూచి, నేరభావంతో సతమతమయ్యాడు. చావడానికి సిద్ధంగా ఉన్నా, చావడం మాత్రం ఫ్రాలోవ్‌కి ఇష్టం లేదు. అతడు జీవితాన్ని పట్టుకుని వేలాడటం పక్కనున్న వారందరికీ ఇబ్బంది కలిగించింది. ఇక వార్యా విషయానికి వస్తే ఆమెకు ఎందరితో సంబంధం వున్నా, మెచిన్ ని సేవించింది. ఏస్త్రీతో సంబంధంలేని అతడు, తన మాతృత్వాభిలాషను తీరుస్తాడని భావించింది. ఏమైనా అతడు పీరేతోపాటు ఆస్పత్రినివీడివెడుతుంటే, తను కుట్టిన ఒక పుగాకు సంచిన బహూకరించి వీడ్కోలు చెప్పింది.

పీరేతోపాటు బయలుదేరిన మెచిక్ చాలాదూరం కొండదారుల వెంట ప్రయాణించి, రెండోనాటి రాత్రికి 'ఇరోహెజ్జ్' నది గట్టకి ఆవలనున్న "షిబిషి" గ్రామం చేరారు. అక్కడ పిల్లలతో బంతిఆడుతున్న పొట్టి వ్యక్తి లెవిన్‌సన్ కనిపించాడు. మొరోజ్కా రక్షించిన మెచిన్‌ని అక్కడివారు గుర్తించారు. తాము దళంలో చేరేందుకు వచ్చామని మెచిన్ చెప్పగానే, రైఫిల్ కాల్పుల పరీక్ష పెట్టారు. అందులో ఫర్వాలేదనిపించేసరికి, అతణ్ణి క్యుబ్రక్ ప్లటూన్‌లో చేర్చాడు లెవిన్‌సన్. గుర్రపుస్వారీ అతనికి రానందున, నెమ్మదస్తురాలైన "జియాచికా" గుర్రాన్నిచ్చారు. వంగిన నడుంతో, కన్నీరుకారుస్తూ ఈసురోమంటున్న ఆ గుర్రం మెచిక్‌కంటికి ఆనకపోవడంతో, ఆ గుర్రాన్నికున్న గజ్జి గురించి, దానికి చెయ్యాల్సిన చికిత్స, మేత ఏర్పాట్ల గురించి క్యుబ్రక్ చెబుతున్నా, సరిగా వినిపించుకోలేదు. ఆ తర్వాత ఆ మాటల్ని విననందుకు విచారించి, కేంద్ర కార్యాలయం వద్ద తెలుసుకుందామని వచ్చాడుగానీ అక్కడికొచ్చాక, తానెందుకు అక్కడికొచ్చిందీ మర్చిపోయాడు. అక్కడ ఓ గుంపు చేరి, కాలక్షేపానికి కాముక కథలు చెప్పుకొంటుడటం, వారిలో ఒకనిగా లెవిన్‌సన్ కలిసిపోయి, వారికన్నా ఎక్కువ ఆకర్షణీయంగా ఆ కథలు చెప్పడం, వాటితోపాటు బూతు మాటల్ని సంకోచంలేకుండా చెప్పడం చూసి వింతగా భావించాడు మెచిక్. ఈ లెవిన్‌సన్ వేరేవ్యక్తి అనుకున్నాడు. ఇక అతడు గుర్రం సంగతే పట్టించుకోకపోయేసరికి, మిగిలిన వాళ్లే దానికింత మేతవేస్తూ, మెచిక్ సోమరిపోతుతనానికి తిట్టుకున్నారు. దీనికి తగ్గట్టు జియాచికా గజ్జి పెరిగిపోయింది. ప్లటూన్‌లో అతడితో మాట్లాడేవారే కరువయ్యారు. ఒక్క పీకా, ఛిజ్‌లు తప్ప.

ఛిజ్ డప్పాలు కొడుతూ, అక్కడ తెలివైన వారెవరూ లేరని, లెవిన్‌సన్ కూడా పెద్ద చదువుకోలేదనీ, కానీ ఒట్టి జిత్తుల మారని చెప్పాడు. ఆ మాటల్ని నమ్మలేక," అతడింకా ముక్కుసూటిమనిషనుకున్నానే" మెచిక్ అన్నాడు. అబ్బే పొరపాటు." అంతేకాదు, బాక్లనోవ్ ఒట్టి కసుగందు. ఇంకా నేనే నయం, ఏడుగుండు దెబ్బలుతిన్నా"ఛిజె చెప్పాడు. ఇంకా గార్డు డ్యూటీ, వంట డ్యూటీల్ని ఎగేసే మార్గాలు కూడా ఛిజ్ నేర్పాడు. దీంతో ఇద్దరి దోస్తీ పెరిగింది. అయితే తర్వాత జరిగిన ఓ సంఘటనలో ఛిజ్ కలిగించిన అభిప్రాయాల్నుండి మెచిక్ బయటపడ్డాడు.

తమ దళం మారుమూలకు తప్పుకోవడం వల్ల, ఇతర దళాలతోటి సంబంధం తెగిపోయింది. అప్పుడప్పుడూ వచ్చిన వార్తల్ని బట్టి వినాశనం ఎక్కువగానే కనబడింది లెవిన్‌సన్‌కి. అదీగాక తాముంటున్న తైగా అరణ్యాల్లో చలిదుస్తులు, మందుగుండూ కావాలి. ఆ దుర్గమ మార్గాల గుండా అతడు దగ్గర్లోనే ఓ రైలు మార్గాన్ని కనుగొన్నాడు. ఆ దారిలో త్వరలోనే మందుగుండూ, ఇతర సామాన్లు ఉన్న ఓ మిలటరీ రైలు వస్తుందని తెలుసుకుని, దానిపై దాడికి ద్యుబోవ్ ప్లటూన్‌ని నియమించాడు. కొందరు మందుపాతర నాటగా, ద్యుబోవ్ దాడిని సమర్థంగా నిర్వహించి, గూడ్స్ బండిలోని సామాన్లను గుర్రాలు మోయగలిగినన్నింటిని తీసుకుని, ఏమాత్రం నష్టం లేకుండా తిరిగివచ్చాడు.

శత్రువులు 'ఉలాహిన్స్' లోయలో, ఉస్సూరీ-ఇరోహెడ్జ్ నదుల సంగమ స్థానంలో విడిసి ఉన్నాయి. వారి వేగులు నలువంకలా తిరుగుతున్నారు. ఆగస్టు మాసాంతంలో వారు మెల్లగా ఆగి,ఆగి, తమ శ్రేణుల్ని కాపాడుకుంటూ వస్తున్నాయి. లెవిన్సన్ సైన్యం ఆగ్రదళాల కదలికల గురించి పొంతన లేని వార్తల్ని చెబుతున్నారు ఇది గ్రహించిన లెవిన్‌సన్, బాక్లనోవ్‌ని అందుకు పురమాయించాడు మెచిక్‌ను వెంట తీసుకెళ్లమన్నాడతడు. కొత్త కుర్రాడుగనుక, ఏరకమో కనిపెట్టవచ్చన్నాడు ఇద్దరూ మర్నాడు తెల్లారురుఝామున బయలుదేరారు. జియాచికా పుళలను చూసి, " దానికే జాగ్రత్తలు తీసుకోవాలో క్యుబ్రక్ చెప్పలేదా?" ప్రశ్నించాడు బాక్లనోవ్. పెద్దగా చెప్పలేదని మెచిక్ అబద్ధమాడాడు. " అయితే ఇంకెవరినన్నా అడిగుండాల్సింది" అన్నాడు బాక్లనోవ్. ఈ మాటలతో మెచిక్‌కి, అతడిపై గల దురభిప్రాయం పోయింది. అతడిస్నేహ వైఖరి వల్ల, అతడు తెలివైన వాడేగాక, బలశాలి, ధైర్యశాలి అని కూడా గ్రహించాడు. మాటల సందర్భంలో తనని మ్యాగ్జిమలిస్టులు పంపారని మెచిక్ చెప్పగానే, " వారో వెర్రివెంగళాయిలు. వారితో సంబంధాలు పెట్టుకోవడం మంచిదికాదని " బాక్లనోవ్ సలహా ఇచ్చాడు. అంతేగాక, అతడు జిమ్నాజియం (మన హయ్యర్ సెకండరీ స్కూలు లాంటిది) చదివిన సంగతివిని, తాను వడ్రంగంనేర్పే స్కూలుకు వెళ్లిన సంగతి చెప్పి, అంతకుముందు నేవా నిర్మాణంలో పనిచేశాననీ, జిమ్నాజియమ్‌లో చేరాలని తాను కలలు కన్నానని చెప్పాడు బాక్లనోవ్. అతడి పట్ల సానుభూతికలిగిన మచిక, జిమ్నాజియమ్ చదవకపోవడం ఏమంత చెడ్డ విషయం కాదని ఓదార్చాడు.

(మిగతా వచ్చే సంచికలో...)



**అరుణతార చందాదారులకు విజ్ఞప్తి!**

ఏ కారణం చేతనైనా మీకు అరుణతార అందకపోతే పిన్‌కోడ్‌తో సహా మీ చిరునామాను మరోసారి **8500809250** మొబైల్ నంబర్‌కు మెసేజ్ పెట్టగలరు. గమనిక : ఈ నెంబర్ కేవలం మెసేజ్‌ల కొరకు మాత్రమే! - సం.

# నాకు తెలిసిన చలసాని గురించి క్రిష్ణక్కకు....

**అరుణ**

ప్రియమైన కృష్ణక్కా, రెడ్ శాల్యూట్స్

మీ క్షేమాన్ని కోరుతూ.... నేను (మేము) క్షేమం

అక్కా! మీరు ఏ స్థితిలో ఉన్నారో ఊహించుకుంటేనే చాలా బాధగా ఉందక్కా! మనం ఎవ్వరం కూడా ఊహించని ఈ విషాద ఘటన. ఇటువంటి సందర్భంలో మీకు ఉత్తరం రాయాల్సి రావటం నా కన్నీటి అక్షరాలకు ఒక పరీక్షే. కామ్రేడ్ చలసానిగారు మనకు ఇకలేరు, ఇక రారు అని అనటానికే మనస్సు అంగీకరించటం లేదు. ఈ విషయం రాయడానికి పెన్ను కూడా మొరాయిస్తోంది. ఆయన మనకు కనిపించకుండా... ఎన్నడూ అలసట అనేది ఎరుగని వారు ఆసుపత్రికి వెళ్లి... గాఢమైన నిద్రలోకి వెళ్ళిపోయారు. సుదీర్ఘ రెస్టు కావాలంటున్నారు. ఏమిటీ? చలసాని గారేనా? ఇలా అంటున్నది. అసలు నాకు నమ్మబుద్ధి కావటం లేదు. ఆ పెద్దాయన శాశ్వత నిద్రలో కెళ్ళి పదిహేను రోజులయ్యి 9 ఆగస్టు 2015న ఆంధ్రా యూనివర్సిటీ, విశాఖలో సంస్మరణ సభ జరుపుతున్నా... ఏ.ఓ.బీ జోన్‌లో విశాఖ, తూర్పు గోదావరి జిల్లాల్లో మన్యం కొండల్లో అమర వీరుల 43వ సంస్మరణ వారోత్సవ సభల్లో "విప్లవ మేధావి, విరసం వ్యవస్థాపక కార్యవర్గ సభ్యుడు చలసాని ప్రసాద్ అమర్‌హై! అమర వీరుల ఆశయాలను కొనసాగిద్దాం! కామ్రేడ్ చారుమజుందార్, కామ్రేడ్ కన్హయ్ చటర్జీ అమర్‌హై, అమరవీరుల వారోత్సవ సభలను గ్రామ - గ్రామాన జరుపుకుందాం!" అని... చలసాని ప్రసాద్ సుదీర్ఘ పోరాటం ప్రజాస్వామిక విప్లవ విజయవంతానికి తోడ్పడుతుందని అమరవీరులకు నివాళులర్పించారు. ఆ సభల్లో అమరుల త్యాగాలను కొనియాడుతూ అమరులందరికీ పేరు పేరున జోహార్లు అర్పించారు. ఆ నినాదాల హోరు ఏ.ఓ.బి. కొండ కోనల్లో మార్మోగుతున్నా... ఆ నిజాన్ని ఇంకా జీర్ణించుకోలేకపోతున్నాను.

అక్కా!

వాస్తవానికి 'జూలై 28' అమర వీరుల సంస్మరణ వారోత్సవాలు దగ్గర పడుతున్న వంటేనే ఎందరో అమరులు... వాళ్ల జ్ఞాపకాలు మా కళ్ళ ముందే కదలాడుతుంటయ్. అలా ఆ రోజు అమరుల జ్ఞాపకాలను నెమరేసుకుంటూ... కొయ్యూరు అమరుల పాట "తూరుపు కొండల్లో మీరూ... తొలిపొద్దై పొడిసిన ఎర్రని సూర్యుళ్ళు"

తూరుపు కొండల్లో మీరూ...

శ్యామన్నా... మహేషన్నా... మురళన్నా... మా లాల్ సలామ్..."

అని లోలోపలే పాడుకుంటూ ఈ పాటే నేనెందుకు పాడుకుంటుంటానంటే ఈ పాట 2000 జనవరిలో రాసినప్పుడు ఆ పాట బాణీ చాలా పెద్ద నిడివి కలిగి పల్లవి మూడు రకాలుగా, చరణం నాలుగు స్టెప్పులుగా వెళ్ళి, దిగి పల్లవిలో కలుస్తుంది. స్లో... సారో ఫుల్ క్రిస్టియన్ బాణీ పాట రాసేటప్పుడు బాణీ కోసం 'అసలు' రాగాన్ని చాలా సార్లు పాడుకునే వాళ్ళం. అప్పుడు అమరుడు కృష్ణన్న ఉండి "మీ జెఎన్ఎం వాళ్ళు ఏంటీ? ప్రార్థన పాటను వదలడం లేదు, ప్రార్థనలు జరుపుకుంటున్నారా?" అని ఆ పాట బాణీని ప్రాక్టీసు చేస్తున్నప్పుడల్లా మేము కంటపడితే అంటుండే వాడు. రెండు రోజుల్లో ఆ పాటను పూర్తి చేసి సరి చేయటం కోసం సీనియర్ జెఎన్ఎం కామ్రేడ్ దగ్గరకు వెళ్ళి పాడి వినిపిస్తుంటే ఆ కామ్రేడ్ డప్పు కొట్టి పాట ఎత్తుళ్ళూ, దింపుళ్ళూ ఇచ్చిన సలహాలతో పెద్ద మార్పులు ఏమీ చేయకుండానే ఆ పాటను పాడాము. ఎక్కడో మీటింగులో కూర్చుని విన్న రాష్ట్ర కమిటీ కామ్రేడ్స్ "మా మీటింగు ఒక్కసారి ఆగిపోయేలా చేశారు. కొత్త పాట రాశారా? ప్రాక్టీసు చేస్తున్నారు. అందరం కాసేపు మీటింగు ఆపి మీ పాటనే విన్నాం. బాగుంది" అది అందరికంటే ముందు మా దగ్గరకు వచ్చి కామ్రేడ్ కృష్ణన్ననే చెప్పాడు. ఆ రోజు నుండి ఆ రాగాన్ని ప్రతి వేకువనే అందరి కంటే ముందు నిద్రలేసే కృష్ణన్న ఈల పాటలో ఆ కొత్త పాట "కొయ్యూరు కొండల్లో మీరూ... తూరుపు కొండల్లో మీరూ..." అని మా అందర్నీ అలర్ట్ చేసేవాడు. మేము కలిసి ఉన్నన్ని రోజులూ ఆ క్యాంపులో ఆ ఈల పాటే మా అందరికీ తొలి ఉషోదయమయ్యేది. కా.శ్యామన్న, కా. మహేశన్న, కా. మురళన్నలకు చాలా సన్నిహితంగా ఉన్న పరిచయస్తులు రాష్ట్ర కమిటీ, కేంద్ర కమిటీ కామ్రేడ్స్ ఆ పాటను చాలా ఇష్టంగా మా టీమ్‌తో పాడించుకునేవారు. ఆ సమయంలో వాళ్ళ అమరత్వం అనేది భారత విప్లవోద్యమానికి పూడ్చుకోలేనటువంటి లోటు. ప్రజాయుద్ధ జనరల్స్ అయిన వారు... మా ఉద్యమ ఊపిరులైనవారు... భౌతికంగా మాకు దూరమైనా నిత్య ఉషోదయంలో ఎర్రని సూర్యుళ్ళై మావెంటే ఉన్నారు. అందుకే ఆ బాణీ ఏంటీ అనే దానికన్నా ఆ 'వస్తువు'కు ఉన్న ప్రాధాన్యత రీత్యా. ఆ విషయంతో పాటు కొంత శిల్పం కూడా తోడై ఆ రోజు ఆ పాట ఎప్పటికీ మా పెదవులపై ఆడుతూనే ఉంటుంది. ఆ పాట పాడుకుంటున్నప్పుడల్లా కొయ్యూరు అమరులతో పాటు మా అందరి మనస్సుల డాక్టర్ (కామ్రేడ్ షహీదా అన్నట్లు) మా కృష్ణన్న వచ్చి పలుకరించవలసిందే.

అలా అమరుల జ్ఞాపకాలతో మధ్యాహ్నం ఒంటి గంటకు నిద్రలోకి జారుకున్నాను. కళ్ళకు నల్లని జోడు పెట్టుకుని బక్క పలుచని 22 సంవత్సరాల యువ గెరిల్లా కామ్రేడ్ "ఏమి చేస్తున్నావమ్మా... ఈ రోజు ఉదయం 6 గంటలకే సెంట్రీ కెళ్ళి వచ్చాను. సెంట్రీకి రావాల్సిన వారు కొంచెం లేటుగా వచ్చారు. మేము ఆ పెద్ద కొండ దిగి వచ్చేసరికి ఆలస్యమయ్యింది. అన్నం

కూడా సెంట్రీలకు మిగలలేదు. మళ్ళీ వండే సరికి టైమ్ పట్టింది. తిని వచ్చే సరికి ఈ సమయం అయ్యింది. నిన్నటి నుండి నీ దగ్గరకు రాలేదు కదా! దారిలోనే కదా మీ టెంటు.. పలుకరిద్దామని కిచెన్ నుండి ఇటే నీ దగ్గరకు వచ్చాను" అని నవ్వుతూ నా కళ్ళ ముందు ప్రత్యక్షమయ్యాడు. ఆ కామ్రేడ్ ఎవరో కాదు కామ్రేడ్ సోను (సూర్యం). ఎక్కడో ప్రకాశం జిల్లా కొరిశపాడులో పుట్టి చిన్న వయస్సులోనే ఉద్యమాల్లోకి వచ్చి ప్రజా సంఘాల్లో నాలుగు సంవత్సరాలు పని చేసి మార్క్సిస్టు అవగాహనను పెంచుకున్నాడు. బయట ఉండి అడవి ఉద్యమాన్ని చదివి పరోక్ష అనుభూతిని పొందడం కాదు. నిజంగా స్వయంగా ఆ ఉద్యమంలో... ప్రజా యుద్ధంలో పాల్గొనాలని ఎప్పటి నుండో కంటున్న కలలను తను నిజం చేసుకోవటానికి గత సంవత్సరం జూన్ 20న ఏఓబి కొండల్లో అడుగుపెట్టి పార్టీని, ప్రజలను కలిశాడు.

ఆ కామ్రేడ్ మైదాన ప్రాంత ఉద్యమాన్ని వదిలి అడవి ఉద్యమంలో భాగం కావాలని మేము ఉన్న ఒక గెరిల్లా క్యాంపులోకి వచ్చాడు. రాగానే గల గలా మాట్లాడుతూ పాత పరిచయస్తుడు వలే "నాకు ఒక మంచి పేరు పెట్టండి, అది టక్కున అందరూ పిలుచుకునేదిగా, ఆదివాసీల పేరై ఉండాలి" అని సింపుల్‌గా ఉండే పేరు 'సోను' అని చెప్పగానే కామ్రేడ్ సోనుగా అందరికీ పరిచయమయ్యాడు. చదువుకున్నవాడు అవ్వటం వలన పుస్తకాలు స్పీడుగా చదవటంతో పాటు వచ్చిన డౌట్స్‌ను, అర్థం కాని విషయాలను నాయకత్వం దగ్గరకు వెళ్ళి క్లియర్ చేసుకునేవాడు. తెలిసిన తోటి కామ్రేడ్స్‌ను అడిగి తెలుసుకునే వాడు. చాలా త్వరగా ఆదివాసీ 'కువ్వీ' కామ్రేడ్స్‌తో కలిసిపోయి అందరి అభిమానాన్నీ చూరగొన్నాడు.

అడవి జీవితం తెలియని కామ్రేడ్ సోను గెరిల్లా సైనిక జీవితానికి తగినట్లుగా తనను తాను మలుచుకున్నాడు. ఆ బక్క పలుచని శరీరంతో రాత్రింబవళ్ళు, గంటల తరబడి ఎక్కినా తరగని ఏఓబి పెద్ద పెద్ద కొండలెక్కాడు. ఆ కామ్రేడ్ పరిచయమైన నుండి కలిసిన ప్రతిసారీ ఉన్నన్ని రోజులూ ఎన్నో మంచి అనుభూతులనూ, అనుభవాలను, రాజకీయ పరమైన విషయాలను కలబోసుకున్నాం. అన్ని పనుల్లో పోటీపడి కష్టపడుతూ సమిష్టితత్వం కల్గిన ఆదర్శవంతమైన కామ్రేడ్. అలా ఆ కామ్రేడ్‌తో మాట్లాడుతూ ఉంటే... ఓయ్! కామ్రేడ్‌లే... 'అరుణాలే... విన్నావా? "చలసాని ప్రసాద్" గారు అని ఒక స్వరం వచ్చి నన్ను లేపబోతుంది. ఉలిక్కిపడి లేశాను. "అరే! నాకల భంగమయ్యిందే?" "ఏంటి? ఏమయ్యింది కామ్రేడ్". మళ్ళీ అదే మాట "చలసాని ప్రసాద్‌గారు లేరట" నమ్మలేదు నేను.

కృష్ణక్కా!

కామ్రేడ్ చలసానిగారి పేరు వినబడగానే ఒక్క దశాబ్ద కాలం వెనక్కు వెళ్ళాను. ఆయన జ్ఞాపకాలు కళ్ళ ముందు మెదిలాయి. జ్ఞాత, అజ్ఞాతాల మధ్య దూరం ఉన్నప్పటికీ అదే చివరి కలయిక అవుతుందని ఊహించలేదు. ఆ రోజు విశాఖలో విరసం సాహిత్య పాఠశాల (2005 జనవరి 5, 6 తేదీల్లో) మొదటి రోజు ఉదయం 8 గంటలకు జెండా ఆవిష్కరణ ప్రోగ్రాంలో మొట్ట మొదటి పాట "ఎత్తినాం విరసం జెండా... అలలలలుగా వరదలెత్తు... పోరు పోరు జెండా ఎత్తినాం విరసం జెండా" - అని చలసానిగారు పిడికిలెత్తి ఆ జెండా వైపే చూస్తూ పాట పాడుతుంటే... తన చుట్టూ గోసి, గొంగడి వేసుకున్న సాంస్కృతిక కళాకారులమంతా కోరస్ అందుకున్నాము.

అలా మొదలైన సాహిత్య పాఠశాల రెండవ రోజుకు చేరుకుంది.

అక్కా! మీకూ గుర్తుండే ఉంటుంది. ఆ రోజు అన్ని ఏర్పాట్లు సరిగ్గా అమలు జరుగుతున్నవా? లేదా ఏమైనా ఎక్కడైనా ఇబ్బందులు, అసౌకర్యాలు ఉన్నవా అని అన్ని పనులు మొదటి నుండి చలసానిగారే చూసుకుంటున్నారు. మధ్య మధ్యలో "ప్రసాదు" వాళ్ళకు డబ్బులివ్వాలి" అని కొన్ని పనులకు సహకరిస్తూ... గుర్తు చేస్తూ మీరూ నల్లని క్యాష్ బ్యాగు పట్టుకొని హడావుడిగా తీరిక లేకుండా అటూ ఇటూ తిరుగుతూ ఖాళీ సమయంలో అన్ని పనులు చూసుకుంటూ చలసానిగారు. మధ్యాహ్నం భోజన విరామానికి ముందు అప్పటి చర్చల (2004 అక్టోబర్) సందర్భంలో మావోయిస్టు పార్టీ తరఫున ప్రతినిధులుగా ఉన్నటువంటి వివి సారు, జి.కల్యాణరావుగార్లకు ఫోన్‌లో ఎవరో ఇస్తున్న సమాచారం అది. కాల్పుల విరమణ సూత్రాన్ని ఉల్లంఘిస్తూ అప్పటి హోం మంత్రి జానారెడ్డి, డి.జి.పి. స్వర్ణజిత్‌సేన్, ముఖ్యమంత్రి వై.ఎస్.ఆర్. ఈ నరహంతక 'త్రయం' తీసుకున్న నిర్ణయం ప్రకారం, డిజిపి ఆదేశానుసారం గ్రేహౌండ్స్ మూకలు 'నల్లమల' అడవుల్లో విస్తృత కూంబింగ్స్ చేపట్టాయి. ప్రకాశం జిల్లా, దోర్నాల మండలం చింతలకు సమీపంలో ఉన్న చిన్న శ్యామ (చెంచుగూడెం) దగ్గర తెల్లవారు జామున బోరింగు దగ్గరకు నీళ్ళ కోసం వచ్చిన గెరిల్లా దళ సభ్యులపై మాటు కాసి ఆకస్మికంగా జరిపిన కాల్పుల్లో ఒక మహిళా కామ్రేడ్‌తో సహా ముగ్గురు అమరులయ్యారనీ, మరొక సంఘటన మహబూబ్‌నగర్ జిల్లా, కొల్లాపూర్ మండలం మద్దిమడుగు (నల్గొండ జిల్లా బార్డర్) దగ్గర జరిగిన కాల్పుల్లో మరో ఇద్దరు కామ్రేడ్స్ అమరులయ్యారనే వార్తలు సాహిత్య వేదికను చేరుకున్నవి. హాలు హాలంతా ఒక్కసారి ఎన్‌కౌంటర్స్ సమాచారంతో ఉడికిపోయింది. ఒక్క అర్ధగంటలో మరిన్ని వివరాల కోసం చలసానిగారు ఎక్కడెక్కడికో వెళ్ళి రావటం, టివిల్లో కూడా ఆ వార్తలు చూపిస్తున్నారనీ, స్క్రోలు వస్తుందని చెప్పారు. అప్పటికే విషాధ ఛాయలు అలుముకున్న సాహిత్య పాఠశాల. వి.వి.సారు వేదిక పైకి వచ్చి ఆ రెండు ఎన్‌కౌంటర్స్ గురించిన సమాచారం అందిన మేరకు హాలులో ప్రకటించారు. వెంటనే ఆ అమరులకు నివాళులర్పించేందుకు 'సంస్మరణ' సభ ఏర్పాటు చేయటం జరిగింది.

నల్లమల ఉద్యమంతో, అక్కడ పని చేస్తున్న కామ్రేడ్స్‌తో దగ్గరి అనుబంధం ఉన్న మాకు పొంగుతున్న దుఃఖాన్ని ఆపుకోవటం చాలా కష్టమైపోయింది. ఆ సమయంలో కామ్రేడ్ చలసానిగారు ఓపిగ్గా ఎన్‌కౌంటర్స్ సమాచారం తెలుసుకునేందుకు మూడు నాలుగు సార్లు తన బండి మీదే విసుగు, విరామం అనేది లేకుండా ఆ వయస్సులో నవ యువకుడిలా ఆ రోజు తిరిగారు. నాకు చాలా

ఆశ్చర్యమనిపించింది. "ఏంటీ? ఈ పెద్దమనిషికి ఇంత ఓపిక ఎక్కడి నుండి వచ్చిందీ" అని. ఆనాడే కాదు ఏనాడైనా ఒక కమ్యూనిస్టుగా ఆయన ఈనాటి వరకు కూడా అదే పట్టుదల, అదే 'బోల్షివిక్ స్పిరిట్. అదే నవ్వు అప్పటికీ ఇప్పటికీ చెరగనిది. ఆ సాహిత్య పాఠశాలలో చూసినదే పిడికిలెత్తి పాడిన పాట "అలలలలుగా వరదలెత్తు పోరు పోరు జెండా... ఎత్తినాం... విరసం జెండా" అని చలసాని ప్రసాదుగారు పాడిన పాట నేను విన్నది... అదే ఆఖరి సారి... ఆ దృశ్యమాలికే ఇప్పటికీ నా కళ్ళ ముందు సుడులు తిరుగుతుంది.

విరసం జెండా పాట పాడటం కేవలం చలసానిగారికే ఒక 'పేటెంట్' (అనిపించేంతలా)లా ఉండేది. విరసం సంస్థ అభివృద్ధి కోసం నిరంతరం పరితపించిన వ్యవస్థాపకులుగా నిజంగా అంతటి అర్హత అనేది తనకు తానుగా వెతుక్కుంటూ తన వద్దకు వచ్చిందనే తప్పక చెప్పాలి. ఆ పాటతో ఆయన బంధం మేము పుట్టక మునుపు పురుడు పోసుకున్న 1970ల నాటిది కావచ్చునేమో. అది 1987ల నాటిది కావచ్చు. (17వ విరసం రాష్ట్ర మహాసభలు హైదరాబాద్‌లో జరిపిన సందర్భం కావచ్చు) 90ల నాటిది కావచ్చు (విరసం 20వ రాష్ట్ర మహాసభల సందర్భంగా పాడినది కావచ్చు) ఎక్కడ, ఎప్పుడు విరసం మహాసభలు జరిపినా సాహిత్య పాఠశాలలు జరిపినా చలసానిగారు జెండావిష్కరణలో ఆ పాట పాడవలసిందే. నాకు గుర్తెరిగి 87లో జరిగిన విరసం సభలప్పటి నుండి జెండా దగ్గర పాడటం చూశాను. కాని అప్పటికి ఆయన పేరు కూడా తెలియదు. విరసం 20వ రాష్ట్ర మహాసభల సందర్భంగా మళ్ళీ ఆ పెద్దాయనను జెండా దగ్గరే పాట పాడుతుండగా చూశాను. ఆ వేలాది మంది జన సంద్రపు హోరులో జెండా దగ్గరకు చేరుకోవటమే కష్టమైపోయింది. అప్పటికి నేను జెఎన్ఎం టీమ్ సభ్యురాలుగా ఆ టీమ్‌లో ఉన్నాను. ప్రోగ్రాంలో పాటలు పాడే పనిలో మేమంతా మునిగిపోయాం. అప్పటికి ఎప్పుడూ పాడే ఆయన పేరు 'చలసాని ప్రసాద్' అని వినటమే కాని పరిచయం లేదు.

ఆ రోజు విశాఖ విద్యార్థులు "రచయితలారా! మీరెటువైపు" అని సంధించిన ప్రశ్న 1970ల దశకంలో నక్సల్బరీ పోరాట వెలుగులో, శ్రీకాకుళ అమరుల స్ఫూర్తితో విప్లవ పక్షాన నిలబడిన విద్యార్థులు రచయితలకు సూటిగా విసిరిన ప్రశ్న... ఫలితంగా శ్రీశ్రీ మొదలు కొందరు ఆ కష్ట కాలంలో విరసం నిర్మాణానికి పునాదులు వేశారు. పునాదులు వేసిన సన్నాహకాల మొదలు అభివృద్ధి వరకు వ్యవస్థాపకుల్లో ఒకరుగా అప్పుడు స్వంతం చేసుకుని గుండెకద్దుకొని ఎత్తిపట్టిన విరసం జెండాను కడవరకు నిలబెట్టారు కామ్రేడ్ చలసానిగారు. జూలై 25 శనివారం విరసం ఆవిర్భావ సభల పనుల్లో మునిగిపోయి ఆ ఉదయం తుదిశ్వాస విడిచే వరకు విరసం వెన్నంటి ఉన్న కార్యోన్ముఖుడు. విరసం వేసిన ప్రతి అడుగులోనూ తొలి అడుగై నడచినవాడు. నాలుగున్నర దశాబ్దాలుగా సాహిత్య... సాంస్కృతిక రంగ సేద్యంలో నారు పోసి, నీరు పోసి ప్రాణంగా చూసుకున్నవాడు. సంస్థ అభివృద్ధిలో, అది సాధించిన అనేక విజయాల్లో మైలురాయి అయినవాడు. అలాగే సంస్థల్లో వచ్చిన అనేక ఒడిదుడుకుల్లో, అది ఎదుర్కొన్న ఆటు-పోట్లను ఎదురీదినవాడు. అందుకే ఆనాడు తన గుండెకద్దుకొని భుజానికెత్తుకున్న విరసం జెండాను తుది రోజున కూడా గుండెకద్దుకునే పడుకున్నారు. అలుపెరుగని ఆ కమ్యూనిస్టు యోధుడు చలసానిగారు నిద్రలో కూడా. బిగిపిడికిలెత్తి ఆ జెండా పాటనే అలసిపోయే వరకూ పాడుతూనే ఉన్నారు. అలా ఆయన డెబ్బైయవ దశకం నుండి విరసంలో ఎన్నోమార్లు కార్యదర్శి, అధ్యక్ష బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు. విరసం సాహిత్య-సాంస్కృతిక మాసపత్రికగా ముప్పై ఎనిమిది ఏళ్ళుగా వస్తున్న 'అరుణతార' పత్రికకు కూడా సంపాదకులుగా తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూ అహర్నిశలు శ్రమించిన వాడు జూలై 'అరుణతార' పత్రికలో తానే ఒక 'అరుణతార'యై నిండుగా పరుచుకుని చూస్తూ, మనందరినీ పలుకరిస్తున్నాడు.

అక్కా!

'పేదోడి గొంతు మూగబోయింది' అని 26 జూలై ఆదివారం ఆంధ్రజ్యోతి విశాఖ సిటీ ఎడిషన్‌లో చలసాని గారి గురించి రాస్తూ "విశాఖలో జన నాట్య మండలికి ప్రోత్సాహం... విశాఖలో జననాట్య మండలిని ఆయన వెన్నంటి నడిపించారు" అని రాశారు. జననాట్య మండలి గురించి చూడగానే ప్రాముఖ్యతను సంతరించు కున్నటువంటి ఒక సందర్భం గుర్తుకు వచ్చింది. అదేమిటంటే చలసానిగారు పరిచయం అయ్యింది జననాట్య మండలి ద్వారానే. అప్పుడు నేను జననాట్యమండలి సభ్యురాలునే. స్టేట్ జెఎన్ఎం టీమ్‌తో పాటు మా టీమ్ అంటే గుంటూరు జిల్లా జెఎన్ఎం (నక్సల్బరి బిడ్డలం ఒగ్గు కథ టీమ్, కుమారక్క టీమ్) టీమ్ కూడా రాష్ట్ర వ్యాప్తంగా జరుగుతున్న బహిరంగ సభలకు, ప్రత్యేకంగా ఏర్పాటు చేసినటువంటి అమరవీరుల జ్ఞాపకార్థం ప్రజలు నిర్మించుకున్నటు వంటి స్థూపాల ఆవిష్కరణ సభలకు సాంస్కృతిక ప్రోగ్రామ్స్ ఇవ్వటంలో భాగంగా 'గద్దరన్న' ప్రోగ్రాం కొన్ని చోట్ల జరపాలని నిర్ణయించడమైనది. అందులో భాగంగా మా జెఎన్ఎం ప్రోగ్రాం గుంటూరు జిల్లా పార్టీ ఏర్పాటు చేసిన కామ్రేడ్ 'బిక్కి రాములు' స్థూపావిష్కరణ సభ వినుకొండ పట్టణంలో పూర్తి చేసుకొని నేరుగా విశాఖకే రావటం జరిగింది. ఉత్తరాంధ్రలో విశాఖ, తూర్పు గోదావరి జిల్లాల్లో పీపుల్స్‌వార్ పార్టీ నిర్ణయించిన బహిరంగ సభలు, స్థూపావిష్కరణ సభలు జరపాలని రూపొందించటం జరిగింది. ఆ సభలకు జననాట్య మండలి సాంస్కృతిక ప్రోగ్రామ్స్‌తో పాటు ఉపన్యాసకులుగా చలసానిగారు, మీరు మా టీమ్‌తోనే వచ్చారు. వారం రోజుల పాటు జరిగే ఆ సభల్లో మొదటి బహిరంగ సభ పాడేరు టౌన్‌లో. ఆ రోజు సాయంత్రం కుండపోత వర్షం. పాడేరుకు చుట్టు పక్కల గ్రామాల నుండి వచ్చిన వేలాది మంది ఆదివాసీ ప్రజలు ఆ సభకు హాజరయ్యారు. అంత వర్షంలో కూడా గంటల తరబడి గొడుగు లేసుకొని నించునే ఉన్నారు. ఎవ్వరూ వెళ్ళిపోలేదు.

ఆ రాత్రిపూట లైటింగ్‌లో మొత్తం గొడుగులు తళతళ మెరిసిపోతున్నవి. నల్లని మేఘమే వచ్చి సభాస్థలంలో పరుచు కున్నట్లుగా ఉన్నవి ఆ గొడుగులు. మా జెఎన్ఎం టీమ్ కూడా

వర్షంలో తడిసి ముద్దయిన ప్రజల్ని చూసి మరింత ఉత్సాహంగా వర్షాన్ని, చలిని లెక్క చేయకుండా ప్రోగ్రాంని విజయవంతం చేసుకోగలిగాం. ఆ విజయంలో సాంస్కృతిక కార్యక్రమాలతో పాటు ఉపన్యాసకుల పాత్ర ఎక్కువగానే ఉన్నది. మీరూ, చలసాని గారు చాలా బాగా మాట్లాడారు. ఇక్కడి ప్రజలకు అర్థమయ్యే విధంగా అప్పటి పాలకవర్గ అధికార పార్టీ అయిన ఎన్‌టిఆర్ తెలుగుదేశం ప్రభుత్వ 'మేక వన్నె పులి' స్వభావాన్ని చలసానిగారు తన ఉపన్యాసంలో ఎండగట్టారు. అప్పుడూ నాకు ఆ పెద్దాయనను చూసి మళ్ళీ అవే ప్రశ్నలు... అదే ఆశ్చర్యం, "ఏంటబ్బా ఈ పెద్ద మనిషి వణకడు, ఏం కాడు. కుర్రోల్లే ఈ వర్షంకు తట్టుకోలేక పోతున్నారు". కాని ఈయన ఎలా ఉండగల్గుతున్నారనే"ది అర్థం కాలేదు. ఆయనలో ఉన్న ఆ గొప్పశక్తి ఎక్కడిది అనేది మా అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేసింది.

పాడేరులో జరిగిన సభ తర్వాత ఏజెన్సీ ప్రాంతానికి మా ప్రయాణం మొదలయ్యింది. మన్యం 'పితూరి' గురించి పుస్తకాల్లో చదవటం, 'అల్లూరి సీతారామరాజు' సినిమాలో చూడటం తప్ప ఇంత పెద్ద అడవిని, ఇంత పెద్ద కొండలను చూడటం ఇదే మొదటి సారి నాకు. బ్రిటిష్ వాళ్ళను ముప్పతిప్పలు పెట్టించి ఇక్కడ ఉన్న ఆదివాసీ ప్రజలతో 'మన్యం పితూరి' నడిపించిన ఆ ఏజెన్సీ ప్రాంతంలో తిరిగి జెఎన్‌ఎం ప్రోగ్రామ్స్ ఇచ్చే ఒక మంచి అవకాశం మాకు లభించిందనే చెప్పాలి. అటువంటి చరిత్రాత్మకమైన, ప్రాముఖ్యత కల్గిన గ్రామాలు చింతపల్లి, అడ్డతీగల, రంప చోడవరం ఇంకా మరికొన్ని గ్రామాల్లో అమరవీరులు కామ్రేడ్స్ కొంగంటి సోమన్న, మద్దిల స్వర్ణక్క, లోకల్ కామ్రేడ్స్ గోపాల్ పట్నాయక్, చంటన్న, శివరావ్‌లతో పాటు కామ్రేడ్ హరి అలా మరెంతోమంది అమరుల జ్ఞాపకార్థంగా ప్రజలు నిర్మించుకున్న స్థూపాల ఆవిష్కరణ సభలు. ఆ సభలకు ఏ సభను చూసినా చీమల దండులా వేలాది మంది ప్రజలు కదిలి వచ్చారు.

మా జననాట్యమండలి టీమ్‌తో పాటు కలిసి ప్రయాణం చేయడం, అవే సభల్లో ఉపన్యాసకులుగా చలసానిగారు పాల్గొన్నారు. ఆదివాసీల హక్కులు ఎలా కాలరాయబడుతున్నవో... శ్రీకాకుళ పోరాటంలో కోరన్న, మంగన్నలు మొదలు వెంపటాపు సత్యం, కైలాసం, పంచాది కృష్ణమూర్తి, నిర్మల... అనేక మంది అమరుల త్యాగాలను కొనియాడుతూ ఎంతో మంది అమరుల కుటుంబాల వాళ్ళను స్థూపాల ఆవిష్కరణ సభల్లో ఓదార్చారు. నాకు ఇప్పటికి గుర్తు కొంగంటి సోమన్న, స్వర్ణక్క స్థూపావిష్కరణ సభకు చంటన్న భార్య ముగ్గురు పిల్లలను తీసుకొని (పోలియో కాళ్ళ వికలాంగురాలు) స్టేజీ మీదకు వచ్చి బోరున విలపిస్తూ పడిపోయింది. మేము ఆమెను పట్టుకున్నాము. చలసానిగారు ఆమెను అక్కున చేర్చుకుని ఓదార్చారు. చలసానిగారితో ఆ వారం రోజులు కలిసి తిరిగిన జ్ఞాపకాలు చెరిగిపోవు. అప్పుడు దొరికిన ఆ అరుదైన అవకాశం తిరిగి 2005 జనవరి విరసం సాహిత్య పాఠశాల (విశాఖలో)లో రెండు రోజులు తప్ప, ఇన్ని ఏళ్ళుగా మళ్ళీ రాలేదు. ఆ అవకాశాన్ని మనకు ఇవ్వకుండా వెళ్ళిపోయారు. కానీ చలసానిగారు భౌతికంగా మన ముందు లేకపోవచ్చునేమో కాని ఆయన మనలో చిరస్థాయిగా నిలిపిన ఎన్నో జ్ఞాపకాలు, ఆదర్శాలు ఎక్కడికి పోగలవు? అవి ఎప్పటికి పోవు.

అక్కా! వ్యక్తిగా నేను నా పరిచయాన్ని రాస్తున్నానంటే ఆ పెద్దాయనను కలిసింది మా జననాట్య మండలి సంస్థగానే, సభ్యురాలుగానే. అప్పుడు కలిసి ఉన్న ఎందరో కళాకారులు, కవులు, పాణిగ్రాహి, తామాడ చినబాబు మొదలు మాలాంటి కళాకారులను తయారు చేసినవాళ్ళు, ఆటపాట నేర్పినవాళ్ళు, స్ఫూర్తిదాయకమైన వాళ్ళు ఉన్నారు. వాళ్ళలో అమరులు కామ్రేడ్స్ ఏసన్న (రాజన్న), దివాకరన్న, కుమారక్క, పద్మక్క జెఎన్‌ఎం భాస్కర్, ఏఓబి జెఎన్‌ఎం అమరులు సత్యవతి, విజయ, శ్రీధర్ (మాధవ్)ల వరకు జెఎన్‌ఎం అమరుల త్యాగాలు కళ్ళముందే ఉన్నవి. వాళ్ళ జ్ఞాపకాలు మా వెన్నెంటే ఉన్నవి.

ముఖ్యంగా 2001లో జరిగిన ఆంధ్రరాష్ట్ర పీపుల్స్‌వార్ పార్టీ కాన్ఫరెన్స్ తర్వాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నుండి ఏఓబి జోన్ వేరుపడి అది ఒక గెరిల్లా జోన్‌గా ఏర్పడిన తర్వాత జెఎన్‌ఎం కళాకారులను కూడా నల్లమల నుండి కొంత మందిని ఏఓబికి పంపారు. ఇక్కడి సాంస్కృతికోద్యమాన్ని అభివృద్ధి చేయడం, అలా చేసిన వారిలో కొందరు చివరి వరకు పార్టీని, ప్రజా కళలను అంటిపెట్టుకొని ఉండలేక పోయినా... కొంత మంది జెఎన్‌ఎం కామ్రేడ్స్, అమరుడు కామ్రేడ్ మాధవ్ లాంటి కళాకారులు ప్రజల బతుకులను, అమరుల త్యాగాలను పలు భాషలు (కువ్వి, ఒడియా) నేర్చుకొని పట్టు సాధించి వందల పాటలుగా మలిచి ప్రజల్లోకి తీసుకెళ్ళారు. ఆ పాటలను ఆడియోల రూపంలో తీసుకురావడానికి అడవిలో ఉన్న పరిమితమైన అవకాశాలను వినియోగించుకుంటూనే 2004 చర్చల సమయంలో బయట ఉన్న సాంకేతిక పరిజ్ఞానాన్ని కూడా ఉపయోగించుకున్నారు. ఒకటి, రెండు సిటీల్లో జెఎన్‌ఎం కళాకారులు బయటకు వచ్చి పాటలు తెలుగుకు ద్విభాషల్లో ఆడియో రికార్డింగ్ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించుకున్నారు. ఆ సాంస్కృతిక కృషి వెనుక, మా జెఎన్‌ఎం కళాకారులకు, సంస్థకు చలసానిగారు విశాఖ సిటీలో పని చేసే కార్యకర్తలకు, ఆర్గనైజర్లకు, మిగతా తెలిసిన వాళ్ళందరికీ తన అభిమానాన్ని పంచి ఇచ్చారు. తన ఇంటిలో ఎన్ని రోజులైనా ఆశ్రయాన్ని కల్పించారు. పరోక్షంగా మా సాంస్కృతిక కృషిలో భాగమయ్యారు. తరగని గనిలా సంపాదించుకున్న మార్క్సిస్టు సాహిత్యాన్ని తన గ్రంథాలయం నుండి అందించారు. మా సాంస్కృతిక ఉద్యమానికి విలువైన అనుభవాలను, సలహాలను పంచిపెట్టారు. ఇంకా తన కుటుంబం నుండి తన వారసుల్ని సాంస్కృతికోద్యమంలో ఒక కళాకారిణిగా తన అభిరుచికి తగినట్లుగా ప్రోత్సహించి, సాంస్కృతిక యోధురాలుగా చేసి అందించారు.

ఇక కుటుంబం విషయానికి వస్తే తెలంగాణ సాయుధ పోరాటంలో తమ ప్రాణాలొడ్డిన ముగ్గురు వీరుల (తన సోదరుడుతో సహా) అమరుల జ్ఞాపకాలతో... కమ్యూనిస్టు కుటుంబంలో పుట్టిన చలసానిగారు ఉగ్గుపాలతోనే వర్గ పోరాట కథలను విన్నాడు. ఆ

తదుపరి భారతదేశంలోనే ఒక విప్లవ గర్జన అయిన నక్సల్బరీ వసంత మేఘ గర్జన పవనాలు అటు తూర్పు నుండి ఇటు ఉత్తరం వరకు వీచి, అక్కడి నిప్పు రవ్వే దావానలమై రాజుకొని దేశ నలుమూలలా వ్యాపించింది. నక్సల్బరీ, శ్రీకాకుళ వీరుల గాథలను ఎన్నో చదివాడు. కమ్యూనిస్టుల వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న చలసాని భారతదేశంలో మావోయిస్టు పార్టీ నాయకత్వంలో జరుగుతున్న ప్రజాయుద్ధానికి, ఒక నూతన ప్రజాస్వామిక విజయానికై వివి సారు అన్నట్లు ఒక నూతన మానవావిష్కరణకు తన రక్తమాంసాలను పంచి ఇచ్చాడు.

మార్క్సిస్టు అవగాహనను పెంచుకున్న చలసానిగారు దాని ఆచరణను చివరి వరకు కొనసాగించారు. విరసంలో ఒక వ్యవస్థాపక నాయకులుగా విప్లవ రచనలు చేసిన వ్యక్తి కృషికి ప్రాధాన్యతను ఇవ్వలేదు. రచనలు అంటే దాని వెన్నంటే ఉన్న తన ఆచరణను చూసుకున్నప్పుడు ఈ సందర్భంగా ఒక 'కొటేషన్' నాకు గుర్తుకు వస్తుంది. అది సాహిత్య సాంస్కృతికోద్యమ కృషిలో భాగంగా 1997లో జననాట్యమండలి రాష్ట్ర వర్క్ షాపు వేసవి కాలంలో జరిగింది. అది ముఖ్యంగా ఫీల్డ్‌లో పని చేస్తున్న కళాకారులు, కవులు, రచయితల కోసం జరిగింది. దానికి స్టేట్ జెఎన్ఎం కామ్రేడ్స్ టీచర్స్ వాళ్ళతో పాటు అమరుడు కా. కౌముది, విరసం నుండి పాణి మాకు కథ, నవలా రచనపై క్లాసు చెప్పారు. ఆ వర్క్‌షాపు ముగించుకొని ఎంతో నూతన సాహిత్య కృషి చేసి నూతన ఉత్సాహాన్ని నింపుకొని చివరిగా వీడ్కోలు సభ.. అప్పటి నిర్బంధం అంటే ఇప్పుడు కలిసిన కామ్రేడ్స్ మళ్లీ కలుస్తారనే గ్యారంటీ లేని యుద్ధ పరిస్థితి. సాంస్కృతిక ప్రోగ్రాం ఆ సాయంత్రం నుండి మొదలై సామూహిక నృత్యాల వరకు తెల్లవార్లూ అలసట లేకుండా రకరకాల డ్యాన్సులు చేశాము. తెల్లవారి విడిపోయే ముందు ఎవరి గమ్యాలకు వాళ్ళం చేరుకునేందుకు బ్యాచీలుగా నిలబడి కరచాలనం చేస్తున్నాం. 'కామ్రేడ్స్ కలుద్దాం! మళ్ళీ మళ్ళీ' అంటూ కళ్ళల్లో నిండిన కన్నీళ్ళతో ఒక్కొక్క అడుగు భారంగా వేసుకుంటూ పాణి దగ్గరకు వచ్చాను. అందరిలాగే కరచాలనం చేసి ఒక పుస్తకాన్ని నా చేతిలో పెట్టాడు. తర్వాత దాన్ని తెరచి చూశాను. కవితలంటే బాగా ఇష్టమైన నాకు ఫీల్డ్‌లో పని చేస్తున్న కొందరు కామ్రేడ్స్ రాసిన కవితలు ఉన్న పుస్తకం. 'యుద్ధమే జీవితం' (పేరు సరిగా గుర్తు లేదు) అనే కవితల సంకలనం. మొదటి పేజీలో రెండు లైన్లు రాసి ఉన్నవి. 'రచనా ఆచరణ - రెండూ రెండు కళ్ళ లాంటివి' అని ఉన్నది. అవును మార్క్సిస్టు' అవగాహనతో పాటు ఆచరణ ఎంత ముఖ్యమో విప్లవ రచనలకు కూడా రచనలతో పాటు ఆచరణ అంతే ముఖ్యం. నిజంగా చలసాని గారు మార్క్సిస్టు అవగాహనతో రచనలు చేస్తూ ఎన్నో పుస్తకాలను చదివి మార్క్సిస్టు విశ్లేషణలు, విమర్శలు రాస్తూ తన రచనను, ఆచరణను రెండూ రెండు కళ్ళుగా చేసుకున్నాడు. భవిష్యత్తు మీద ఒక స్పష్టమైన అవగాహనతో.... 'మార్క్సిజ'మనే కళ్ళద్దాలతోనే ఈ ప్రపంచాన్ని చూశాడు. అధ్యయనం చేశాడు. 'మార్క్సిజ'మనే వెలుగుల్ని నింపుకున్న తన 'కళ్ళ'ను కూడా దానం చేయాలనే ముందు చూపుతోనే ఉన్నాడు. తను కలలు కన్న సుదూరపు ఆశయాన్ని తీక్షణంగా చూస్తూనే, అనుకోకుండా ఎవ్వరికీ తెలియకుండా ఆ చూపు ఆగిపోయినప్పుడు తన దేహం నుండి అంధత్వంలో ఉన్న ఎవ్వరికైనా తన వెలుతుర్లు చిమ్ముతున్న 'చూపు'ను ఇవ్వాలని ముందుగానే నిర్ణయించుకున్నాడు. చివరకి తన పార్థివ దేహమే డాక్టరు చదివే విద్యార్థినీ, విద్యార్థులకు ప్రయోగశాలలో తనను క్షుణ్ణంగా అధ్యయనం చేసి మంచి డాక్టర్లు కావాలనుకున్నాడేమో! అందుకే తనే ఆ డాక్టరు చదివే పిల్లలకు అధ్యయన కేంద్రమయ్యాడు.

కృష్ణక్కా! చలసానిగారి గురించి ఎంత రాసినా ఆయన సుదీర్ఘ విప్లవ రాజకీయ జీవిత ప్రస్థానాన్ని ఇంకా రాయాలనే అనిపిస్తుంది. ప్రత్యక్షంగా రెండు సందర్భాలల్లోనే ఆయనను కలిసే అరుదైన అవకాశం దొరికింది. అందుకే ఎక్కువ విషయాలను రాయలేక పోతున్నాను. మీకు ఆయనతో ఆయన కుటుంబంతో ఉన్న సన్నిహిత సంబంధం ఎన్ని ఏళ్ళదో నాకూ కొంత తెలుసు. అందుకే ఆ పెద్దాయన లేని లోటును మీరు ఎంత వెలితిగా ఫీలవుతున్నారో తెలుసు. ఆ వెలితిని ఎప్పటికీ పూడ్చుకోలేము.

నలభై ఐదు వసంతాల విరసం సంస్థకు, నలభై మూడు వసంతాల మా జననాట్యమండలి సాంస్కృతిక సంస్థకు సాహిత్య, సాంస్కృతిక రంగంలో విడదీయని బంధం పెనవేసుకున్నది. ఒక్క విశాఖ జెఎన్ఎంతో ప్రత్యక్ష సంబంధం ఉన్నప్పటికీ ఏ.ఓ.బి. జోన్ సాంస్కృతికోద్యమానికి విలువైన సలహాలను, సూచనలను అందించారు. జెఎన్ఎంను ప్రోత్సహిస్తూ వెన్నంటే ఉన్నారు. చలసానిగారి జ్ఞాపకాలను మా జననాట్యమండలి జ్ఞాపకాలుగా నా స్పందనను మీతో పంచుకోవటం కోసమే నాకు బాగా మనస్సులో ఉండిపోయిన ఘటనలను లెటర్ రూపంలో ఈ పేపర్లపై ఉంచాను.

జోహార్ కామ్రేడ్ చలసాని ప్రసాద్.



## సవరణ

డిసెంబర్ 2015-జనవరి 2016 సంచికలో మార్క్స్ పెట్టుబడి - రచనా క్రమం - (5) - ఫ్రాన్సిస్ వీన్, అనువాదం : ముక్తవరం పార్థసారథి వ్యాసంలో 54వ పేజీ ఎడమ కాలమ్ మొదటి పేరా 9వ లైన్‌లో '1883లో మరణించేదాకా' అని సరిచూసుకో గలరు. అలాగే అదే వ్యాసం 55వ పేజీ ఎడమ కాలమ్ 3వ పేరా చివరి లైను మొదటి పదాన్ని 'తలచుకుంటే' అని సరిచూసుకోగలరు.

ఫిబ్రవరి 2016 సంచికలో పాణి రాసిన సంపాదకీయం 6వ పేజీ ఎడమ కాలమ్ 2వ పేర నుంచి చివరి వరకు టెక్స్ట్ రిపీట్ అయ్యింది. ఈ పొరపాట్లకు చింతిస్తున్నాము.

– సంపాదకవర్గం

# హెచ్చరిక జె.ఎన్.యు.పై దాడి వ్యూహంలో అంతర్భాగం!

**రొమిలా థాపర్**

అనువాదం: సి.ఎస్.ఆర్.ప్రసాద్

జె.ఎన్.యు.లో ఈ మధ్యకాలంలో జరిగిన సంఘటనలన్నీ భారత పౌరులుగా మనం తప్పనిసరిగా స్పందించాల్సిన ప్రశ్నలను అందించాయి. పరిపాలనకు ముఖ్యంగా అవసరమైన ప్రాథమిక సమస్యలను అర్థం చేసుకోవటంలో మన పాలకులు చాలామంది సున్నితత్వాన్ని ప్రదర్శించలేని కారణంగా ఈ ప్రశ్నలు మనకు తప్పనిసరి అయ్యాయి. ఉదాహరణకు, ప్రజాస్వామిక వ్యవస్థకు తప్పనిసరియైన అంశాలేమిటి? ప్రజాస్వామిక విలువలుగా సమానత్వం, మానవ హక్కులు ఎంత ప్రధానమైనవి? ఆ విలువలను విద్యాసంస్థల్లో బోధించటం, పెంచి పోషించటం ఎంత అవసరం. ప్రతి భావ వ్యక్తీకరణను, ప్రతిచర్యను నైతికత, సమాజం, పౌరసత్వం వంటి విస్తృత సందర్భంలో భాగంగా కాక వాటి తక్షణ రాజకీయ ప్రతిఫలాలను బట్టి అంచనా వేయటం జరుగుతోంది.

జె.ఎన్.యు. ఆవరణలో కొంతమంది విద్యార్థులు సమావేశమై ఉరిశిక్ష గురించి చర్చించటం ఈ మధ్య కాలంలో జరిగిన ఒక ఉదాహరణ. ఆ చర్చలో ఈ మధ్య ఉరిశిక్షకు గురైన వ్యక్తుల పేర్లు సహజంగానే ప్రస్తావించబడ్డాయి. ఇది వెంటనే ప్రధాన రాజకీయ విషయంగా ఆలోచించాల్సిన అంశంగా మారిపోయింది. మిగిలిన ప్రశ్నలన్నీ పక్కకు ఎగిరిపోయాయి. సాధారణంగా ఇలాంటి పరిస్థితుల్లో జరిగేటట్లుగానే ఒక గందరగోళ స్థితిలో నినాదాలు వెలువడ్డాయి. తీవ్రంగా చర్చించబడాల్సిన ఉరిశిక్ష అనే అంశం దారి తప్పింది. ఉరిశిక్ష కేవలం జాతీయవాదానికి మాత్రమే సంబంధించిన అంశం కాదు. నైతికత, నీతి, మతం, శిక్షా సందర్భం వంటి అంశాలన్నీ అందులో ఇమిడి ఉన్నాయి. ఈ సమస్యలన్నింటిపైనా భిన్నాభిప్రాయాలుండటం ఎంత మాత్రం ఆశ్చర్యం కలిగించదు. అక్కడ ఉన్న కొంతమంది దీన్ని ఒక జాతి వ్యతిరేక సమస్యగా చూడాలని పట్టుపట్టడం ప్రభుత్వం జోక్యం చేసుకొని దీన్ని అణచివేయాలని కోరటం కంటే ఈ అంశం మీద ఇతర దృక్కోణాల నుంచి మరింత విస్తృతమైన చర్చ జరిగి ఉంటే అది ఒక హేతుబద్ధమైన ముగింపుకు దారితీసి ఉండేది.

### రాజద్రోహం, వేర్పాటువాదం:-

ఈ సంఘటన మీద రాసిన వాళ్ళందరూ చెప్పినట్లుగా జె.ఎన్.యు. విద్యార్థులపై నేరారోపణ చేసే క్రమంలో ప్రభుత్వం వాడినవన్నీ సమస్యాత్మక పదాలే! వాటిని అంత తేలిగ్గా అలా వాడకూడదు. రాజద్రోహ నేరం చాలా తీవ్రమైంది. దాన్ని దేశం గురించి విమర్శనాత్మక అభిప్రాయాలు వెల్లడించిన ప్రతివాళ్ళ మీద ప్రయోగించటం సరికాదు. హింసను ప్రేరేపించటం, రాజ్యాన్ని లేదా ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రేరేపించటం రాజద్రోహం అనే పదానికి అర్థాలుగా డిక్షనరీల్లో ఉంది. ఇతరులు కొందరు చెప్పినట్లుగా హింసాత్మక పద్ధతులను ప్రచారం చెయ్యటానికి, వాస్తవంగా హింసను ప్రేరేపించటానికి మధ్య గణనీయమైన వ్యత్యాసముంది. కానీ, అలాంటి తేడాలను గ్రహించగలిగే స్థితి చాలామంది రాజకీయ నాయకులకు లేదు.

భారతదేశం నుండి ఒక ప్రాంతం విడిపోయే అవకాశాన్ని గురించి, అభిప్రాయాన్ని వ్యక్తీకరించటం రాజద్రోహం అని అంటున్నారు. ఇలా అంటున్నవారికి, ఆ పదానికి సరైన అర్థం కూడా తెలియదు. అంతే కాదు, వాళ్ళకు గత అర్ధ శతాబ్ది కాలంలో భారతదేశంలోని ఇతర ప్రాంతాలకు సంబంధించి ఇలాంటి ప్రకటనలే వెలువడిన చారిత్రక సందర్భాల గురించిన జ్ఞానం కూడా లేదు. ఇలాంటి చర్చలో కాశ్మీర్ ప్రస్తావన రావటం ఇది మొదటిసారి కాదు. నాగలాండ్, తమిళనాడుల నుంచి కూడా దేశం నుండి విడిపోతామనే బెదిరింపులు, ఖలిస్థాన్ పేరిట సిక్కు రాజ్యాన్ని ఏర్పాటు చేయాలనే వాంఛ ఇంత క్రితమే వ్యక్తమయ్యాయి. ఇలాంటి డిమాండ్లలో కొన్ని ఇప్పటికీ పూర్తిగా సద్దుమణగలేదు. విస్తారమైన భౌగోళిక ప్రాంతాన్ని, భిన్న సంస్కృతులను కలిగిన దేశాలలో జాతిపరంగా విడిపోతామనే డిమాండ్ రావటం సహజమే. వాటిని మార్పు క్రమంలో భాగంగా అర్థం చేసుకోవాలి. దాని గురించి చర్చించాలి గాని రాజద్రోహం పేరుతో దాని గొంతు నులిమివేయకూడదు.

భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని నిరోధించటానికి, స్వాతంత్ర్యం వచ్చిన తొలి సంవత్సరాలలోనే ప్రయత్నం జరిగినప్పుడు రాజద్రోహం పై చర్చ ప్రారంభమైంది. ఆ కుటిలయత్నాన్ని సుప్రీంకోర్టు విజయవంతంగా ప్రతిఘటించింది. (బ్రిజ్‌భూషణ్ ఢిల్లీ ప్రభుత్వం, రొమేష్ థాపర్, భారతప్రభుత్వం) రాజ్యాంగ వ్యతిరేక మైనదిగా ప్రకటించి, రాజద్రోహాన్ని రాజ్యాంగం నుండి తొలగించటానికి నెహ్రూ అనుకూలుడు. అవి ప్రజాస్వామ్యాన్ని గౌరవించి, పెంచి పోషించిన రోజులు! న్యాయబద్ధమైన ఆధారాల కారణంగా రాజద్రోహాన్ని వ్యతిరేకించి, చట్టాల నుండి దాన్ని తొలగించాలని ఆలోచనలు రేకెత్తిన పలు సందర్భాల గురించి మనం తెలుసుకోవాలి. తేలికగా దుర్వినియోగం చేయబడే చట్టాలను పునః పరిశీలించాలి. మనల్ని పరిపాలించడానికి ఉద్దేశించబడ్డ చట్టాలను గురించిన చర్చలో మేధోపరమైన ఆసక్తితో పాల్గొనటం పాలనలో ఒక భాగం.

## తొలి ఆకస్మిక దాడి:-

జాతికి సంబంధించిన కొన్ని అంశాలపై కొందరు విమర్శనాత్మకంగా ఉంటారు. అలాంటి వాళ్ళను తక్షణం జాతి ద్రోహులుగా ఖండిస్తారు. ఈ విశేషణాన్ని పైపైనే అర్థం చేసుకుంటే దేశంలో జరుగుతున్న అనేక సంఘటనల పట్ల విమర్శనాత్మకంగా ఉంటున్న అసంఖ్యాక భారతీయులందరూ, జాతి ద్రోహులే అవుతారు. అన్ని ప్రభుత్వాలు కూడా ప్రజల్ని జాతి ద్రోహులుగానే వర్ణిస్తూ వచ్చాయి. అయితే గత రెండు సంవత్సరాలుగా, ఈ ఆరోపణ పదే పదే చేయబడింది. భా.జా.పా. దాన్నెంత తరచుగా ఉపయోగించిందంటే నిజానికి అది అర్థం లేని పదంగా మారిపోయింది. అది అర్థం లేనిదే కాని, చాలా హానికరమైంది. ఒక వ్యక్తిని రాజకీయంగా వెంటాడటానికి దాన్ని ఉపయోగించుకోవచ్చు. అత్యవసర పరిస్థితి తర్వాత, మొరార్జీదేశాయి ప్రభుత్వంలో, జనసంఘ్(భాజపాకు ముందున్న పేరు) మాలో కొంతమందిమి రచించిన ఎన్.సి.ఇ.ఆర్.టి. ప్రచురించిన చరిత్ర పాఠ్య పుస్తకాలను విమర్శించింది. ప్రాచీన భారత చరిత్ర గురించి మా అభిప్రాయాల కారణంగా మమ్మల్ని దేశ వ్యతిరేకులమని, జాతి వ్యతిరేకులమని నిందించింది. ప్రభుత్వం మా పుస్తకాలను నిషేధించాలని డిమాండు చేసింది. అయితే ఆ తర్వాత జరిగిన ఎన్నికల్లో ఆ ప్రభుత్వం పడిపోయి, మా పుస్తకాలు బతికి బట్టకట్టాయి.

దాదాపు 25 సంవత్సరాల తర్వాత, తొలి ఎన్.డి.ఎ.ప్రభుత్వం ఈ అంశాన్ని తిరగదోడింది. అప్పటి విద్యాశాఖా మంత్రి మురళీమనోహర్ జోషీ ఆయన, భా.జ.పా.సైనికదళాలు నాతో సహా ఈ పాఠ్యపుస్తకాల రచయితలనందర్నీ హిందూ వ్యతిరేకులమనే గాక, జాతి వ్యతిరేకులమని, భారత వ్యతిరేకులమని, మేధో ఉగ్రవాదులమని సంభోధించారు. ఈ పుస్తకాలు రాసినందుకు మమ్మల్ని నిర్బంధించి, శిక్షించాలని రాజకీయ నాయకులు అత్యుత్సాహంతో డిమాండు చేసారు. అదృష్టవశాత్తు తొలి ఎన్.డి.ఎ. ప్రభుత్వం దీన్నింత తీవ్రంగా పట్టించుకోలేదు. జాతి వ్యతిరేకతకు వాళ్ళు ఇచ్చిన నిర్వచనం అవహాస్యానికి గురికావటంతో అధ్యాపకుల్ని, విద్యార్థుల్ని జాతి వ్యతిరేకులని నిర్బంధించలేదు. అంతిమ పరిశీలనలో జాతి వ్యతిరేకత అంటే, సంకుచితార్థంలో వాళ్ళ ఉద్దేశం హిందూ వ్యతిరేకత అని.

## విషాదకరమైన ప్రయత్నం:-

విశ్వవిద్యాలయాలకు సంబంధించి, భా.జ.పా., ఆర్.ఎస్.ఎస్. ప్రభుత్వం వేస్తున్న ఎత్తుగడల్లో భాగంగా, జె.ఎన్.యు.లో అరెస్టు చేసిన విద్యార్థి సంఘం అధ్యక్షుడిపై జాతి వ్యతిరేకి అనీ, రాజద్రోహానికి పాల్పడుతున్నాడని ఆరోపించటం కొత్త ఎత్తుగడ. పాకిస్థాన్‌ను పొగుడుతూ, స్వతంత్ర కాశ్మీర్‌కు అనుకూలంగా నినాదాలు చేసాడని అతనిపై ఆరోపించారు. చర్చను ముగించడానికి ప్రయత్నిస్తూ తమ జాతి వ్యతిరేక, రాజద్రోహం నేరాలుగా పరిగణించబడుతున్న దానికి భిన్నంగా ప్రవర్తించిన విద్యార్థి సంఘం అధ్యక్షుడిపై అదే నేరం మోపి నిర్బంధించటం విషాదకరం, హాస్యాస్పదం.

కొంత ఆలోచించుకున్న తర్వాత, ఇప్పుడేమంటున్నారంటే, లష్కర్-యి-తోయిబా ఆ విద్యార్థుల్ని రెచ్చగొట్టి ఆ సభను నిర్వహింపజేసిందని అంటున్నారు. ఎలాంటి సాక్ష్యాధారాలు లేకపోయినా, ఒక మోసపూరితమైన ట్వీటర్ ఆధారంగా టెర్రరిస్టు ఆరోపణను ప్రయోగించటానికి ప్రయత్నించటం విషాదకరం. ప్రభుత్వం, 'ట్వీటర్ల' సాక్ష్యంపై ఆధారపడుతుందా. ఒక వ్యక్తిని రాజద్రోహిగా నిందించటానికి మోసపూరితమైన ట్వీటర్లు సరిపోతాయా. ఇది కేవలం ప్రభుత్వం, పోలీసులు తలబిరుసుగా వ్యవహరించటం మాత్రమే కాదు, జె.ఎన్.యు.లో అస్థిరత్వాన్ని ప్రేరేపించటానికి ఉద్దేశించబడిన వ్యూహంలాగా కనబడుతోంది. సంఘటనల క్రమంలో అత్యుత్సాహం కనబడుతోంది. ఈ మొత్తం వ్యవహారాన్ని పరిశీలిస్తే ప్రస్తుత ప్రభుత్వం తన మీద తనకున్న విశ్వాసాన్ని పోగొట్టుకుందనీ, అందుకే ఇలాంటి కుటిల ఎత్తుగడలకు పాల్పడుతోందని ఎవరైనా ఊహించగలరు. విద్యార్థి సంఘం నాయకుడు, కేసు విచారణ జరగాల్సిన పాటియాలా కోర్టులో కొందరు న్యాయవాదులు జె.ఎన్.యు. అధ్యాపకులు, విద్యార్థులు, విలేకరులను కొట్టడం దీనికొక ఉదాహరణ. న్యాయస్థానాల్లో ముష్టియుద్ధాలు ప్రారంభం కావలసిందేనా?

## ప్రశ్నా-జవాబుల రూపంలో విద్య:-

భాజపా, ఆర్.ఎస్.ఎస్. భావజాలంలో ఉదారవాద ఆలోచనా విధానానికి చోటులేదు. అలాంటి సంస్థలకు విద్య అంటే కేవలం ప్రశ్నలు వేసి జవాబులు రాబట్టటమే! విశ్వాసాలు, నమ్మకాలు అనే సంకుచిత అంశాల ఆధారంగా తయారైన ప్రశ్నలను అంటే సంకుచితమైన సమాధానాలను బట్టీపట్టటమే వారి దృష్టిలో విద్య. అక్కడ సందేహించటం, చెప్పిందానికి వెలుపల ఆలోచించటం నిషేధం. అన్ని శాస్త్రాలకీ ఇదే సూత్రం వర్తిస్తుంది. అందుచేత ప్రశ్నించడాన్ని చర్చించటాన్ని అనుమతించే విద్యా కేంద్రాలు వాళ్ళ దృష్టిలో శాపాల లాంటివి. వాటిని కూల్చివేయాలి.

హిందూమతానికి ఒకే ఒక్క పవిత్ర గ్రంథం లేదు, ఒకే ఒక్క దేవుడితో కూడిన ఏకేశ్వరోపాసనా లేదు. అందుచేత ఇస్లాం, క్రైస్తవ మతాలలో ఉన్నట్లుగా మత విద్రోహాన్ని హిందూమతంలో అన్వయించటానికి అవకాశం లేదు. కాని, హిందువులు మాత్రమే ప్రాథమిక పౌరులుగా ఉండే, హిందూ విధానాలనే ఎత్తిపట్టటం కోసమే పరిపాలన జరిగే హిందూ రాష్ట్ర స్థాపనను హిందుత్వ, హిందూ మత లక్ష్యంగా చెప్తున్నది. హిందుత్వను, హిందూ రాజ్యాన్ని అది ఒకటిగానే చూస్తున్నది. ఆ రెండింటి పట్ల విమర్శనాత్మకంగా ఉండే వాళ్లపై మత విద్రోహ నేరాలను అది ఆరోపిస్తున్నది. దీన్నంతటినీ, వాళ్ళు జాతితో సమానం చేస్తున్నారు. అంటే హిందుత్వను విమర్శించటమంటే జాతి వ్యతిరేకతే! ఆ రకంగా ఆ విమర్శ గొంతు నొక్కివేయవచ్చు. ప్రతి విమర్శను తమ విశ్వాసాలపై దెబ్బలుగా పేర్కొనటాన్ని తక్కువ చేసి, దాన్ని జాతి ద్రోహంగా, మత విద్వేషంగా, తీవ్ర నేరంగా పరిగణిస్తున్నారు. ఒక లౌకిక రాజ్యాన్ని, ఆర్.ఎస్.ఎస్ అంతిమ లక్ష్యమైన మత రాజ్యంగా మార్చటానికి ఇది ఉపయోగపడింది.

జె.ఎన్.యు, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం వంటి సంస్థలతో భాజపా, ఆర్.ఎస్.ఎస్. ప్రభుత్వం, చర్చలు

జరపలేకపోతోంది. ఉనికిలో ఉన్న జ్ఞానాన్ని ప్రశ్నించటం కొత్త జ్ఞానాన్ని కనుగొనటానికి ప్రయత్నించటం, జ్ఞానాన్ని వాస్తవ స్థితికి అన్వయించటం అనే అంశాలకు ఆ విశ్వవిద్యాలయాలలో తొలి నుండీ ప్రాధాన్యత ఉంది. ఎటువంటి ప్రశ్నలూ లేకుండా కేవలం ఎంపిక చేసిన సమాచారాన్ని అందించటానికి ఇది పూర్తి వ్యతిరేకం. ప్రతిష్టాత్మకమైన విద్యాకేంద్రాలలో అధ్యయనం అంటే కేవలం ప్రశ్నలు వేసి జవాబులు రాబట్టటం కాదు. ఇందుకు భిన్నంగా, హిందుత్వ నిర్వచనం ప్రకారం జాతి, మత వ్యతిరేకమైన అంశాలపై కూడా చర్చించే మక్కువ ఉండాలని ఆ విద్యా కేంద్రాలు డిమాండు చేస్తున్నాయి. ఇది భాజపా, ఆర్.ఎస్.ఎస్. ప్రభుత్వం ఎదుర్కొంటున్న సమస్య. కాబట్టి, అలజడులు సృష్టించి అలాంటి అధ్యాయన కేంద్రాలను నాశనం చేయటానికి ప్రయత్నించటమే వాళ్ళకు మిగిలిన మార్గం. అలా చేస్తే తప్ప ఆ విద్యాకేంద్రాలు ఎందుకు ఉద్దేశించబడ్డాయో అందుకోసం పనిచేయకుండా నిరోధించవచ్చు.

### తిక్కకూ ఒక లెక్క (పిచ్చిలో కూడా ఒక పద్ధతి):-

ప్రతి సందర్భంలోనూ, ఒకే పద్ధతి పునరావృతం అవుతుండడాన్ని బట్టి, ఇలాంటి అలజడులను సృష్టించటంలో ఒక పద్ధతి ఉందని అనిపిస్తోంది. పోలికలు చాలా ఆశ్చర్యంగా ఉన్నాయి. ఎవరికీ తెలియని ఒక వ్యక్తిని సంస్థలో ఆధిపత్య స్థానంలో నియమించటం మొదటి దశ. గత 18 సంవత్సరాలుగా, వివిధ సంస్థల్లో డైరెక్టర్లుగా, అధ్యక్షులుగా, ఉపకులపతులుగా ఇలాంటి అనామకుల్నే నియమించారు. ప్రభుత్వ ఆదేశాలను పాటించటం వాళ్ళ విధి. సమకాలీన అంశాలపై చర్చలు జరిపే ఒక బృందాన్ని గుర్తించి, ఆ సమావేశాలలో పాల్గొని, అక్కడ ఘర్షణకు దిగమని స్థానిక ఎ.బి.వి.పి. కార్యకర్తలకు ఆదేశాలివ్వటం రెండవ దశ. ఒక్కోసారి ఆ ఘర్షణ కొద్దిపాటి హింసకు దారి తీయవచ్చు. తమ మీద ముందుగా అవతలి పక్షమే దాడి చేసిందని ఎ.బి.వి.పి. ప్రకటించడానికి ఇందులో అవకాశముంది. తదనంతరం వాళ్ళు తమకు కేటాయించబడ్డ స్థానిక భాజపా నాయకునికి ఫిర్యాదు చేస్తారు. ఆయన దాన్ని మంత్రికి పంపిస్తాడు. విద్యార్థుల్ని బహిష్కరించమని ఆవరణలోనికి పోలీసుల్ని పిలవమని ఆ సంఘటనతో సంబంధం ఉన్నా లేకపోయినా ఎ.బి.వి.పి.యేతర విద్యార్థుల్ని అరెస్టు చేయమని ఆ మంత్రి అధికారుల్ని ఆదేశిస్తాడు.

పోలీసుల్ని విశ్వవిద్యాలయాల ఆవరణలోనికి అనుమతించడాన్ని, విద్యార్థుల్ని అరెస్టు చేయటాన్ని గతంలో విశ్వవిద్యాలయాలు వ్యతిరేకించాయి. అత్యవసర పరిస్థితి కాలంలో మాత్రమే ఇందుకు భిన్నంగా జరిగింది. సాధారణంగా అధికారులు ఒక విచారణా కమిటీని వేయిస్తారు. దీన్ని సంస్థ ఆంతరంగిక వ్యవహారంగా పరిగణిస్తారు. చట్టానికి తీవ్రమైన విఘాతం కలిగినప్పుడు మాత్రమే పోలీసు చర్యను అనుమతించాలి. కొందరు విద్యార్థులు నినాదాలివ్వటం చట్టానికి తీవ్రమైన విఘాతం కాదు. జె.ఎన్.యు.లో జరిగింది చూస్తే "కోడిగుడ్డు పగలగొట్టడానికి ఒక పెద్ద సుత్తిని తీసుకురావటం" అనే సామెత గుర్తుకొస్తోంది. గుడ్డును పగలగొట్టటం కాక, దాన్ని పూర్తిగా నాశనం చేయటమే వాళ్ళ ఉద్దేశమని అర్థమవుతుంది. ఇంతా చేస్తే ఇప్పుడా గుడ్డు ప్రభుత్వం మొహాన పగిలింది. అధ్యయన సంస్థల్ని, ధ్వంసం చేసి వాటిని కేవలం విద్యా దుకాణాలుగా మార్చాలని భా.జ.పా, ఆర్.ఎస్.ఎస్.లు ఎందుకు కంకణం కట్టుకున్నాయని ఎవరైనా అడగవచ్చు. ఆమోదిత భావజాలానికి కట్టుబడి ఉండటం, కాలం చెల్లిన జ్ఞానాన్ని విద్యగా నిర్వచించటం భా.జ.పా, ఆర్.ఎస్.ఎస్.ల లక్ష్యమా? శిశుమందిరాలు, మదరసాలలో నేర్పుతున్న విద్య ఆదర్శవంతమైందా? ఆశ్చర్యంగా వాళ్ళ దాడులకు గురవుతున్న సంస్థలన్నీ భావప్రకటనా స్వాతంత్ర్యంతో, ప్రశ్నలు సంధించటంలో జ్ఞానాన్ని అభివృద్ధి చేయటంలో ముడిపడి ఉన్నవే! బట్టీ పట్టే విద్యను నేర్పడానికి కట్టుబడి ఉండే కేవలం ప్రశ్నలు వేసి జవాబులు రాబట్టటమే అధ్యయనంగా జరుగుతున్న సంస్థల వ్యవహారాలలో వాళ్ళు జోక్యం చేసుకోవటం లేదు.

మేధో వ్యతిరేక దృక్పథం కలిగి ఉన్న వాళ్ళు ప్రస్తుతం మనల్ని పరిపాలిస్తున్నారనటం నిస్సందేహం! బోధనలో, పరిశోధనలో అత్యున్నత ప్రమాణాలను స్థాపించాలనుకునే విశ్వవిద్యాలయాలకు ఇది పెద్ద సమస్య. అలాంటి విద్యా సంస్థల గురించి, అవగాహన చేసుకునే శక్తి కూడా ప్రస్తుత పాలకులకు లేదు. ప్రభుత్వానికి మేధావులంటే ఇంత భయం దేనికి? అని మాత్రమే మనం ప్రశ్నించగలం. విద్యార్థుల్ని, స్వతంత్ర ఆలోచనల వైపుగా ప్రోత్సహించే విశ్వవిద్యాలయాలు సృష్టించగలిగే క్రియాశీలక శక్తిని చూసి పాలకులు భయపడుతున్నారా? అందుకే, విశ్వవిద్యాలయాల పట్ల ఇలాంటి తత్తరపాటు వైఖరిని ప్రదర్శిస్తున్నారా? లేక, విద్యాసంస్థల్లో ఒక విధమైన భయానకమైన వాతావరణాన్ని పనిగట్టుకొని సృష్టించటానికి ప్రయత్నిస్తున్నారా? అలంటి భయాన్ని నెలకొల్పటం ద్వారా ఆర్.ఎస్.ఎస్. భావజాలంతో కూడిన సిలబస్‌ను, కోర్సులను, బోధనా పద్ధతులను బలవంతంగా రుద్దటం తేలికవుతుంది. దీని ఫలితంగా విశ్వవిద్యాలయాల్లో పనిచేసే వాళ్ళందరూ బలహీనమైపోతారని వేరే చెప్పనక్కరలేదు.

### పోరాడి రక్షించుకోవాల్సిన సంస్కృతి:-

జె.ఎన్.యు. వ్యవస్థాపక సభ్యులమైన మా కందరికీ అక్కడ గత కొద్దిరోజులుగా జరుగుతున్న సంఘటనలన్నీ దాని చరిత్రలో ఇంతకు ముందెన్నడూ కనీవినీ ఎరుగని మేధోపరమైన, ఉద్రేకభరితమైన సంక్షోభ చిహ్నాలు అనిపిస్తున్నాయి. పరిపాలనలోనూ, అక్కడ నేర్పే విద్యాంశాలలోనూ ప్రజాస్వామికంగా పనిచేయటం అనే సూత్రం ఆధారంగా జె.ఎన్.యు. ఏర్పడింది. అధ్యాపకులకీ, విద్యార్థులకీ మధ్య అక్కడ సానుకూలమైన సంబంధం ఉండేది. విద్యాసంబంధమైన ప్రాపంచికమైన అంశాలపై స్వేచ్ఛాపూరకమైన చర్చలు జరిగేవి. బోధించే అంశాలలో సునిశితమైన శిక్షణ లభించేది. అధ్యాపకుల, విద్యార్థుల పని మెరుగుదలకు ఈ అనుభవం ఉపయోగపడేది. ప్రతిదాన్ని విమర్శనాత్మకంగా పరిశోధించటం అనే సూత్రం అంతర్లీనంగా నడిపించేది. అప్పటికే మాకు తెలిసిందాని కంటే అవల ఉన్న జ్ఞానాన్ని తెలుసుకునే చైతన్యం మాకుండేది. తమకు కనపడేదానికి వెలుపల ఉండే జ్ఞానం వైపు దృష్టి మరల్చేటట్లు విద్యార్థుల్ని ప్రోత్సహించేవాళ్ళం.

# మనం ఇక్కడ నుండి ఎక్కడికి వెళ్తున్నాం?

**షా-ఆలం-ఖాన్**

తెలుగు: పి.ఎస్.ఆర్.

ఎద్దుమాంసం కలిగి ఉన్నందుకు ఒక మూక ఒక ముస్లిం వ్యక్తిని అతని ఇంట్లోనే దారుణంగా నరికి చంపివేసింది. మనం ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్తున్నాం?

ఒక దళిత విద్యార్థి ఆత్మహత్య చేసుకోక తప్పని స్థితి కల్పించబడింది. ఈ దేశ శాసన నిర్మాతలు అతడి కులాన్ని ప్రశ్నిస్తున్నారు. ఈ గందరగోళంలో అతడి ఉద్దేశ్యం, కోరిక మటు మాయమయ్యాయి. మనం ఎక్కడ నుండి ఎక్కడకు వెళ్తున్నాం?

నామ మాత్రపు విచారణ కూడా లేకుండా ఒక విద్యార్థి నాయకుణ్ని రాజద్రోహం నేరం కింద అరెస్టు చేసారు. కవాతు చేస్తున్న సైన్యం ఆలపించే యుద్ధ గీతం ఎంత దేశభక్తి యుతంగా ఉంటుందో అతడి ఉపన్యాసం కూడా అలానే ధ్వనించింది. మనం ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్తున్నాం?

న్యాయవాదుల హంతక గుంపు (ఒక శాసనసభ్యుడితో సహా) ఒక అమాయకుడిపై దాడి చేసింది. మధ్య యుగాల నాటి న్యాయం. మాతృభూమి పట్ల తన ప్రేమను ప్రకటించుకోవటానికి తన దగ్గర తుపాకి ఉండి ఉంటే బాగుండేదని పిచ్చి పట్టిన ఆ శాసనసభ్యుడు కోరుకున్నాడు. మనం ఇక్కడి నుండి ఎక్కడకు వెళ్తున్నాం.

ఒక పోలీసు అధికారి అధికార పార్టీ పల్లవి ఆలపిస్తున్నాడు. ఈ అపవిత్ర కలయిక ఎక్కడకు దారి తీస్తుందో ఆలోచిస్తే వెన్నులో వణుకు పుడ్తోంది. మనం ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్తున్నాం?

వాస్తవాలను వెలుగులోకి తెస్తాడనుకునే ఒక న్యూస్ యాంకర్ బలంగా తన గుండెను బాదుకున్నాడు. ఆ ధ్వనిలో వాస్తవం పీకల దాకా అణిగిపోయింది. అతడు నిస్సిగ్గుగా హింసను ప్రేరేపించాడు. మనం ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్తున్నాం?

మనం విధితో సవాల్ చేసి ఎంతో కాలం కాలేదు. విరిగిపోయే ఆ స్వప్న శకలాలు జాతి ఆత్మను గాయ పరుస్తున్నాయి. అవి ఎంత విరిగిపోయినవైనా ఆ స్వప్నాల నుండి మనం ఎక్కడకు పారిపోగలం?

జాతి వ్యతిరేకిగా ముద్ర వేయబడ్డ కన్హయ్యకుమార్ తీహార్ జైలు ఇనపగోడల మధ్య సిగ్గుతో ఆత్మహత్య చేసుకున్నాడన్న వార్త బహుశా రేపు మనం వినవచ్చు. మనం ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్తున్నాం అని అడుగుతామా? బహుశా అడగం. మనం ఎక్కడకు వెళ్ళాలని వాళ్ళు కోరుకుంటున్నారో ఖచ్చితంగా అక్కడకు చేరుకుని ఉంటాం. మౌఢ్యమూ, ఫాసిజమూ కలగలిసిన అంతులేని చీకటి అగాథం అది. అది ప్రాణాంతకమైనది. ఎంత ప్రాణాంతకమైనదంటే కోటి మందికి పైగా ప్రజల్ని నిద్రపుచ్చేటంత.



---

ఈ అంశాలన్నింటి కారణంగానే అది ఒక గౌరవప్రదమైన విశ్వవిద్యాలయంగా కీర్తి గడించింది. మిగిలిన విశ్వవిద్యాలయాలకు, బోధనాంశాలలో నమూనాగా నిలబడింది. అంతర్జాతీయ గుర్తింపును సంపాదించుకుంది. అనేక శాస్త్రాలలో దేశం వెలుపల ఉన్న ప్రఖ్యాత విశ్వవిద్యాలయాల సరసన నిలబడగలిగింది.

కేంద్ర మానవ వనరుల శాఖామంత్రి అభిప్రాయాల్ని బట్టి చూస్తే విద్య పట్ల భా.జ.పా, ఆర్.ఎస్.ఎస్. ల దృష్టి కోణానికి ఇది పూర్తిగా భిన్నమైనది. జె.ఎన్.యు.లో ఇంతకాలంగా మేం సాధించిన దాన్నంతట్నీ నిర్వీర్యం చేయటానికి, ఆ విశ్వవిద్యాలయాన్ని ఒక విద్యా దుకాణంగా మార్చటానికి భా.జ.పా., ఆర్.ఎస్.ఎస్ ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను చూస్తూ ఉంటే ఒక వ్యక్తి తన జీవిత కాలంలో సాధించినదంతా పథకం ప్రకారం, ఎవరో నాశనం చేస్తుంటే ఎంతటి ఆవేదన కలుగుతుందో అనుభవంలోనికి వస్తున్నది. జె.ఎన్.యు.ను దేశంలో అత్యుత్తమ విద్యాకేంద్రంగా రూపొందించాలనే ఆశావహ దృష్టితోటే విదేశీ విశ్వవిద్యాలయాలను, ఇంతకంటే లాభదాయకమైన పదవులు వచ్చినా మాలో చాలా మందిమి జె.ఎన్.యు.లోనే పనిచేయాలని నిర్ణయించుకున్నాము. ఆ విశ్వవిద్యాలయం అంతటి ఔన్నత్యాన్ని గడించింది. నా జీవితంలో ఎక్కువ సమయాన్ని గడిపి ఆ ఆశయానికి కృషి చేసిన ఒక ఉపాధ్యాయురాలిగా ప్రస్తుత ప్రభుత్వానికి జె.ఎన్.యు. పట్ల ఉన్న వ్యతిరేకతను చూస్తూ ఉంటే దేశంలోని విశ్వవిద్యాలయాల భవిష్యత్తు పట్ల ఒక విధమైన నిస్సహాయతలో, విచారంలో కూరుకుపోతున్నా. అయితే ఇంకో మాట కూడా చెప్పాలి. తమ మీద ఎక్కుపెట్టబడిన దాడిని జె.ఎన్.యు. కుటుంబం నిరసించిన తీరును చూస్తే, తొలి సంవత్సరాల్లో మేం నెలకొల్పడానికి ప్రయత్నించిన విలువలు, వేళ్ళూనుకున్నాయన్న సంతృప్తి కలుగుతోంది. ఈ సంక్షోభం నుంచి బయటపడిన తరువాత జె.ఎన్.యు. తన వ్యవస్థాపక విలువల పట్ల మరింత నిబద్ధతతో వ్యవహరిస్తుంది. మేధో పరిశ్రమలో అత్యున్నత స్థాయిని పొందటమే కాక, ప్రతి భారత పౌరుని హక్కుల్ని కాపాడే ఒక మానవీయ, బహిరంగ సమాజాన్ని సృష్టించటమనే ఆ విలువలకు అది మరింతగా కట్టుబడి ఉంటుంది. (16-02-2016న "ద వైర్" లో ప్రచురితం.)



# జనతన రాజ్యం - రూపొందుతున్న చరిత్ర

సాగర్ బొప్పూడి

గత డిసెంబర్ నెలలో నాకు, మా లెక్చరర్ కి మావోయిస్టులు, వాళ్ళ రాజకీయాల మీద ఒక సంభాషణ జరిగింది. ఆ సంభాషణలో ఆయన మావోయిస్టులు హింస సృష్టిస్తున్నారని, ప్రజలను మిగతా సమాజంతో వేరు చేసి వాళ్ళ బతుకుల్ని ధ్వంసం చేస్తున్నారని, అభివృద్ధిని అడ్డుకుంటున్నారని అన్నారు. మావోయిస్టులు పోలీసులను చంపడం, పోలీస్ స్టేషన్లను పేల్చివేయడం తప్ప ఇంక ఏమీ చేయడం లేదు. అలాంటి వారిని ఎలా సమర్థిస్తున్నావ్ నువ్వు అంటూ నామీద ఒకింత అసహనం చూపించారు.



జనతన రాజ్యం
పాణి
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
జనవరి 2016, వెల : రు. 300/-

కార్పొరేట్ వ్యవస్థకు అవసరమయిన విద్యార్థులను తయారుచేసి అందివ్వాలి అనుకుంటున్న చోట "మార్క్సిజం-లెనినిజం-మావోయిజం" ఐడియాలజీ, మావోయిస్ట్ రాజకీయాల మీద నా నమ్మకాన్ని ప్రకటించడం వల్ల ఆయన చూపిన అసహనానికి నేను పెద్దగా ఆశ్చర్యపోలేదు. బయటి సమాజంలో మీడియా ఏదైతే చూపుతుందో దానినే చాలా మంది మేధావులు మావోయిస్టులకు హింస తప్ప మరేది తెలియదని, వాళ్ళ రాజకీయాలని సమర్థించడం అంటే దేశద్రోహం చేయడమే అన్నట్టు ప్రచారం చేస్తున్నారు. ఇలాంటి వాటికి సమాధానమే పాణి రాసిన "జనతన రాజ్యం, దండకారణ్యంలో మావోయిస్టు ఆచరణ" పుస్తకం.

పాణి నెల రోజుల పాటు దండకారణ్యంలో ఉండి అక్కడ మావోయిస్ట్ పార్టీ నాయకత్వంలో ఆదివాసులు తమదైనటువంటి ఒక ప్రత్యామ్నాయ సమాజాన్ని నిర్మించుకోవడం ప్రత్యక్షంగా చూసి రాసిన పుస్తకం ఇది. మొత్తంగా దీనిని రచయత అనుభవంలోంచే కాకుండా ఒక నిర్మాణమవుతున్న చరిత్రలో భాగంగా చూడాల్సి ఉంటుంది. ఈ పుస్తకాన్ని చదివే క్రమంలో చైనాలో మావో నాయకత్వంలో పురాతన భూస్వామ్య వ్యవస్థని కూలదోసి "దున్నేవారిదే భూమి" అనే నినాదంతో వ్యవసాయక విప్లవ సంస్కరణల నేపథ్యంలో వచ్చిన రచనలు 'విముక్తి', 'ఉప్పెన' తాలూక ఛాయలు కనిపిస్తాయి. వీటి ఇతివృత్తం భూమి, భూ సమస్య అయితే వాటిల్లో ప్రధానంగా భూసంస్కరణలు, భూస్వాములకి రైతుకూలీలకు మధ్య వైరుధ్యాలు, సంస్కరణల అమలులో ఎదురైన సమస్యలను వివరిస్తాయి. అంతేకాకుండా సంస్కరణలు అమలు జరిపే క్రమంలో పాత వ్యవస్థ తాలూక ప్రభావం, సంస్కృతి, మూఢ నమ్మకాల ప్రభావంను రైతు కూలీలు, మధ్య తరగతి రైతుల మధ్య ఏర్పడ్డ సంఘర్షణను చూపిస్తాయి. అక్కడ 1947 చివరిలో అంతర్యుద్ధం కాలంలో కమ్యునిస్ట్ పార్టీ నాయకత్వంలో సమాజంలోని పాత వ్యవస్థ మీద వర్గపోరాటం జరిపి ఒక నూతన వ్యవస్థని ఏర్పరచిన క్రమాన్ని చూపెడుతాయి.

ఇక దండకారణ్యం విషయానికొస్తే పెట్టుబడిదారులకు ఇక్కడి సహజ వనరులను దోచిపెట్టడానికి భారత ప్రభుత్వం, దాని అర్ధ సైనిక బలగాలు చేస్తున్న దాడిని ఎదుర్కొంటూనే ఆదివాసులు మావోయిస్టు పార్టీ నాయకత్వంలో ఒక ప్రత్యామ్నాయ సమాజాన్ని నిర్మించుకోవడాన్ని, అలా నిర్మించుకునే క్రమంలో వచ్చినటువంటి ఇబ్బందులని అక్కడి ప్రజలు, పార్టీ నాయకత్వంలో ఏ విధంగా పరిష్కరించుకుంటున్నదీ పాణి తన ప్రత్యక్ష అవగాహనలోంచి తెలియజేశాడు. గత 30 సంవత్సరాల కాలంలో మావోయిస్టు పార్టీ నాయకత్వంలో ఆదివాసుల జీవితంలో, సంస్కృతిలో వచ్చిన మార్పుని, ఆ క్రమంలో వచ్చిన సమస్యలను, పరిణామాలను రచయిత అక్కడి ప్రజల దగ్గరి నుంచి, పార్టీ నాయకత్వం నుంచి తెలుసుకొని మనకి అందించాడు.

మొత్తంగా దండకారణ్యంలో భూమి ప్రధాన సమస్య ఐనప్పటికీ విద్య, వైద్యం, రక్షణ, సాంస్కృతిక రంగాల్లో చాలా అభివృద్ధి చెందారు. ఈ మొత్తం పరిణామ క్రమంలో అక్కడి ప్రజలు సల్వాజుడుం, గ్రీన్‌హంట్‌ను ఎదుర్కొంటూ ఒక ప్రత్యామ్నాయ సమాజాన్ని నిర్మించుకుంటున్నారు. ఇక బయటి మీడియా, మేధావులు, ప్రభుత్వం మావోయిస్టులకు పోలీసులకు మధ్య ఆదివాసులు నలిగిపోతున్నారని, ఆదివాసులు అమాయకులని చెప్పడం గురించి వాళ్ళ దగ్గర ప్రస్తావించగా "మేము అమాయకులం ఎట్లా అవుతాం ? ఇంత పెద్ద రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాం కదా" అన్నారు. ఇంకా పార్టీనే మాది ఐనాక మేము ఎట్లా మావోయిస్టులకి, పోలీసులకి మధ్య నలిగిపోతం ? మేమే మావోయిస్టులం కదా అన్నారు. ఈ సమాధానం విన్నాక ఐన ఆ తరహా మేధావుల్లో మార్పు వస్తుందేమో చూడాలి. ఇక మొత్తంగా దండకారణ్యంలో జరిగిన అభివృద్ధిని చూస్తే చాలా ప్రాథమిక స్థాయిలో ఉన్నట్టు అగుపిస్తుంది. అయితే అక్కడ జరుగుతున్న

# కృష్ణానది నీళ్ళు మహబూబ్‌నగర్ విషాదగాథ

**ఎం. రాఘవాచారి**

(1)

మిక్కిలి స్నేహాస్పదమైన ప్రేమనగర్ మన జిల్లా మహబూబ్‌నగర్. అడుగడుగునా తీవ్రమైన సమస్యలకు లోనవుతూనే ఉంది. ఎప్పటికప్పుడు ప్రజలు సాధించుకుంటున్న కొత్త సందర్భాలు ప్రజా జీవితంలో కొత్తదనాలు పూయించటం లేదు. అవే ఆవేదనలు, అవే సమస్యలు వెంటాడుతున్నాయి. సమస్యలు సమస్యలని కుంగిపోవటం దేనికి? వాటిని పరిష్కరించుకునే సంకల్పం కావాలి. కానీ, ఎంతకాలం కరువు జిల్లా, వలసల జిల్లా వెనుకబడిన జిల్లా అనే విశేషణాలతో జిల్లాను పిలుచుకుంటాము. ప్రగతిపథంలో ఉన్న గొప్ప జిల్లాగా చెప్పుకుందాం. అని అధికారులు, అధికార రాజకీయ నాయకులు అంటున్నారు. కానీ నిజాయితీగా ఆవేదనా భరితమైన పరిస్థితులను మార్చటానికి పూనుకోవటం లేదు.

**నేపథ్యం:**

1947 దాకా ఒక దేశీయ రాజ్యంలో భాగంగా మహబూబ్‌నగర్ అనేక సంస్థానాల కింద, ప్రత్యక్షంగా నిజాముల పాలన కింద ఉండింది. మరీ వెనుకకు పోతే కాకతీయ సామ్రాజ్యంతోను, ఇంకోవైపునించి విజయనగర సామ్రాజ్యంతోను కృష్ణాతీర భూమిగా అనేక యుద్ధాలలో మగ్గిపోయింది. అయినా ఇక్కడి ప్రజలు చాలా శ్రమ చేశారు. జిల్లా వ్యాప్తంగా ఉన్న అనేక ప్రాచీన నిర్మాణాలు ఈ విషయం తెలుపుతున్నాయి. కాకతీయ రాజ్యం నిలదొక్కుకునే నాటికే ఈ జిల్లాలో తవ్వించిన 63 చెరువులు శాసనాలలో నమోదైవున్నాయి. తుంగభద్ర, కృష్ణ, ఊకశెట్టివాగు, దుంధుభి, కాకరవాణి ఇలా అనేక వాగులు వంకల వెంట అనేక గ్రామాలు రూపొందినాయి. ఈ గ్రామాల శ్రమ మీద ఇక్కడి సంస్థానాలు,

---

అభివృద్ధిని నిశితంగా పరిశీలిస్తూనే, దాన్లోని పరిమితులను, దాన్లో రావాల్సిన మార్పులను పాణి నిక్కచ్చిగా చెప్పాడు.

ఇక బయట మనమున్న సమాజానికి, మావోయిస్ట్ పార్టీ నాయకత్వంలో నిర్మాణమవుతున్న సమాజానికి పోలిక చూస్తే ఇక్కడిలా రైతులు ఆత్మహత్యలు, విద్యార్థి ఆత్మహత్యలు, వెలివాడలు, స్త్రీల మీద అత్యాచారాలు, సారాయి హత్యలు లేవక్కడ. అక్కడ పార్టీ నాయకత్వంలో రైతులు తమ పంటకి వారే గిట్టుబాటు ధర నిర్ణయించుకుంటున్నారు. నూతన పద్ధతుల్లో వ్యవసాయం చేస్తున్నారు. ఈ మొత్తం కాలంలో తాగుడు అలవాటును చాలా వరకు ప్రజలతో బందు చేయించడంలో పార్టీ విజయవంతమయింది. మహిళలను సర్కార్ నిర్మాణంలో భాగస్వాములను చేయడంతో పాటు, పాత వ్యవస్థలో ఉన్న రివాజును తొలగించింది. ప్రత్యామ్నాయ వ్యవస్థలో భాగంగా విద్యను సాంస్కృతిక వికాసానికి, వర్గ పోరాటాలను అర్థం చేయించడానికి ఒక సాధనంగా వాడుతుంది. పార్టీ ఇక్కడికి వచ్చిన తొలి నాళ్లలో భాష సమస్య వల్ల గోండీ భాషను నేర్చుకుని ఆదివాసులను వర్గ పోరాటంలో ఎలా భాగం చేసింది చాలా చక్కగా వివరించాడు. జనతన సర్కార్లో ప్రజల పార్టీ నాయకత్వంలో తమ అవసరాలకు అనుగుణంగా తమదైన రీతిలో తమను తాము పరిపాలించుకుంటున్నారు. సమిష్టిగా వారికి అవసరమైన నిర్ణయాలను తీసుకుంటూ వాటిని అమలు చేసే క్రమంలో ఏర్పడే సవాళ్ళను అధిగమిస్తూ అభివృద్ధి చెందుతున్నారు. అక్కడ ప్రజలు తమకు అవసరమైన నిర్ణయాలను వారే తీసుకుంటున్నారు.

ఉత్పత్తి విషయానికొస్తే ఆదివాసులు తమ జీవనానికి సరిపడ మాత్రమే పండించుకుంటారు. మిగులు ఉత్పత్తి చేయాలనుకోవడం వాళ్ళ సంస్కృతిలో భాగం కాలేదు. ఐతే ఈ పరిస్థితిలో ఇపుడిప్పుడే మార్పు వస్తోంది. మొత్తంగా ఇక్కడ పాత ఆచారాలన్నీ రద్దయినాయి అని కాకుండా ఇది వరకటి కంటే కూడా చాలా మార్పు వచ్చింది అన్న విషయం ఇక్కడి ప్రజలు, పార్టీ మాటల్లో మనకు తెలుస్తుంది. రచయిత మాటల్లో చెప్పాలంటే 'నీటి వాలుకు మాత్రమే చేపలు పట్టే అలవాటున్న ఆదివాసులు చెరువుల్లో చేపలు పెంచడం, పశువులు కాసుకునే అమ్మాయి వైద్యం నేర్చుకుంటూ చికిత్స చేయడం, విలుకాడి మాత్రమే ఉపయోగించడం తెలిసిన ఆదివాసులు కొత్త కొత్త తుపాకులు చేతబట్టి సైనిక శాస్త్రం ప్రకారం నడిచే ప్రజా విముక్తి సైన్యంలో పనిచేయడం, వానకురిస్తే విత్తనాలు చల్లేసి చేతికి వచ్చిందే పంట అనుకునే దశ నుంచి నారు మళ్ళు పోసి, సేంద్రియ ఎరువులు చల్లి పంట పండించడం, సంప్రదాయక సంబరాల్లో అనూచానమైన పాట డాక వేసే దశ నుంచి రాజకీయ కర్తవ్యాలకు తగిన కొత్త పాటలు అల్లడం..' మొదలైనవన్నీ ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో భాగంగా చూడవచ్చు.

"పాత వాటికి వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటాలు జరపడం ద్వారా మాత్రమే కొత్తదైన సోషలిజం ఉనికిలోకి రాగుగుతుంది. సమాజంలోని ఒక తరగతి ప్రజలు ఒక్కోసారి పాత పద్ధతులకు మొండిగా కట్టుబడి వుంటారు. మరోసారి ఆ ప్రజలే తమ అభిప్రాయాలను మార్చుకోనూగలరు. కొత్తదారిని అభిమానించగరు'

అని మావో అన్నట్టు అక్కడ ఆదివాసులు పాతవాటికి వ్యతిరేకంగా పోరాటాలు జరుపుతూ మావోయిస్ట్ పార్టీ నాయకత్వంలో ఒక నూతన ప్రత్యామ్నాయ సమాజాన్ని నిర్మించుకుంటున్నారు. ఈ క్రమాన్ని రూపొందుతున్న చరిత్రలో భాగంగా చూస్తూ, ఆ చరిత్రలో భాగం కావాలి. దానికి బయటి సమాజం నుంచి మేధావులు, ప్రజాస్వామిక వాదులు, విద్యార్థులు తమ మద్దతుని ఏదో ఒక రూపంలో తెలియజేయాల్సిన ఆవశ్యకత చాలా ఉంది.



సామంతరాజ్యాలు. వీటిద్వారా కాకతీయులు, కుతుబ్‌షాహీలు, అసఫ్‌జాహీలు సంపదలు కలిగిన ప్రభువులుగా ఒక వెలుగు వెలిగారు. ఇక్కడి ప్రజలు వర్షం మీద, వాగులు, వంకల వెంట గింజధాన్యాలు, తృణ ధాన్యాలు పండించుకునేవారు. ఇక్కడ పండిన వందకు పైగా వడ్ల రకాలను కవులు సీసమాలికలకు ఎక్కించారు.

స్థానిక రాజ్యకేంద్రాలలో ప్రజలు కోటలు, బురుజులు, జలదుర్గాలు, గిరిదుర్గాలు, నిర్మాణంచేసే శ్రమలో మగ్గిపోయారు కానీ వలసలెరుగరు. తెలంగాణ ప్రభుత్వం జరిపిన సర్వేలో లెక్కతేలిన 6000 పైగా చెరువులు, కుంటలు స్వతంత్రానికి పూర్వం ఇక్కడి ప్రజలు నిర్మించుకున్నవే. పేరు జాగీర్లకు, సంస్థానాలకు దక్కినా అవన్నీ ప్రజలు బుక్కెడు బువ్వకు కట్టినవే. మియాసాబు వంటి రాబిన్‌హుడ్స్ తోడ్పాటు ఉండింది.1947 నాటికి బ్రిటిష్ పాలకులు వైదొలిగి విశ్వసనీయులైన దేశీయపాలకులకు పాలనాధికారాలు అప్పగించేనాటికి తెలంగాణ అంతటా చెలరేగుతుండిన వికాస సంచలనం జిల్లాలో అమితంగా ఉండింది. ఆర్య సమాజీయులు, సోషలిస్టులు, భూదాన ఉద్యమకారులు, కమ్యూనిస్టు ఉద్యమం జిల్లాలో ఉండినా కాంగ్రెస్ నడిపిన విలీన పోరాటమే పైచేయిగా ఉండింది. వందలలో వేలలో నాయకులు, కార్యకర్తలు, ప్రజలు పాల్గొన్న అనేక ప్రజా సంచలనాలు జిల్లాలో చెలరేగినాయి. గ్రంథాలయోద్యమం పల్లెలకు విస్తరించింది.

ఈ సంచలనాలకు వ్యక్తీకరణగానే భిన్నరంగాలలో ఎందరో ప్రముఖులు ఎదిగివచ్చారు. బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాప్ రెడ్డి వంటివారు ఒక ఉదాహరణ మాత్రమే. నైజాం రాజ్యంలో ధాన్యం ఉత్పత్తిలో ఎంత మెరుగైన స్థితిని జిల్లా సాధించిందో బట్టల ఉత్పత్తిలోనూ ఆస్థాయిని సాధించింది. చేనేత వస్త్ర ఉత్పత్తికి నెలవైన పల్లెలూ, పట్టణాల వల్ల జిల్లా నైజాం రాజ్యంలో అగ్రస్థాయిలో ఉండిందని పరిశోధనలు నిరూపించాయి.

ప్రకృతి పరంగా భీమ, కృష్ణ, తుంగభద్ర, కాకరవాణి, దుందుభివంటి అనేక పెద్ద, చిన్న నదులు, వాగులున్నాయి. 2.56 లక్షల హెక్టార్ల అడవులున్నాయి. 18,432 చ.కి.మీ. మేర విస్తరించి ఉన్న జిల్లాలో దరిదాపు 40 లక్షలు ఎకరాల సాగుయోగ్యమైన భూములున్నాయి. వర్షపాతం అతిగా చెప్పుకుంటే 604 మి.మీ. కానీ, గడిచిన వంద సంవత్సరాలలో ఎక్కువ సంవత్సరాలు 450 మి.మీ నుండి 550మి.మీ. సగటులోపే వర్షం కురిసింది. ఎర్రనేలలు, నల్లనేలలు, కొంతమేర ఇసుక ఆవరిస్తున్న నేలలూ ఉన్నా అన్ని రకాల పంటలకు అనువైవున్నాయి. పడమర నుండి తూర్పువైపు, ఉత్తరం నుండి దక్షిణానికి వాలి ఉన్న ఈ భూస్వరూపం ఇప్పటికి నిర్మితమైవున్నవి కాక ఇంకా వేలలో చెరువులుకుంటలు నిర్మించుకుని నీరు నిలువుకోవటానికి అనువుగా ఉంది. చిన్నచిన్న గుట్టలన్నింటినీ అద్భుతమైన వృక్షసంపదతో కాపాడవచ్చు. వివిధ రకాలైన భూగర్భ ఖనిజ సంపదకు కూడా కొదవేమి లేదు.

2011 లెక్కలప్రకారం జనాభా 40 లక్షల 50 వేలు కాగా జనసాంద్రత 220. మనకు ప్రకృతి చాలా ఇచ్చింది. ప్రభుత్వాలే మనని వంచిస్తూ వచ్చాయి. జిల్లా కేంద్రం నాగర్ కర్నూల్ నుండి మహబూబ్‌నగర్‌కు అంటే పాలమూరు గ్రామానికి మారిన తర్వాత అమలు జరిపిన పాలనా విధానాలు నెపం వానల మీద నెట్టి, భూస్వరూపం మీదనెట్టి ఈ జిల్లాను కరువు జిల్లాల జాబితాలో దేశంలోనే ప్రముఖస్థానంలో నిలబెట్టాయి.

1948 సెప్టెంబర్ 17 నాటికి పోలీసుచర్య పేరున సైనికచర్య జరిపి హైదరాబాదు రాజ్యాన్ని భారతదేశంలో విలీనం చేసిన తరువాత ఇక్కడి సంస్థానాలు కూడా విలీనమైనాయి. ఆ తర్వాత జె.ఎన్.చౌదరి, వెల్లోడీల నేతృత్వంలోని పాలన తెలంగాణ మీద, తెలంగాణ సాయుధ రైతాంగం మీద యుద్ధాన్ని మానిటర్ చేసిన పాలనగా, నెత్తురు పారించిన పాలనగా మిగిలిపోయింది. 1952 నాటికి ఎన్నికలు జరిగి బూర్గుల రామకృష్ణారావు నేతృత్వంలో ఏర్పడిన ప్రభుత్వం నిజాంపాలనా కాలంనాటి పథకాలు బూజుదులిపే పనికి పూనుకునేలోపే చెల్లిపోయింది. 1956ను తీసుకువచ్చారు. ఆనాటికి అప్పర్ కృష్ణ, భీమ ప్రాజెక్టుల పనులు మొదలైవుండినా పరిస్థితులు భిన్నంగావుండేవి. కానీ, జరిగిందేమిటంటే కాకతీయులకు సామంత పాలకులుండిన ఈ ప్రాంతం, కుతుబ్‌షాహీలకు, అసఫ్‌జాహీలకు సామంత పాలకులు, జాగీర్దార్లు ఉండిన ఈ ప్రాంతం 1948, 1952, 1956 తర్వాత 'సువిశాలదేశంలో'; 'సువిశాల తెలుగురాష్ట్రంలో' భాగమైంది.

పార్లమెంటరీ పాలన తెలిసిన, ప్రజాస్వామ్యం పేరిట పాలకవర్గ ప్రయోజనాలు తెలిసిన, చట్టబద్ధమైనపాలన పేర అమలైన పాలనా విధానాలకు, సూటిగా చెప్పాలంటే పాలకవర్గ అభివృద్ధి విధానాలకు మహబూబ్‌నగర్ జిల్లా బలైంది. వ్యవసాయ అనుబంధ చేతి వృత్తులు, చేనేత, ఉన్ని అనుబంధవృత్తులు దెబ్బతిని జిల్లావలసల జిల్లాగా హైదరాబాదు నీడలు పరచుకున్న జిల్లాగా, శ్రీశైలం ప్రాజెక్ట్ కోరలు పరుచుకున్న జిల్లాగా, సాగునీరులేక బోరుబావుల పెట్టుబడుల కాటుకు గురైన జిల్లాగా, ఆకలిచావులకు, ఆత్మహత్యలకు నెలవైన జిల్లాగా మారింది. ఈ ఏడుదశాబ్దాలుగా రాజ్యాంగబద్ధపాలన చిమ్మిన చీకట్లివి. స్థానిక నేతలు ప్రజలను వదిలి సామంత ప్రభువుల వారసులుగా కొనసాగుతున్న ఫలితమిది.

మహబూబ్‌నగర్ జిల్లానించి 20వ శతాబ్దంలో వికాసం కోసం, ప్రజాస్వామ్యం కోసం కృషిచేసిన నేతలు చాలావరకు కాంగ్రెస్‌లో తమస్థానాలు చూసుకున్నారు. సంస్థానాల అధినేతలు అధికార రాజకీయాలలో కాంగ్రెస్‌లోనే చేరిపోయారు. 1956 తర్వాత ప్రభుత్వాల ప్రాధ్యానతలు డెల్టాప్రాధాన్యతలుగా మారిపోయాయి. జలవనరుల కల్పనకు సంబంధించి నాగార్జునసాగర్ నిర్మాణమైనా, శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణమైనా డెల్టా ప్రయోజనాలకే. నియామకాలు పొందటానికి చదువులస్థాయి సమస్య కాగా, నిధులు పొందటానికి అవసరమైన శక్తికానీ, వ్యక్తిత్వంగానీ స్థానిక నాయకత్వాలు అవసరమైన స్థాయిలో ఉపయోగించలేక పోయాయి.

1952కు పూర్వం తెలంగాణ మీద ప్రసరించగలిగిన పాటి ప్రభావాన్ని 1956 తర్వాత జిల్లానేతలు చూపలేకపోయారు. రాను రాను గుంపు మేస్త్రీలుగా గ్రూపుమేస్త్రీలుగా కాకపోతే ప్రజలను, పశువులను, అడవులను, భూగర్భసంపదను కొల్లగొట్టే శక్తులకు, భూములను కబ్జాచేసే శక్తులకు తోడ్పడే వాళ్ళుగా మిగిలిపోయారు. అంతకుమించితే కమిషన్లతో, పదవులతో, చిన్న చిన్న అధికారాలతో

పై వారి సేవలో తరించిపోయారు. ఈ పరిణామానికి మహబూబ్‌నగర్ జిల్లా బలైంది. కరువును, దుర్భిక్షాన్ని వలసలను, వెనకబాటును చూపించి కేంద్రం నుండి అంతర్జాతీయ సంస్థల నుండి నిధులు తెచ్చుకోవటానికి ఈ జిల్లాను షోకేసుగా మిగిలించారు.

1982 దాకా కాంగ్రెసుపాలనలో ఏమి జరుగుతూ వచ్చిందో 1983 తర్వాత తెలుగుదేశం పాలనలో అదే మరింత జోరుగా జరుగుతూ వచ్చింది. డెల్టాకింద మిగులు పెరిగినట్టల్లా, పెరిగిన మిగులు వ్యవసాయేతరమైన, వ్యవసాయనుబంధ పారిశ్రామికేతరమైన రంగాలలో పెట్టుబడులుగా విశృంఖలంగా ప్రవేశించినట్టల్లా కరువు పీడిత ప్రాంతాలు మరింత పీడనకు, హింసకు గురైనాయి. ఈ వత్తిడులు మహబూబ్‌నగర్‌ను, మహబూబ్‌నగర్ వంటి రాష్ట్రంలోని ఇతర వెనుకబడిన జిల్లాలను కరువు, వలసలకు నెలవైన జిల్లాలుగా మార్చాయి. ఈ విధానాల అమలులో కాంగ్రెస్, తెలుగుదేశం ఒకదాన్ని మించి మరొకటి పోటీపడ్డాయి. దీనికి పార్లమెంటరీ రాజకీయ పార్టీలన్నీ వేర్వేరు సాకులతో ఇతోధికంగా సాయపడ్డాయి.

మహబూబ్‌నగర్ వెనుకబాటు మీద కేంద్రం దృష్టివుంది. కేంద్రం దగ్గర అనేక నివేదికలున్నాయి. కరువు పరిశీలన కోసం తిరిగి ఆపూటకు పనికి వచ్చేలా ఇచ్చిన నివేదికలే కాకుండా, కేంద్ర ప్రభుత్వమే 1970 దశకంలో ఈ జిల్లాతో కలిపి దేశంలోని 05 జిల్లాల పరిస్థితులను, వనరులను ప్రత్యేకంగా అధ్యయనం చేయించింది. ఆ నివేదికలు ఏ అధికార గ్రంథాలయాలలో మాలుగుతున్నాయో తెలియదు. సమస్యలు తెలిసినా, పరిష్కారాలు తెలిసినా పట్టించుకునే ఉద్దేశం లేని గుడ్డిదృష్టి కేంద్రానిది. కేంద్రంలోను అనేక పార్టీలు కాంగ్రెస్, జనతా, ఎన్.డి.ఎ., యు.పి.ఎ. పేర్లతో స్వతంత్రంగాను, కూటములుగాను పాలించాయి. అన్ని ప్రాంతీయ పార్టీలు కాంగ్రెస్, బి.జె.పి.ల నాయకత్వంలో దేశాన్ని ఏలుతున్నాయి. దేశపాలన ఇవాళ సామ్రాజ్యవాద అనుకూల సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాల అమలు అనేమత్తులో నడుస్తున్నది.

'దేశం', 'దేశభక్తి' అనేమాటలను పాలకులే అర్థంలేనివిగా మార్చారు. ఇలాంటి పరిస్థితులలో దేశవ్యాపితంగా వెనుకకు నెట్టేయబడిన ప్రజలు పోరాడుతున్నారు. ఈ పరిస్థితులలోనే మహబూబ్‌నగర్ ప్రజలు తమ జీవన్మరణ పోరాటాలలో తలమునకలవుతున్నారు. విద్య, ఆరోగ్యం, ఉపాధి, వ్యవసాయం, రవాణావంటి రంగాలలో స్థానిక అవసరాలకోసం, వలసలు లేని, అంటరానితనం, అవమానాలు లేని, అత్యాచారాలు లేని గౌరవ ప్రదమైన స్థానిక జీవనం కోసం పోరాడుతున్నారు. జిల్లాలో విస్తరించిన జలవనరుల సాధన పోరాటాలను ఇతర ఉద్యమాలను ఈ నేపథ్యంలోనే అర్థం చేసుకోవాలి.

## జలవనరుల సాధన కృషి :

మహబూబ్‌నగర్ జిల్లా వలసల మీద జరుగుతూ వచ్చిన చర్చ, ఆధ్యయనం, సాగునీటి సమస్యను ఎజెండామీదికి తెచ్చింది. 1969 తెలంగాణ ఉద్యమం మీద అమలైన అణచివేత, హింసవల్ల ఆ ఉద్యమం అప్పటికి చల్లారినా, 1956లో ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావం వల్ల జలవనరుల కల్పనలో జిల్లాకు అన్యాయం జరిగిందనే విషయం రాజు కుంటూ ఉండింది. అప్పర్‌కృష్ణ, భీమ ప్రాజెక్టులు నిర్మాణమైవుంటే 170 టి.ఎం.సి. నీరు జిల్లాలో పారి కనీసం 25 లక్షల ఎకరాల నేల సాగునీరందే నేలగా స్థిరపడి ఉండేదని, సంపదలో, సౌఖ్యంలో డెల్టాతో సరితూగేదని ఈ స్థితి పాలనాధికారంలో జిల్లాను సమఉజ్జీగా నిలిపివుండేదని విస్తృతమైన చర్చ జరిగింది. దీనితో జిల్లాలో అనేక జలసాధన పోరాటాలు చెలరేగాయి. ఇవి అనేక సంఘాలు కలిసి జలసాధన సమన్వయ సమితి పేర ఒక వేదిక ఏర్పరచుకోవటానికి దారితీశాయి.

బుద్ధిజీవులలోను, పార్టీల బంధనాలకు దూరంగా ఉన్న, కష్టాలు అనుభవిస్తున్న ప్రజలలోను చెలరేగిన ఈ చర్చ పార్టీలను ఒక కుదుపుకుదిపింది. ఆనాడు నల్లగొండ జిల్లాలో జరిగిన జలసాధన ఉద్యమం మహబూబ్‌నగర్ జిల్లాకు నూరుశాతం నీరు తీసుకునే హక్కువున్నదని చేసిన చర్చ జిల్లా జలసాధన ఉద్యమానికి ఏమేరకైనా ప్రేరణ ఇచ్చింది. కరువు వ్యతిరేక పోరాటక కమిటి జిల్లా జలసాధన ఉద్యమ సమన్వయం కోసం విస్తృతంగా కృషిచేసింది. సెప్టెంబర్ 1995లోనే అప్పటి ముఖ్యమంత్రికి రాసిన ఒక బహిరంగ లేఖలో "కృష్ణానది నీటిలో మహబూబ్‌నగర్ జిల్లాకు న్యాయమైన వాటా నీరు ఇవ్వకపోతే 2వ దశ తెలంగాణ ఉద్యమం ప్రారంభిస్తామని" జిల్లా జలసాధన సమన్వయ సమితి హెచ్చరించింది.

చిన్నచిన్న ఎత్తిపోతల పథకాలుగా చర్చలో ఉండిన అనేక పథకాలు ఈ ఉద్యమ క్రమంలోనే నిర్దిష్టతను పొందాయి. భీమ, కోయిల్‌సాగర్, కల్వకుర్తి, నెట్టెంపాడువంటి పథకాలుగా చర్చకు వచ్చి ఎక్కడికక్కడా పాలకులను, ప్రభుత్వాలను నిలదీశాయి. ఉక్కిరిబిక్కిరి చేశాయి. ప్రజాందోళనల ఫలితంగానే ఈ పథకాలు హామీలదశకు చేరాయి. ఎన్నికల మేనిఫెస్టోలలో చేరాయి. నందమూరి తారకరామారావు శంకుబండలు పాతి కొంతకాలం, నారా చంద్రబాబు నాయుడు చెట్లు నాటి కొంతకాలం గడిపినా ప్రభుత్వాలు ఈ పథకాలు చేపట్టకతప్పని పరిస్థితిని జిల్లా ప్రజలు కల్పించారు. జిల్లాలో జలసాధన ఉద్యమం పెరిగినట్టల్లా తెలంగాణ ఉద్యమమూ పెరుగుతూ వచ్చింది. 1998లో తెలంగాణ జనసభ ఏర్పడటంతో ఈ కృషి మరింత పెరిగింది. ఇక్కడ పర్యటించిన పౌర స్పందన వేదిక కూలిన దిమ్మెలను, చెట్లులేని గుంతలను చూసింది. ప్రాజెక్టులేమైనాయని అడిగింది.

జిల్లాలో పెరిగిన వలసలవల్లా, పెరిగిన వలసమరణాలవల్ల, కుటుంబాల ఎడబాటు పెరిగింది. పల్లెలు ఖాళీ అయినాయి. కన్నీటి మయమైనాయి. 1980ల తరువాత అధికార రాజకీయాలలో వచ్చిన కుదుపులతో రాజకీయ పార్టీలు కూడా మహబూబ్‌నగర్ జిల్లా జలవనరుల సమస్యను ఏమేరకైనా ఎజెండాగా చేసుకోక తప్పలేదు. కాంగ్రెస్, తెలుగుదేశం వంటి అధికారపార్టీలు ఎన్నికల కాలంలోను, అధికార పార్టీలతో ఎన్నికల ప్రయోజనాల మేరకైనా చెలిమి, వైరుధ్యము అన్నట్టుగా పనిచేసిన భాజాపా, వామపక్షపార్టీలు, బహుజన సమాజ్ పార్టీ న్యూడెమొక్రసీ వంటి మార్క్సిస్ట్ లెనినిస్ట్ పార్టీ, అప్పటికి పీపుల్స్ వార్ పార్టీగా పని చేస్తుండిన మావోయిస్టు

పార్టీ ఒక ప్రధాన ఏజెండాగా ఈ సమస్యపై పనిచేశాయి.

అయినా ప్రధాన రాజకీయ పార్టీల నేతలు పరిష్కార మార్గాల వైపునించి కాకుండా నీళ్ళుపల్లానికి పోతాయని, కృష్ణనదిలో నీళ్ళులేవని ఉన్న నీరంతా జస్టిస్ బచావత్ పంచేశారని, నీటిపోరాటాలు వ్యర్థమని మాట్లాడేవారు. కరువును ప్రకృతి మీదికి నెట్టేవారు. వలసలంటే తామూ వలసపోతున్నామని, వలస చావులంటే చావులు సహజమనీ, విధిరాత అని, రైతుల ఆత్మహత్యలేమిటి.? అంటే మతిస్థిమితం లేని చావులని, ఆకలిచావులెందుకున్నాయి? అంటే ఇంట్లో రేషన్ బియ్యం ఉన్నాయని నోటికి వచ్చింది మాట్లాడేవారు. ప్రజలు, ప్రజాసంఘాలు ప్రత్యేకించి కరువు వ్యతిరేకపోరాట కమిటీ, ఎ.పి.సి.ఎల్.సి. ఈ వాదనతో నిరంతరం తలపడవలసి వచ్చేది. ప్రభుత్వం, అధికార యంత్రాంగం ఈ చర్చను ఘర్షణగా, శాంతి భద్రతల సమస్యగా తలకెత్తుకున్నాయి. తీవ్రమైన హింసను ప్రయోగించాయి.

ఈ సంఘర్షణలోంచి ఒక అవసరంగా గద్వాలలో 27-01-2002న ఒక పెద్ద సభ జరిగి "కృష్ణానదీ జలాల పునఃపంపిణి ఉద్యమం" ఏర్పడింది. రాష్ట్రాలమధ్య పంచిన నీటిని రాష్ట్రప్రభుత్వం హేతుబద్ధంగా, న్యాయంగా జిల్లాల మధ్యకూడా పంచాలని; బచావత్ తీర్పుగడువు ముగిసింది కనుక కొత్తట్రిబ్యునల్ ఆంధ్ర, తెలంగాణ మధ్య అసమానపంపిణీని పరిష్కరించాలనే దాకా చర్చ జరిగింది. తెలంగాణ వ్యాపితంగా ఈచర్చ ఒక ఘర్షణ తీసుకునే స్థాయికి పెరుగుతూండిన కాలంలో, ప్రభుత్వం ఏకపక్షంగా హింసతో నిర్మాణాలను, భావజాలన్ని అణిచివేస్తుండిన కాలంలో, ఆనాటికే ఒక అధికార రాజకీయ అస్తిత్వకాంక్షకు వ్యక్తీకరణగా 2001లో తెలంగాణ రాష్ట్రసమితి కూడా పుట్టింది. పెరిగిన భావసంచలనం తెరాసకు ఓట్లుగా మారుతూ ఒక గుర్తింపునూ తెచ్చింది.

ఈ కాలానికి ముందే నీటిరుచి తెలిసిన జిల్లాలు మరింత శక్తివంతమైన పోరాటాలు చేశాయి. లేదా చేతిలో ఉన్న అధికారాన్ని ఉపయోగించుకున్నాయి. సుంకేసుల, తెలుగుగంగ శ్రీశైలం కుడి కాలువ పనులు వేగమూ, విస్తృతి పొందాయి. రాయలసీమలో, నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో సాగునీటి పథకాలు, నీటిచర్చ, పనులు ఊపందుకున్నాయి. అల్మట్టికి వ్యతిరేకంగా పులిచింతలకు అనుకూలంగా చర్చ పెరిగింది. నల్లగొండ జిల్లాలో శ్రీశైలం ఎడమ కాలువ పనులకై వత్తిడి, నక్కల గండి దగ్గర సొరంగం పనులకైవత్తిడీ పెరిగాయి. ఆ జిల్లాలో జరిగిన పోరాటం ముఖ్యమంత్రుల సభలు జరగనీయని స్థితికి, చెప్పులు, రాళ్ళు రువ్వే స్థాయికి, ఎన్నికలలో పోటీదారుల సంఖ్యపెంచి చీకాకు పరిచేస్థాయికి చేరింది. ఈ పరిణామం ఎ.ఎం.ఆర్. ఎత్తిపోతల పథకాన్ని విజయవంతం చేసుకునే స్థాయికి ఎదిగింది.

ఎ.ఎం.ఆర్ ఎత్తిపోతల జయప్రదం కేవలం ఇటు మహబూబ్‌నగర్ ప్రజలకు, అటు రాయలసీమ ప్రజలకు మొత్తంగానే ఎత్తిపోతల పథకాల సాధన పోరాటాలకు పెద్ద ఊపునిచ్చింది. తెలంగాణ పోరాటం ఎత్తిపోతల పథకాలతో నీరు తీసుకోవటానికి తనగొంతు పెంచటానికి తోడ్పడింది. కృష్ణానదీ జలాల పునఃపంపిణీ ఉద్యమ పర్యటనలలో శ్రీశైలం ప్రాజెక్టు నీటిలో ఎల్లూరు నుండి కల్వకుర్తిదాకా నీరు ఎత్తి పారించుకోగలిగినపుడు జూరాల ఆధారంగా జిల్లాను సస్యశ్యామలంచేసుకోగలమని, జిల్లాలో అత్యంత ఎత్తు ప్రదేశమైన షాద్‌నగర్ దాకా వివిధ స్థాయిల నుంచి నీరు ఎత్తిపోసి మహబూబ్‌నగర్ చరిత్రను మార్చవచ్చునని, ఇదే అమలైతే కృష్ణానదీ జలాల పునఃపంపిణికీ, అన్ని జిల్లాలకు న్యాయమైన నీరు వాటాకు కృష్ణాడెల్టా అంగీకరించక తప్పని పరిస్థితి వస్తుందని చర్చ జరిగింది. పుచ్చలపల్లి సుందరయ్య డెల్టాకు నీరు తగ్గించి మహబూబ్‌నగర్‌కు ఇవ్వాలన్నారు.

మహబూబ్‌నగర్ జిల్లాకు జస్టిస్ బచావత్ ట్రిబ్యునల్ న్యాయం చేయలేదు. అట్లా న్యాయం చేసే విధానాలను కేంద్ర ప్రభుత్వం ట్రిబ్యునల్ పరిశీలనకు ఇవ్వలేదు. కట్టిన ప్రాజెక్టులకు, అమలులో ఉండిన ఆయకట్టుకు నీటి భద్రత ఉండే విధంగా రాష్ట్రాల మధ్య ప్రభుత్వాల విజ్ఞప్తులు పరిశీలించి నీరు కేటాయించాలని సూచించినందు వల్ల ఆంధ్రప్రదేశ్ నీటివాటాగా కేటాయించిన 811 టి.ఎం.సిలలో అప్పటికి అమలులో ఉండిన ఆర్.డి.ఎస్‌కు 15.9 టి.ఎం.సిలు 87,500 ఎకరాలకు, ప్రత్యేక ప్రాతినిధ్యంతో జూరాలకు 17.84 టి.ఎం.సిలు 1 లక్ష 2వేల ఎకరాలకు, కోయిల్‌సాగర్ పేరున మరొక 4.5 టి.ఎం.సిలు మాత్రమే కేటాయించింది. 1980ల తరువాత కృష్ణాడెల్టా ఆధునీకరణలో భాగంగా ఆదా అవుతాయని అంచనావేసిన నీటిలోంచి భీమా ప్రాజెక్టు కోసం 20 టి.ఎం.సిలు కేటాయించారు. జూరాల ప్రాజెక్టు పనులు 1981లో మొదలుపెట్టి రెండున్నర దశాబ్దాల పాటు కడుతూనే వచ్చారు. ఈ నాటికీ పూర్తి కాలేదు. పూర్తి ఆయకట్టుకు నీరు ఇవ్వటం లేదు. మధ్యలో ఆర్.డి.ఎస్ నీటి వాటా సాధించలేక తెలుగుదేశం ప్రభుత్వం జూరాల కుడికాలువను ఆర్.డి.ఎస్‌కు లింకు చేసే ప్రతిపాదన తెచ్చి పనులు ప్రారంభించింది. ఇంకోవైపు కె.సి.కాలువ కోసం ఆర్.డి.ఎస్ లాగా దెబ్బతిన్న సుంకేసులను భారీ ప్రాజెక్టులాగా నిర్మించే పనుల వేగం పెంచింది. ఈ ప్రాజెక్టును కాంగ్రెస్.టి.డి.పి. పోటీపడి పూర్తి చేశాయి. కానీ, ఆర్.డి.ఎస్‌ను ఒక శిథిల సమాధిగా మార్చారు. నిర్మాణం పూర్తైన తొలి మూడు దశాబ్దాలు తప్ప ఇప్పటికి మూడు దశాబ్దాలుగా 30 వేల ఎకరాలకు మించి నీరందటం లేదు. చేపలు నీటికి ఎదురెక్కి వచ్చినట్టుగా రాజోలిబండ మళ్ళింపు పథకం కాలువల కింది భూముల మీదికి వచ్చిన ఆంధ్రప్రాంత రైతాంగం వడ్డేపల్లి మండలంలో శాంతినగరాలు నిర్మించుకున్నది. కాలువలో నీరురాని పరిస్థితి వీరిని కూడా కలవరానికి నెట్టింది.

1955 నాటికే నిర్మాణమైన ఆర్.డి.ఎస్ నిజాం రాజుల దయాధర్మాలతో రాలేదు. ఈ నాటి మండల కేంద్రం ఐజలో రైతాంగం గద్వాల సంస్థానం మీద లెవీకి వ్యతిరేకంగా పోరాడారు. లెవీ కట్టలేమన్న రైతుల నెత్తుటి త్యాగాల మీద ఆర్.డి.ఎస్ వచ్చింది. ఆర్.డి.ఎస్ స్థితిమీద పోరు చెలరేగినపుడల్లా ప్రభుత్వాలు కమిటీలు వేసి నివేదికలు తెప్పించి బుట్టలో వేశాయి. కనీసం డెబ్బై పరిశీలనలు జరిగాయి. ఇసుక మేట వేసినా, కట్టదెబ్బతిన్నా, నిర్మాణకాలపు స్లూయిస్ బద్దలు కొట్టి నీరు తరలించినా ప్రభుత్వం చూస్తూ కూర్చున్నది. కర్నూలు రైతులు, గద్వాల, అలంపూర్ రైతులు కత్తులు, రాళ్ళతో తలపడే పరిస్థితి కల్పించింది. ఆర్.డి.ఎస్‌కు సంబంధించిన

ఆంధ్రప్రదేశ్ చరిత్రంతా రైతాంగాన్ని మోసగించిన చరిత్రే.

భీమా ప్రాజెక్టు పనులు మొదలు కావటానికే రెండు దశాబ్దాల పైన కాలం తీసుకున్నారు. ఇప్పటికీ ఫేజ్1,ఫేజ్2లలో ఎక్కడా భూమికి నీరివ్వటంలేదు. కోయిల్‌సాగర్ ఎత్తిపోతల పరిస్థితీ ఇదే. జలయజ్ఞంలో భాగంగా వేగంగా పూర్తి చేస్తామన్న ఈ పథకాలు, 10 ఏండ్లు గడిచినా ట్రయల్‌రన్‌దశ, మొదటి స్టేజిలో ఒక పంపు పనిచేయించే దశ దగ్గరనే తీసుకుంటున్నాయి.

**జలయజ్ఞం కొన సాగుతూ ఉంది...**

తెలంగాణ వ్యాపితంగా చెలరేగిన ప్రజాందోళనలను, వాటి వెనుక ముందుకు వచ్చిన డిమాండ్లను తన విధానాలకు అనువుగా మలచుకుని, అనేక నినాదాలు, హామీలు ఇచ్చి తెరాసతో జట్టుకట్టి అధికారానికి వచ్చిన రాజశేఖర్‌రెడ్డి కాంట్రాక్టర్ల ప్రయోజనాలతో మేళవించి జలయజ్ఞం పనులైతే ప్రారంభించాడు. కానీ, మహబూబ్‌నగర్‌లో ఏచిన్న పథకాన్ని కూడా రెండేండ్లలో పూర్తి చేసేదిగా చేపట్టలేదు. ఆర్.డి.ఎస్‌ను పట్టించుకోలేదు. సుంకేశులను జాతికి అంకితం చేశాడు. ఎత్తిపోతల పనుల ప్రారంభానికే మురిసిపోయిన నేతలు పనులు పూర్తి చేయడానికి అంతగా కృషి చేయలేదు. తరువాతి రోజుల్లో శంకుబండల మీద పేర్లకోసం ఆదరాబాదరా నీరుదుంకించారు. ఇంకా ఏ ఒక్క ఎత్తిపోతల పనులు కూడా పూర్తి కాలేదు. తెలంగాణ వచ్చింది. తెరాసకు అధికారం వచ్చింది. 20 నెలల కాలమూ గడిచిపోతోంది.

తెలంగాణ ఉద్యమకాలమంతా మహబూబ్‌నగర్ కథను తెలంగాణ ఉద్యమం నోటి పాటగా పాడింది. ఎంతో తెలిసిన తెరాస పార్టీ, ప్రభుత్వం కేంద్రీకరించి పదేండ్లుగా పనులు కొనసాగుతూ వచ్చిన ఈ ప్రాజెక్టులను వెంటనే పూర్తి చేయకుండా ఇంకా సాగదీస్తూ ఉంది. ఈ పథకాలు నిజంగా పూర్తి కావాలంటే అన్ని పంపులు పని చేయాలి. అన్ని స్థాయిలలో ఎత్తిపోతల నిర్మాణాలు, విద్యుత్తు పనులు పూర్తి కావాలి. పూడుక పోయిన కాల్వలు మళ్ళీ తవ్వాలి లైనింగ్ చేయాలి. కాలువలు పారే విధంగా ఎత్తిపోసిన నీరు నిలువ చేయటానికి అవసరమైన రిజర్వాయర్లు నిర్మించాలి. 35 టి.ఎం.సి.లనీరు ఎత్తిపోసే కల్వకుర్తి ఎత్తిపోతల పథకంలో భాగంగా ఎక్కడా కొత్తగా ఒక్క రిజర్వాయర్ కూడా నిర్మించలేదు.

ఈ విషయం ప్రభుత్వానికి తెలుసు అధికారులకు, ఇంజనీర్లకు, జిల్లా నేతలకు తెలుసు. ఎవ్వరూ మాట్లాడరు. ఇలాంటి పరిస్థితి నడుమ కల్వకుర్తి ఎత్తిపోతల పథకమైనా, ఇతర పథకాలైనా ఎప్పటికి పూర్తవుతాయి.? ఈ ఆర్థిక సంవత్సరం కేటాయించిన నిధులు రు. 658 కోట్లలో రు. 145 కోట్లే ఖర్చు చేశారు. ఇది దేనికి సంకేతం? తెరాస ఊహాజనిత బడ్జెట్ మహబూబ్‌నగర్‌పై దాడి చేసిందా?

కల్వకుర్తి ఎత్తిపోతల పథకాన్ని తొలుత రెండున్నర లక్షల ఎకరాలకు నీరందించటానికి నిర్మాణ పనులు మొదలు పెట్టారు. ప్రజల డిమాండు సాధ్యమయ్యే అవకాశాలు చూసిన మీదట ఈ పథకం స్థాయిని మూడున్నర లక్షల ఎకరాలకు పెంచారు. పెంచే సందర్భంలో అచ్చంపేట నియోజకవర్గంలో వంగూరు, బల్మూరు మండలాల ఆయకట్టు తగ్గించారు. అవకాశాలున్నప్పటికి తాగునీటికే కటకటవున్న అమ్రాబాద్ మండలాన్ని పట్టించుకోలేదు. ఎన్నికల సందర్భాలలో ధారవాగు, మానువడ్డవాగు పథకాలు చేపడతామని నమ్మబలుకుతూ ఓట్లు గడిచిపోగానే హామీలకు తూట్లు పొడుస్తూవచ్చారు. అమ్రాబాదు మండల ప్రజల నీటి తిప్పలును పాలకులు, అవకాశవాద ఇంజనీర్లు కొందరు మరోరకంగా ఉపయోగించుకుని స్థానిక ప్రజల మధ్య వివాదాలకు, అంతర్గత వైరుధ్యాలకు తెరతీశారు.

ఆర్.డి.ఎస్ కట్ట దగ్గర కుర్చీవేసుకుని కూర్చుని మన వాటా నీరు సాధిస్తామని ఈ పనిగత కాలపు "దద్దమ్మ ప్రభుత్వాలకు" సాధ్యం కాలేదని ఉద్యమ నేతగా కె.సి.ఆర్ ప్రకటించారు. ఈ ఇరవై నెలలలో మూడు పంటల కాలం గడిచింది. తుంగభద్ర పొంగిపొర్లింది. కాలువలోకి నీళ్ళురాలేదు. రైతుల వలసలు, ఆత్మహత్యలు పరిస్థితి తీవ్రతను హెచ్చరిస్తున్నాయి. అయినా ప్రభుత్వం నుంచి స్పందనలేదు. మహబూబ్‌నగర్ జిల్లా నీటి గాథ కన్నీటి గాథగా మిగలవలసిందేనా?

ఈ స్థితి ఇట్లా ఉండగా గత మూడు సంవత్సరాల నుండి ఆర్.డి.ఎస్ కాలువకింద భూముల సాగుకోసం సుంకేశుల లోపలి నుంచి తుమ్మిళ్ళ ఎత్తిపోతల పథకం ప్రతిపాదన ముందుకు వచ్చింది. ఎవరైనా వింటే నవ్విపోతారు. సమర్థమైన ప్రభుత్వం ఉంటుంది. కోర్టు కేటాయించిన నీటి వాటా ఉంటుంది. అమలు కాదు. కోర్టు తీర్పు అమలును ప్రభుత్వం పట్టించుకోదు. కోర్టు దానికదే ఏమీ చేయదు. గ్రావిటీతో నీరు పారించే భూములకు కూడా ఎత్తిపోతలు చేపట్టాలని ప్రజలు మొత్తుకునే దుస్థితి కలుగుతుంది. ఇంతలో గుండ్రెవుల నిర్మాణం చేపట్టాలనే చర్చ తెరమీదికి తెచ్చారు. ఆ ప్రాజెక్టు వల్ల నష్టం అనే విషయమే అర్థం చేసుకోరు. ఇంకోవైపు ప్రైవేటు సర్వే కంపెనీలు, కంట్రాక్టు కంపెనీలు పండుగ జరుపుకుంటుంటాయి.

ఆర్.డి.ఎస్ వ్యథ ఇలా ఉండగా భీమా ఫేజ్ 1 పనులు ప్రారంభమైన తరువాత, కోయిల్‌సాగర్ ఎత్తిపోతల పథకం పనులూ మొదలైన క్రమంలో నారాయణపేట ప్రాంత ప్రజలు జయమ్మ చెరువు ఎత్తిపోతల పథకం చేపట్టాలని విజ్ఞప్తులు చేశారు. దాన్ని కొడంగల్‌దాకా విస్తరించాలని పోరాడారు. నారాయణపేట-కొడంగల్ ఎత్తిపోతల పథకం చేపడతామని ప్రభుత్వం ఉత్తర్వులు కూడా ఇచ్చింది. పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకంతో ఈ భూములకు కూడా నీరందుతుందని తెరాస ప్రభుత్వం నారాయణపేట - కొడంగల్ ఎత్తిపోతల పథకాన్ని పక్కకు తోసేసింది.

ఆతరువాత ఏకంగా పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని పడమరనించి తూర్పు మహబూబ్‌నగర్‌కు మార్చింది. ఈరెండు నియోజక వర్గాల ప్రజలు తీవ్రమైన ఆందోళనకు గురై మేంపోరాడి సాధించుకున్న పథకాన్ని అమలు చేయాలని మరల పోరుబాట పట్టారు. ప్రభుత్వం నుంచి సరైన స్పందన లేదు.

జిల్లా నీటి పారుదల పథకాలన్నింటిలోకి పాలమూరు-రంగారెడ్డి పథకానిది తెలంగాణ ఉద్యమమంతలోతైన గాథ. మహబూబ్‌నగర్ భవిష్యత్తును బాగుపరుచుకోవటానికి పెద్దఎత్తున

మద్దతు నిర్మించి జిల్లా ప్రజలందరూ తలపడిన వీరగాథ.

## పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల...

పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకం పేరు రూపొందటం వెనుక కూడా పెద్ద కథేవుంది. కృష్ణానదీజలాల పునఃపంపిణి ఉద్యమ సందోహంలో శ్రీశైలం ప్రాజెక్టు నుండి కల్వకుర్తికి నీరు చేరే పథకంలాగా జూరాల నుండి షాద్‌నగర్‌కు నీరు తరలించి.జిల్లాను సస్యశ్యామలం చేసుకోవాలనే ఆలోచన పుట్టి పెరిగింది కదా ! ఇతర ఎత్తిపోతల పథకాలలాగానే దీనికీ రిటైర్డ్ ఇంజనీర్లు, ఇతర ఇంజనీర్ల పూనిక తోడైంది. ఒక నమూనా రూపొందింది. కొంత మేర ప్రచారమూ జరిగింది. ఆ తరువాత ఉద్యమ కార్యాచరణ కోసం కూర్చున్నపుడు జరిగిన చర్చ ఈ పథకానికి పాలమూరు ఎత్తిపోతల అనే పేరును ముందుకు తెచ్చింది.

కృష్ణానది వరదలెత్తే కాలంలో రోజుకు రెండు టి.ఎం.సి.ల నీరు ఎత్తిపోసి 35 రోజులపాటు 70 టి.ఎం.సి. ల నీరు కోయిల్ సాగర్, (కోయిల్‌కొండ), మహమదాబాద్, గండీడు, లోకిరేవు, లక్ష్మీదేవి పల్లిలలో రిజర్వాయర్లు నింపి మహబూబ్‌నగర్‌లో ఏడు లక్షలు, రంగారెడ్డిలో రెండు లక్షల డెబ్బేవేలు, నల్లగొండ జిల్లాలో 30వేల ఎకరాలకు నీరందించాలనేది ఈపథకం ఉద్దేశం. ఇంతకు మునుపు చేపట్టిన భీమ, కల్వకుర్తి, నెట్టెంపాడు, కోయిల్‌సాగర్ పథకాల కింద సాగునీరందని ప్రాంతాలకు నీరందే మార్గం ఈ పథకం.నాలుగు ఎత్తిపోతల పథకాలు కలిసి ఎనిమిది లక్షల ఎకరాలకు నీరందిస్తాయని అంచనాకాగా ఈ ఒక్క పథకమే ఏడు లక్షల ఎకరాలకు నీరిస్తుందని అంచనా. నీటిపంట అయితే ఒక టి.ఎం.సి. ఆరు వేల ఎకరాలకు, ఆరుతడి పంట అయితే ఒక టి.ఎం.సి పదిహేను వేల ఎకరాలదాకా నీరందుతుందని ఇంజనీరింగ్ నిపుణులు, ప్రభుత్వం చెబుతున్నమాట. అందువల్ల జిల్లాలోని 38 మండలాలకు నీరందించే ఈ పథకానికి 'పాలమూరు లేబరు' గుర్తుగా పాలమూరు ఎత్తిపోతల అని పేరు పెట్టడం బాగుంటుందని చర్చ జరిగి ఆమోదంపొంది ప్రచారమైంది.

రంగారెడ్డి జిల్లాకు సాగునీటి కల్పనలో చాలా అన్యాయం జరిగింది. మహబూబ్‌నగర్ జిల్లా దుందుభి నదిని నల్లగొండకు త్యాగం చేయగా, రంగారెడ్డి జిల్లా మూసీనదిని నల్లగొండకు త్యాగం చేసింది. ఇతర నీటి వనరులను హైదరాబాదు తాగునీటికి త్యాగం చేసింది. రంగారెడ్డి జిల్లాలో ప్రభుత్వ లెక్కల ప్రకారం పదకొండు శాతం భూమికే సాగునీరుంది. అదైనా చిన్నచిన్న నీటి వనరుల కింద మాత్రమే. రంగారెడ్డి జిల్లాకు ఈ పథకం తోడ్పడుతుంది కనుక ఆ రైతాంగంలోను విశ్వాసం పెంచే విధంగా దీనికి రంగారెడ్డి జిల్లా పేరును కూడా జోడించి పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకంగా పిలుచుకోవటం, ఆ పేరుకు వ్యాప్తిరావటం వెంటవెంట జరిగాయి. అనేక ప్రచార ఆందోళనల వల్ల, ఉద్యమాల వల్ల ఇది సాధ్యమైంది.

మహబూబ్‌నగర్, రంగారెడ్డి జిల్లాలలో జరిగిన తెలంగాణ ఉద్యమ ఆచరణలో అడుగడుగునా ఈపథకం ఒక నినాదంగా రాజుకున్నది. అన్ని రాజకీయ పార్టీలు దీనిని తమ కార్యాచరణలో భాగం చేసుకున్నాయి. ఈ పరిస్థితిని పాలమూరు అధ్యయనవేదిక, తెలంగాణ రిటైర్డ్ ఇంజనీర్ల ఫోరమ్, మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల సంఘం, తెలంగాణ జర్నలిస్టు సంఘం, తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ ప్రజాఫ్రంట్, తెలంగాణ జెఎసి, ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక, విద్యార్థి సంఘాలు పూనికతో కల్పించారు.

తెలంగాణలోనైనా ప్రత్యేకించి మహబూబ్‌నగర్ జిల్లాలో నయితే అన్ని ఎత్తిపోతల పథకాల్లోకీ విశిష్టమైంది ఈ పథకం. జిల్లా పడమటి ప్రాంతంలో, ఎత్తైన జూరాల గర్భంలోంచి మరింత, మరింత ఎత్తుకు నీరు ఎత్తిపోస్తు క్రమంగా 675 మీటర్ల ఎత్తులో ఉన్న లక్ష్మీదేవిపల్లి రిజర్వాయర్‌కు తరలించే క్రమంలో దారి పొడవునా సాధారణ స్థాయి రిజర్వాయర్లను బాలెన్సింగ్ రిజర్వాయర్లుగా ఉపయోగించుకుంటు చెరువులు, కుంటలు నింపుతు, వాగులు రీచార్జ్ చేస్తూపోతే వర్షాకాలమే కాక ఇతర కాలాలలో కూడా వదిలిన నీటితోనో, జాలు నీటితోనో వాగులన్నీ కళకళలాడతాయని, వాగంచు సాగు పుంజుకుంటుందని, పశువులు, పక్షులు బాగా బతుకుతాయని, నీటి పారకం వల్ల బీడు భూములు, వాగుల వెంట నేలలు పచ్చదనంతో నిండి పర్యావరణం కాపాడబడుతుందని విస్తృతమైన చర్చజరిగింది. ఏడు లక్షల ఎకరాలకు నీరందితే ఎకరాకు ఒక మనిషి చొప్పునైనా వలసలు ఆగుతాయని ఆశ.

దిగువన డిండి కోసం, శ్రీశైలం, నాగార్జునసాగర్‌ల కోసం జిల్లాలో ఎగువన చెరువులు, ప్రాజెక్టులు కట్టటానికి వీల్లేదని ఒకప్పుడు ప్రచారం జరిగింది. నీరు పల్లానికి మాత్రమే పోతుందంటే ప్రజలు ఇది నిజమేననుకున్నారు. పెరిగిన శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం మీద నమ్మకం లేని పాలకులు చేసిన తప్పుడు ప్రచారాన్ని ప్రజలు నమ్మారు. ఇది కర్మ అంటే అదృష్టమంటే ఎదురడగలేక పోయారు. సంక్షేమ పథకాలతోనో, వలసపోయి బతుకు జీవుడా అనుకోవటమో తప్ప మార్గం లేదనుకున్నారు. దేశమంతటా కాలువలు తవ్విన ప్రజలకు సాగునీటి కాలువలు లేవు. రాజమార్గాలు పరచిన ప్రజలకు బతుకు మార్గాలు లేవు. నిర్మాణాలు చేసిన ప్రజల బతుకులకు నిర్మాణాత్మక భవిష్యత్తు లేదు. విస్థాపనే ఏకైక మార్గమైంది. విధ్వంసమే జీవితమైంది.

(మిగతా వచ్చే సంచికలో...)



# గల్పికలు - అల్పికలు

బమ్మిడి జగదీశ్వరరావు

## నువ్వు... నేను

'సంకల్ప దీక్ష'లో చంద్రబాబు ప్రధానంగా కె.సి.ఆర్.ని టార్గెట్ చేస్తూ మాట్లాడాడు.

లైవ్‌లో చూసిన గులాబీ తమ్ముళ్ళు 'బాబు దీక్షల గూడ కె.సి.ఆర్.ని తల్వకుంట లేదు...' సంతోషపడ్డారట!

నల్గొండ సభలో కె.సి.ఆర్. చంద్రబాబునుద్దేశించి సమాధానంగా 'నువ్వేం అమాయకునివి కాదు, బుట్టలో ఏస్తే పడనీకి. ఏం మాట్లాడతావ్... అడ్డంగా దొరికిపోయి కూడా మాట్లాడుతున్నావ్... సిగ్గు లేదూ? నువ్వు దొరికిన దొంగవి...' మాట్లాడాడు.

లైవ్‌లో చూసిన పసుపు కండువా తమ్ముళ్ళు కూడా కె.సి.ఆర్. మాటకు సంతృప్తి పడ్డారట?

'నువ్వు దొరికిన దొంగవి...' అని కె.సి.ఆర్. అంటే దానర్థం 'నేను దొరకని దొంగని... అనే గదూ?' అని స్వయం సంతృప్తి పడ్డారట!

## అలా మొదలైంది!

'ఓటుకు నోటు - ఓటుకు కోట్లు' దుమారం చెలరేగాక చంద్రబాబు తన అంతరంగికుల్ని పిలిచేరట. పిలిచి ఇలా చెప్పేంట...

'నన్ను ఎవరూ కలవొద్దు, ఎవర్నీ కలవనివ్వొద్దు' అని!

'ఎందుకలా?' ఎవరో గుసగుసలాడారట.

'ఏం లేదు, జైలు జీవితం ఇప్పట్నుంచే ప్రాక్టీసు చేస్తున్నారు...' మరెవరో చెవి కొరికారట!?

## వాటీజ్ గంగిరెద్దు?

'గవర్నరు గంగిరెద్దులా తలాడిస్తున్నారు... తెలంగాణ ప్రభుత్వానికి వత్తాసు పలుకుతున్నారు...' నాలుక కరచుకోకుండా అనేసాడు అచ్చెం నాయుడు.

'వాటీజ్ గంగిరెద్దు?' అని గవర్నరు గారు అర్థం కాక వాకబు చేసారట!?

'గంగి-రెద్దు-ఎద్దు- ఆవు హజ్బెండ్-డూడూ బసవన్న - అయ్యగారికీ దండం పెట్టు... అమ్మగారికీ దండం పెట్టు...' అని ఎన్నో రకాలు అర్థం చేయించాలని అభినయం చేసి విఫలమయ్యారట భవన్ సిబ్బంది.

అక్కడితో అయిపోలేదట. గంగిరెద్దుల వాడ్ని ఏకంగా ఎత్తుకొచ్చి ముందు నిలబెట్టేరట. అయినా గవర్నరు గారికి అర్థం కానే కాలేదట.

అన్నీ విన్న మీదట 'లైక్ అచ్చెం నాయుడ్జీ...' అన్నారట గవర్నరు.

ఈసారి సిబ్బందికి అర్థం కాలేదట!?

అప్పుడు గవర్నరు అర్థమయ్యేలా చెప్పేరట, 'చంద్రబాబు గంగిఎద్దులవాడు... టక టక ఢమరుకం ఆడించేవాడు... అతని ముందు అచ్చెం నాయుడేం చేస్తాడు? చెప్పిన దాన్కి తలాడిస్తాడు. లైక్ గంగిరెద్దు...'

'యా... యా...' అన్నారు సిబ్బంది... అయ్యవారికి అర్థమైందన్న ఆనందంతో!

## నిద్ర ముఖాలు

సెక్షన్ 8 అవసరం లేదని - అలాగే ఫోన్ ట్యాపింగ్ తీవ్రమైన నేరమని రెండు రాష్ట్రాలను వారి నాయకత్వాలను ఉద్దేశించి పవన్ కళ్యాణ్ రియాక్టయ్యాడు. రీ రియాక్టయిన రెండు తెలుగు రాష్ట్రాల నాయకులు భగ్గుమన్నారు.

'ఆరు నెలలకోసారి నిద్రలేచి కనబడే పవన్ కళ్యాణ్ మాకు చెప్పాల్సిన అవసరం లేదు' అన్నారు. ఈ అభిప్రాయాలలో రెండు రాష్ట్ర నాయకులది ఏక అభిప్రాయమే!

ప్రజాభిప్రాయం మాత్రం వేరుగా ఉంది?

'తనూ మీలా నాయకుడయితే - ఆరు నెలలకు నిద్ర లేవడం మానేసి ఎంచక్కా మీలా అయిదేళ్ళకే నిద్రలేస్తాడు!'

## వ్యాపారం

'...తెలంగాణ ఎం.పి.ల్లా కాదు, ఆంధ్రా ఎం.పి.లు వ్యాపారులు. వాళ్ళ వ్యాపారాలు చూసుకుంటున్నారు. రాష్ట్రానికి ప్రత్యేక హోదా కోసం ప్రయత్నించడం లేదు...' పవన్ కళ్యాణ్ మాటకు 'మేం వ్యాపారాలు చెయ్యకూడదని రాజ్యాంగంలో ఉందా?' సుజనా చౌదరి మండి పడ్డాడు. 'పవన్‌కు సరైన సమాచారం లేదు' అన్నారు కొందరు. 'అతనికి రాజకీయాలే తెలీవు' అన్నారందరూ!

'ఎందుకు తెలీవు?' అని అభిమానులు ఆర్యూ చేసారు!

'ఏం? రాజకీయాలు వ్యాపారం కాదేటి?' అని జనం అడిగేసరికి అభిమానులు గుప్‌చుప్ అయిపోయారట!?

## రోలు - మద్దెల

మూ ముసల్ది మూలకూర్చున్నది కూర్చోక - 'ఈ వయసులో నేనేం పాడుస్తాను?' అని ఆగ(లే)క సామెత పాడిచింది. ఏదో గొణుక్కుంటూ.

'రోలొచ్చి మద్దెలతో మొరపెట్టుకున్నట్టుంది' అంది.

'అంటే?' అన్నాడు, ఇంటరు మంచి మార్కులతో పాసయిన నా కొడుకు.

'నీ చదువు సంతకెల్లా...' అని ముసల్ది మళ్ళీ తిట్టింది.

మావాడు నా వైపు చూసాడు. అర్థం చేయించమన్నట్టు.

'రోలంటే... మావాడు అడగనే అడిగాడు. విని ముసల్ది పుసుక్కున నవ్వింది.

'రోలంటే... ఊఁ... చంద్రబాబు' అన్నాను. అప్పటికప్పుడు అంతకన్నా తాజా ఉదాహరణ ఇవ్వడం నాకు చేత కాలేదు. ఓటుకు నోటు వ్యవహారం మావాడికీ తెలును గనుక అర్థం చేసుకుంటాడనుకున్నాను. ఇంతలో ముసల్ది 'దంచుతారు గదా... అదే రోలు...' అంది, అర్థం చేసుకోవడానికి సాయపడుతూ.

'దంచేది కె.సి.ఆర్....' అన్నాడు అంతా అర్థమయిపోయినట్టు నా కొడుకు.

'మరి రోలు వెళ్ళి మద్దెలతో మొరపెట్టుకోవడమెంటి?' మళ్ళీ అడిగాడు. ముసల్ది మళ్ళీ నవ్వింది.

'ఓటుకు నోటు వ్యవహారంలో రేవంత్‌రెడ్డి దొరికిపోయాక, ఫోన్‌లో బాబు మాటలు మీడియాలో వచ్చాక, గవర్నర్ చెప్పినట్టు సహకరించకుండా పోయాక, సెక్షన్ 8 అమలు కాకపోయాక, ఏ దిక్కూ లేకపోయాక... యేం చేసాడు? ఢిల్లీ వెళ్ళాడు - మోదీని కలిసాడు. చెప్పాడు. ఏడ్చాడు...' నే చెపుతుంటే, 'ఆపకుండా దంచేది రోలు... అని అర్థమయిందిలేనాన్నా' అన్నాడు. ఇక మద్దెల గురించి చెప్పమన్నట్టు...

'అప్పుడు... మోదీగారేమన్నారూ? లలిత్ మోడీకి సాయం చేసి కాపాడిన మా కేంద్రమంత్రి సుష్మాస్వరాజూ... మరోపక్క మా రాజస్థాన్ సిఎం వసుంధరా రాజేల వల్ల నాకు రెండు పక్కల దంపుడే - అని అని, బాబ్బాబూ నన్నొదిలే... అని మోడీ ఏడ్చాడట...' చెప్పబోతే -

ఇంకా అర్థం కాలేదనేమో - 'రోలుకు ఒక వైపే దరువు, మద్దెలకు రెండు వైపులా కిందా మీద దరువే...' - అది మా ముసల్ది.

'రోలొచ్చి... ఎక్కడికొచ్చి... ఢిల్లీకొచ్చి... మద్దెలతో... మోడితో... మొరపెట్టుకుంది... పాపం రోలు బాధ రోలుది... మద్దెల బాధ మద్దెలదీ... అర్థమయినట్టు నవ్వాడు మావోడు.

'మద్దెలది మరీ బాధ...' అంది గొణుగుతూ ముసల్ది!

## గవర్నరు గారి నవ్వు!

'గవర్నరుగారు ధృతరాష్ట్రుడిలా ప్రవర్తిస్తున్నారు...'

వొకరిద్దరు మంత్రులూ ఎమ్మెల్యేలూ సెక్షన్ ఎయిట్‌ని కాదన్నందుకు మండిపడ్డారు.

పేపర్లో టీవీలో చూసి విని గవర్నరు గారు తనలో తానే నవ్వుకున్నారట.

ఆ నవ్వుని చూసి ఆయన గారి వ్యక్తిగత సహాయకులు ఇలా అనుకున్నారట.

'కోపమొచ్చినప్పుడు నవ్వడం... శంకర్ దాదా యంబీబియస్సు సినిమాలో పరేశ్‌రావాల్‌ని ఫాలో అవుతున్నారేమో...' అన్నాడొకడు.

'నీకు ధృతరాష్ట్రుడంటే తెలుసా?' అని అడిగాడు రెండోవాడు.

'కౌరవులకు తండ్రి గదా?' నాకెందుకు తెలీదన్నట్టు చూసి 'కళ్ళు లేని కబోది' అన్నాడు మొదటివాడు.

'నేనేనా?, మన రెండు రాష్ట్రాల... ఆ మాటకొస్తే దేశంలో ఉన్న నాయకులందరూ ధృతరాష్ట్రులే!'నని అందుకు నవ్వుతున్నారు...' నిర్వచనమే చెప్పాడు ఇంకొకడు.

గవర్నరు గారే కాదు. ఆయన సహాయక సిబ్బంది కూడా నవ్వకోవడం మొదలెట్టారు!

## దొంగ సన్నాసులు

దొంగలున్నారని తెలుసు!

తెలిసీ కళ్ళు తెరిచీ నిద్రపోయారు జనం!

చూసాడో దొంగ!

తీసాడో దొంగ!

ఆ దొంగలిద్దరూ ఒకర్ని చూసి ఒకరు ఉలిక్కిపడ్డారు.

'దొంగ...' తిట్టాడో దొంగ.

'దొంగ...' తగ్గలేదో దొంగ.

నువ్వు దొంగ... అంటే... నువ్వు దొంగ అన్నట్టు ఒకరి మీద ఒకరు అరుచుకున్నారు.

'దొంగ... దొంగ...' అని - అరుస్తూనే ఉన్నారు.

కళ్ళు మూసి నిద్రలేచారు జనం!

'దొంగ... దొంగ...' ఇద్దరు దొంగల అరుపులు విని - జనం తామూ 'దొంగా... దొంగా...' అని కోరస్ ఇచ్చినట్టు అరిచాకనే - మేల్కొని -

'ఎక్కడా?' జనం అడిగారు.

'దొంగ... పారిపోయాడు...' దొంగలిద్దరూ లేని దొంగని సృష్టించారు!.

'ఎటు?' వెళ్ళారని దొంగల్నే అడిగారు!

'అటు!' వెళ్ళారని దొంగలిద్దరూ తల్లో వేపు చూపించారు.

జనం రెండుగా చీలి ఆగ్రహావేశాలతో దొంగల్ని పట్టుకోవడానికి రెండు దిశలకూ పరిగెత్తారు! పరిగెత్తుతూనే ఉన్నారు!

మిగిలిన ఇద్దరు దొంగలకూ చేతినిండా పని దొరికింది!

## ఆత్మగౌరవం

'ముమ్మాటికీ... ఇది ఆంధ్రుల ఆత్మగౌరవానికి సంబంధించిందే... మరొక మాటలేదు... ఉండదు!' అన్నాడు మా మావ.

మంత్రుల గాలి మా బాగా సోకింది అనుకొని నవ్వేసాను!

# కవిగా అరుణ్‌సాగర్

**పాణి**



కవిగా అరుణ్‌సాగర్‌కు ఓ ప్రత్యేకత ఉంది. మేల్‌కొలుపు, మ్యాగ్జిమ్‌రిస్క్, మియర్‌మేల్, మ్యూజిక్‌డైస్ అనే నాలుగు కవితా సంపుటాలను తెలుగు కవిత్వ ప్రియులకు అందించారు. వీటన్నిట్లో చాలా కొత్తదనం ఉంది. ఎంత కొత్తదనమంటే.. అదేమిటో తెలుసుకోవడమే చాలా మందికి కష్టం. అంతగా అరుణ్‌సాగర్ కవిత్వంలో కొత్తదనాన్ని ఇష్టపడ్డారు. దాని కోసం ప్రయోగాత్మకంగా కవిత్వం రాశారు. ఇప్పటికే తెలిసిన కవితా పద్ధతులకు భిన్నంగా వెళ్లారు. దీన్ని స్వాగతించాలి.

ఫలానా పోయెమ్, లేదా ఫలానా కవి పోయెట్రీ 'అర్థం కావడం లేదు' అనే చర్చ కూడా ఉంటుంది. కళా సంబంధమైన వాటిలో అర్థం కాకపోవడం అనే 'సమస్య'ను తప్పించుకోలేం. అందువల్ల ఆ చర్చను అర్థం కావడం లేదనే కోణంలో ప్రారంభించడం, లేదా ముగించడం తగదు. ముఖ్యంగా కవిత్వంలాంటి వాటి విషయంలో. ఈ జాగ్రత్త లేకుంటే కళలో వైవిధ్యాన్ని, ప్రయోగాన్ని చప్పున స్వీకరించలేం. కళలోని ఒక ప్రయోగం అప్పుడేమీ ప్రభావం చూపకపోయినా తర్వాత ఎప్పుడో ఆ రంగంలో అవసరమైన మార్పుకు దారి చూపవచ్చు. స్థూలంగా ఇలాంటి అప్రమత్తతతో అరుణ్‌సాగర్ కవిత్వాన్ని చదివితే... కొత్తదనం మీద ఆయన మోజును మనమూ ఇష్టపడతాం. కొత్త వ్యక్తీకరణ కోసం ఆయన భాషా వినియోగానికి ఆశ్చర్యపోతాం. ఇందుకు అరుణ్‌సాగర్‌ను గుర్తుంచుకుంటాం.

తన నాలుగు పుస్తకాల్లో కూడా పోలవరం ముంపు ప్రభావంలో రాసిన మ్యూజిక్ డైస్‌లో భిన్నమైన కవిత్వం ఉంది. మిగతా మూడు ఒక తరహా. ఈ తేడా వస్తువుకు సంబంధించిందే కాదు. రూపంలో కూడా కొంచెం తేడా ఉంది. పోలవరంలో మునిగిపోతున్న ఆదివాసుల గురించి రాసేటప్పుడే ఈ తేడా ఎందుకు వచ్చింది? అనే ప్రశ్న మంచి చర్చకు ఉపయోపడుతుంది.

మిగతా మూడు పుస్తకాల్లోని కవి ప్రతిభకు ఆశ్చర్యపోతాంగాని ఎలాంటి అనుభూతి కలగదు. ఆయన శిల్పంపట్ల, కొత్తదనంపట్ల నూరు శాతం మమకారం ఉన్న వాళ్లకు కూడా ఎలాంటి అనుభూతి కలగకపోవచ్చు. కవిత్వంలో, కళలో సందేశం, పరిష్కారం ఉండాలనే మాటను వివాదాస్పదం చేసేవాళ్లకు కూడా అనుభూతిలాంటిదేదో ఉండాలనే విషయంలో ఏకాభిప్రాయం ఉంటుంది. అరుణ్‌సాగర్ కవిత్వంలో పదాల అల్లిక, పేర్పు ఆయన ప్రతిభను సూచించేవేగాని అనుభూతి కలిగించవు. మన మధ్యలోంచి మన కోసం కాకుండా ఏదో ప్రపంచం నుంచి ఆయన కవిత్వం చెబుతున్నట్లనిపిస్తుంది. అట్లని దీన్ని కొత్తదనానికి, ప్రయోగానికి ఆపాదించాల్సిన పని లేదు. అర్థం కావడం...కాకపోవడం అనే చర్చ కూడా తగదు. కవిత్వంలో ఉండవలసిన దినుసు ఏదో లేకపోవడం, లేదా ఇంకోలా ఉండటం అసలు సమస్య.

అరుణ్‌సాగర్ కవిత్వం చదువుతోంటే మో గుర్తుకు వచ్చారు. ఇద్దరి మధ్య పోలికలు, తేడాల గురించి మాట్లాడబోవడం లేదు. మో కవిత్వంలో ఏవి ఎన్ని ఉన్నా అక్కడక్కడా అనుభూతి కూడా కలుగుతుంది. ఇతరత్రా లోతు కనిపిస్తుంది.

అరుణ్‌సాగర్ వస్తువులో కూడా కొత్తదనం ఉంటుంది. మియర్‌మేల్ పోయెమ్స్ ఫర్ మెన్.. మగవాదం అనేది కొత్తగా ఉంటుంది కాబట్టి అలా రాసేశారు. అంతే. దానిలో ఏ లోతు, అనుభూతి కనిపించదు. అయితే సరదాగా చదువుకోడానికి బాగుంటుంది. వైవిధ్యంగా ఉంటుంది కాబట్టి ముచ్చటేస్తుంది. పోలవరం ఆదివాసుల గురించి రాసిన కవిత్వం ఇలా కాదు. అందుకే అది వేరే అని ముందే అన్నది. ఆదివాసులపట్ల ఉన్న మమకారం వల్లేమో మిగతా మూడు పుస్తకాల వరుసలో ఇమడని కవిత్వం వాళ్ల కోసం రాశారు. అందుకు ఆయన్ను ఎప్పటికీ గుర్తు పెట్టుకోవాలి.



---

'నవ్వుతావేంటి? ఏడుస్తుంటే -' అన్నాడు మావ. 'ఆంధ్రులందరికి ప్రతినిధి కదా... అతని ఆత్మగౌరవం నీది కాదా? నాది కాదా? ఎవరిది కాదా!' మామను పసుపు చొక్కా తొడుక్కోగా చూడలేదు, పచ్చ కామెర్లు గాని వచ్చిందేమో అనుకున్నా-

'మన ముఖ్యమంత్రి... మన ప్రభుత్వం...' నినాదమిచ్చాడు. జనాల్ని పోగేసాడు. పసుపు ఆరబోసాడు!

'ఇది అందరి ఆత్మగౌరవం... ముఖ్యమంత్రి అంటే మా ప్రజలకు ప్రతినిధి. అతనికి విడిగా మాకు విడిగా ఆత్మగౌరవం ఉండదు. అతనికి విడిగా మాకు విడిగా పోరాటం ఉండదు. అతనికి విడిగా మాకు విడిగా నిరసన ఉండదు. అతనికి విడిగా మాకు విడిగా సెక్షన్ 8 ఉండదు...' ఊపిరి పీల్చుకోవడానికి ఆగి 'అతనికి విడిగా మాకు విడిగా ఆస్తిపాస్తులుండవు...' అన్నాడు!

'చంద్రబాబు ఆస్తులు అందరికీ పంచుదాం!

చంద్రబాబు ఆత్మగౌరవాన్ని అందరమూ పంచుకుందాం!"

ప్రజలు ఈ నినాదాన్ని ఇవాళ అందుకొని, రేపు ఆస్తుల్ని అందుకొనే లానే ఉన్నారు!

'జై చంద్రబాబు! జైజై ఆంధ్రప్రదేశ్! జైజై ఆత్మగౌరవం!' నేనూ నినాదమయ్యాను!



# పెసా... అసలు వాస్తవాలు

జహంగీర్

పెసా గురించి ఈ దేశంలో తెలియని ఆదివాసీ ప్రజలు కోట్ల సంఖ్యలోనే ఉంటారు. కానీ, దోపిడీ ప్రభుత్వాలు మాత్రం పెసా గురించి మహా ఆర్భాటంగా ప్రచారం చేస్తున్నాయి. ఆదివాసీ ప్రజల హితవు కోరే లబ్దప్రతిష్టులైన అనేక మంది లిబరల్, బూర్జువా మేధావులు సైతం పెసాను విప్లవాత్మకమైనదిగా పేర్కొంటున్నారు. ఈ మధ్య దండకారణ్యంలోని కొన్ని ప్రాంతాలలో పెసా అమలు కోసం ప్రజలు ఉద్యమించడం చూస్తున్నాం. పలు ఎన్‌జీఓలు, రివిజనిస్టు పార్టీలు పెసాను ఆకాశానికెత్తుతూ ప్రజలను విప్లవ మార్గం నుండి దారి మళ్ళిస్తున్న వైనం కూడా కొనసాగుతోంది. ఇలాంటి పరిస్థితులలో పెసా గురించి వాస్తవాలు తెలుసుకుంటే తప్ప దానితో సవ్యంగా వ్యవహరించలేరనే అవగాహనతో ఇది రాస్తున్నాను.

పెసా పూర్తి పేరు పంచాయతీ ఎక్స్‌టెన్షన్ ఫర్ షెడ్యూల్ట్ ఏరియాస్ (ఆదివాసీ ప్రాంతాలకు పంచాయితీల విస్తరణ)గా ఉనికిలోకి వచ్చింది. 1996 డిశంబర్ 24నాడు ఈ చట్టం ఉనికిలోకి వచ్చింది. భారతదేశంలో మూడంచెల పంచాయితీరాజ్ వ్యవస్థ 1952 నుండి అమలులో ఉంది. గ్రామ, బ్లాక్, జిల్లా స్థాయిలలో గల ఈ వ్యవస్థలో, గ్రామంలో సర్పంచ్, బ్లాక్‌లో బ్లాక్ అధ్యక్షులు (సభాపతి) జిల్లా పరిషత్‌లో ఛైర్మన్‌లు ప్రత్యక్ష లేదా పరోక్ష ఎన్నికల ద్వారా ఐదేళ్ళ కోసం ఎన్నికవుతారు. భారత రాజ్యాంగానికి అవసరమైన మార్పులు చేసి ఈ పంచాయితీ వ్యవస్థనే ఆదివాసీ ప్రాంతాలలో అమలు చేయాలనే లక్ష్యంతో పెసాను ముందుకు తెచ్చారు. భారత రాజ్యాంగానికి ఇది 73వ సవరణ. ఈ చట్టం తేవడం వెనుక గల వాస్తవాలను తెలుసుకుందాం.

దేశంలోని ఆదివాసీ ప్రజల జీవితాలను (సమస్యలను) అధ్యయనం చేయడానికి కేంద్ర ప్రభుత్వం 1992లో దిలీప్‌సింగ్ బూరియా కమిషన్‌ను నియమించింది. ఈయన ఝాబువా (ఎం.పి.) జిల్లాకు చెందిన ఆదివాసీ నాయకుడు. ఈయన కాంగ్రెస్ పార్టీకి చెందిన వాడు. ఈయన ఆదివాసీ ప్రజల జీవితాలను అధ్యయనం చేసి 1994లో తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించాడు. ఆ నివేదిక ఫలితంగా కేంద్ర ప్రభుత్వం పంచాయితీ వ్యవస్థలో తగు మార్పులు చేస్తూ పెసాను 1996 డిశంబర్‌లో అమలులోకి తెచ్చింది. ఈ చట్టాన్ని బూరియా 'ఆదివాసీ ప్రజల చరిత్రలో నూతన శకానికి ఆరంభం పెసా' అన్నాడు. బి.డి. శర్మ (విశ్రాంత ఆదివాసీ కమిషనర్) ఈ చట్టాన్ని 'విప్లవాత్మకమైనది'గా పేర్కొంటున్నాడు.

భారత రాజ్యాంగం పట్ల విశ్వాసం ఉన్న ఆదివాసీ శ్రేయోభిలాషులు, మేధావులు ఈ చట్టాన్ని అద్భుతమైందిగా వర్ణించడంలో ఆశ్చర్యమేమీ ఉండదు. ఈ పెద్దలు ఈ చట్టాన్ని ఎలా అభివర్ణించినా అసలు చట్టం తేవడం వెనుక గల వాస్తవాలు ఇలా ఉన్నాయి.

భారతదేశం వ్యవసాయక దేశం. ఇక్కడ అధిక మెజారిటీ ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నారు. కానీ దేశంలోని అతి తక్కువ శాతం బడా భూస్వాముల వద్ద పెద్ద పెద్ద (విశాల) భూఖండాలున్నాయి. సాగు యోగ్యమైన అత్యధిక భూములు వారి వద్ద ఉండడంతో వాస్తవంగా దున్నేవారికే భూమిలేని దుస్థితి మన దేశంలో ఉంది. మరో వైపు మన దేశ భూభాగంలో దాదాపు 20% అడవులు ఉన్నాయి. దేశ జనాభాలో 8.6% ప్రజలు ఆదివాసీలున్నారు. వీరికి అడవులపై ఎలాంటి అధికారం లేకుండా పోవడంతో 'రాజ్యం' (స్టేట్) అతిపెద్ద భూయాజమాన్య శక్తిగా దేశంలో నిలిచింది. ఆదివాసీ ప్రజలు పంట భూముల కోసం నానా అవస్థలు పడాల్సిన అధ్వాన్న స్థితిని ఎదుర్కొంటున్నారు. మన దేశంలోని రైతుల, ఆదివాసీ రైతుల సమస్య భూమి సమస్య. అందుకే వారు దున్నే వారికే భూమి అంటూ దీర్ఘకాలంగా పోరాడుతున్నారు. నిర్దిష్టంగా చెప్పాలంటే నక్సల్బరీ విప్లవోద్యమం తక్షణం ఈ సమస్యను ఎజెండా మీదికి తెచ్చింది. 'దున్నే వారికే భూమి', 'సాయుధ పోరాటం' నాణానికి రెండు వైపులా జమిలిగా ముందుకు వచ్చాయి. ఈ పోరాటాలు దేశంలోని అనేక రాష్ట్రాలకు వ్యాపించాయి. ముఖ్యంగా బీహార్, ఆంధ్రప్రదేశ్, పశ్చిమ బంగా, ఒడిశా, పంజాబ్, తమిళనాడు తదితర రాష్ట్రాలు ఎరుపెక్కాయి. నక్సల్బరీ విప్లవోద్యమం సెట్‌బ్యాక్‌కు గురయ్యాక తిరిగి ఎమర్జెన్సీ అనంతరం ఒకవైపు ఆంధ్రప్రదేశ్, మరోవైపు బీహార్ రాష్ట్రాలలో రైతాంగ పోరాటాలు భగ్గుమన్నాయి. ఆ పోరాటాలు అనతి కాలంలోనే విముక్తి ప్రాంత లక్ష్యంతో విశాల అటవీ ప్రాంతాలకు విస్తరించాయి.

అడవులలోని ఆదివాసీ, గైరాదివాసీ ప్రజలు సంఘటిత భూపోరాటాలలో సమీకృతులయ్యారు. సాగు భూముల కోసం, పంట భూముల పట్టాల కోసం పోరాటాలు తీవ్రమయ్యాయి. లక్షలాది ఎకరాల అటవీ భూములు రైతుల కైవశమయ్యాయి. సరిగ్గా అదే సమయంలో (1980లో) రాష్ట్రాల జాబితా నుండి అడవులు కేంద్ర జాబితాలోకి వెళ్ళడంతో సాగు భూములకు రాష్ట్ర ప్రభుత్వాలు పట్టాలు ఇచ్చే ప్రసక్తే లేకుండా పోయింది. 1970లలోనే భూపరిమితి చట్టం, 1950లలో కౌల్దారీ చట్టం అమలులోకి వచ్చినప్పటికీ దున్నేవారికి ఈ దేశంలో భూమి లభించలేదు. భూమి కోసం పీడిత రైతాంగం విజృంభిస్తున్న పరిస్థితులలో బూరియా కమిషన్ ఏర్పడడం, పెసా చట్టం వెలుగు చూడడం జరిగింది. అంటే, దేశంలో భూమి కోసం విజృంభిస్తున్న రైతాంగ పోరాటాలను ముఖ్యంగా ఆదివాసీ

పోరాటాలపై నీళ్లు చల్లడానికి పెసాను దోపిడీ పాలక వర్గాలు ముందుకు తెచ్చాయన్నది అసలు వాస్తవం.

దోపిడీ పాలక వర్గాలు ముందుకు తెచ్చే సంస్కరణవాద చట్టాల వెనుక ఒక ప్రధాన కారణం మిలిటెంటు ప్రజా పోరాటాలను దారి మళ్ళించడం లేదా వాటిని తాత్కాలికంగా చల్లార్చడం ఒక లక్ష్యంగానే ఉంటుందన్నది వాస్తవం. అలాగే ఆ చట్టాల మాటున దోపిడీ పాలక వర్గాల ప్రయోజనాలను నెరవేర్చుకోవడం కూడా భాగంగా ఉంటుంది. పెసా ఈ అవగాహనకు లేదా లక్ష్యానికి భిన్నమైనది ఎంత మాత్రం కాదు.

## పెసా ఏ ప్రాంతాలలో అమలవుతున్నది?

భారత రాజ్యాంగంలో 13 షెడ్యూల్‌లు ఉన్నాయి. వీటిలో 5వ, 6వ షెడ్యూల్‌లు ఆదివాసీ ప్రజలను ఉద్దేశించినవి. దేశంలో పది రాష్ట్రాలలో 5వ షెడ్యూల్ అమలులో ఉండగా, 'ఈశాన్య రాష్ట్రాలలో' 6వ షెడ్యూల్ అమలులో ఉంది. విడిపోయే హక్కుతో సహా తమ స్వయం నిర్ణయాధికారం కోసం దశాబ్దాలుగా పోరాడుతున్న ఈశాన్య ప్రాంత జాతుల ప్రజల పోరాటాలను నిర్దాక్షిణ్యంగా అణిచివేస్తూ భారత దోపిడీ పాలక వర్గాలు వారికి ప్రత్యేక అటానమస్ ప్రాంతాలను రాజ్యాంగంలోని 6వ షెడ్యూల్ ద్వారా కల్పించాయి. ఆ హక్కులు 5వ షెడ్యూల్ అమలయ్యే రాష్ట్రాలకు వర్తించవు. ఈ రాష్ట్రాల కోసం 20 సంవత్సరాల క్రితం పెసాను ముందుకు తెచ్చారు. ఈ పది రాష్ట్రాలు మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలుగా ప్రభుత్వం లెక్కిస్తోంది.

దేశంలోని 10 రాష్ట్రాలలో దాదాపు 72 జిల్లాల్లో బలంగా విప్లవోద్యమం కొనసాగుతోందని, వీటిలో 32 జిల్లాలు పెసా అమలయ్యే ప్రాంతాలంటూ 2006లో అజయ్ దండేకార్, చిత్రాంగద కమిషన్ స్పష్టం చేసింది. ఇంతేకాదు, ఆదివాసీ ప్రాంతాలలో పెసాను శక్తివంతంగా అమలు చేయలేకపోతున్న ఫలితంగానే మావోయిస్టులు బలపడుతున్నారని కూడా ఆ కమిషన్ తన నివేదికలో ప్రభుత్వానికి విన్నవించుకుంది. స్థూలంగా చెప్పాలంటే పెసా చట్టం ఈశాన్య ప్రాంతం మినహా మావోయిస్టు విప్లవోద్యమం కొనసాగుతున్న అన్ని ప్రాంతాలలో అమలు చేయాల్సి ఉంటుంది.

## పెసా చట్టం ఏం చెబుతోంది?

పెసా చట్టం ప్రకారం ఆదివాసీ ప్రాంతాలలోకి పంచాయితీల విస్తరణ అంటే ప్రధానంగా అర్థం చేసుకోవలసింది గ్రామసభల నిర్మాణమే. దేశవ్యాప్తంగా గ్రామ పంచాయితీల ఏర్పాటును నిర్దిష్ట జనాభా ప్రాతిపదికన చేయాల్సి ఉంటుంది. కానీ, దానికి భిన్నంగా గ్రామసభలను గ్రామ, పారా(టోల)ల ప్రాతిపదికన కూడా అధికారంగా ఏర్పరచుకోవచ్చు. ఇందుకు ఏ రకమైన ఆటంకాలను మూలచట్టం ప్రకారం ఎవరూ కల్పించలేరు.

గ్రామసభను గ్రామ లేదా టోల/పారా ప్రాతిపదికన ఏర్పాటు చేసుకోవడానికి చేపట్టాల్సిన చట్టపర ప్రక్రియ అంటే, ఓటర్ల జాబితాను గ్రామం లేదా పారా వారు (వయోజనులు) తమ పేర్ల సూచిక జతచేసి సంబంధిత పంచాయితీ సచివ్ ద్వారా జిల్లా కలెక్టర్‌కు అందివ్వాలి. ఆయన మూడు మాసాలలోగా గ్రామ వయోజనుల పేర్ల సూచితో ఓటర్ల జాబితాను పోల్చుకుని గ్రామసభను గుర్తిస్తూ ప్రకటించాల్సి ఉంటుంది. ఏదేని పక్షంలో, మూడు మాసాలలోగా కలెక్టర్ ప్రకటించలేకపోతే మరో 15 రోజుల గడువు పొడగించబడుతుంది. అప్పటికీ ఆయన విఫలమైతే ఆ గ్రామంలో లేదా పారాలో గ్రామసభ స్వతఃసిద్ధంగానే ప్రకటితమవుతుంది. చట్టం ఈ స్పష్టత ఇచ్చినప్పటికీ, ఏ రాష్ట్రంలోనూ, ఏ జిల్లాలోనూ ఇంత సులువుగా ప్రభుత్వ అధికారులు గ్రామ సభలను ప్రకటించడం లేదని గత 20 ఏళ్ళ దోపిడీ పాలన రుజువు చేస్తోంది.

గ్రామసభ ఏర్పాటులో భాగంగా ప్రజల అవసరాలను తీర్చడానికి కావాల్సిన వివిధ శాఖలను ప్రజలు ఏర్పాటు చేసుకోవచ్చు. ఆర్థిక శాఖ, సంతల నియంత్రణ శాఖ, మాదక ద్రవ్యాల నియంత్రణ శాఖ, శాంతి - భద్రతల శాఖ, సంస్కృతి శాఖ మొదలైనవి ఉన్నాయి. ఈ శాఖలలో గ్రామ స్త్రీ-పురుషులు ఉండాలి. ప్రతిశాఖకు అధ్యక్ష, ఉపాధ్యక్షులు ఉండాలి. మూలచట్టంలో ఇలాంటి ఇంకా కొన్ని శాఖల ప్రస్తావన ఉన్నప్పటికీ ప్రభుత్వాలు మాత్రం మిగతా అన్ని శాఖల మాట ఎలా ఉన్నా, ఆర్థికశాఖలో మాత్రం గ్రామ పంచాయితీ సచివ్‌ను పెట్టాలంటూ జీ.ఆర్. (గవర్నమెంట్ రూల్)ల ద్వారా తాఖీదులిస్తున్నాయి. ఈ తాఖీదుల ఉద్దేశం ఆర్థిక వ్యవహారాలలో ప్రభుత్వాలు తమ ప్రత్యక్ష జోక్యాన్ని కలిగి ఉండడమే. కానీ ఇది పెసా మూల స్వభావానికే విరుద్ధమైనది.

గ్రామసభలు చేసే ఏ నిర్ణయమైనా సర్వసమ్మతంగానే చేయాల్సి ఉంటుంది. ఇలా చెప్పడం అంటే, దోపిడీ సమాజంలో (వర్గ సమాజంలో) ప్రజల వ్యక్తీకరణను నియంత్రించడం తప్ప మరేమీ కాదు. గ్రామసభలలో సాధారణంగా తెగ పెద్దల ఆధిపత్యం నడిచే చోట పునాది వర్గాల ప్రజలు అసలే పెద్దల ముందు తమ అభిప్రాయాలను చెప్పలేని స్థితి ఉంటుందంటే, ఇలాంటి 'సర్వ సమ్మతి' నిర్ణయాలు వారిని మరింత కట్టడి చేస్తాయి. ఆచరణలో ఎప్పటిలాగే గ్రామాల్లో తెగ పెద్దల నియంతృత్వమే అమలవుతుంది.

## పెసా ప్రజలకు ఏం వాగ్దానం చేస్తుంది?

పెసా చట్టం ప్రజలకు అనేక హామీలు ఇస్తుంది. ముందుగా పెసా చట్టం విషయంలో చేయాల్సిన ఏవేని మార్పులుగానీ, ఆదివాసీ ప్రజల జీవితాలకు వర్తించే చట్టాల రూపకల్పన విషయంలో గానీ, చట్టసభలు ఎలాంటి జోక్యం చేసుకోలేవనీ పెసా స్పష్టం చేస్తున్నది. పెసాను ఉల్లంఘించే విధంగా ఆదివాసీ ప్రాంతాలకు వర్తించే చట్టాలను అవి చేయకూడదు. ఇక రెండవ విషయానికి వస్తే అడవిలో జీవించే ఆదివాసులకు అడవిలో లభించే ఉత్పత్తులలో (అటవీ ఉత్పత్తులు) కేవలం 70 రకాల మీదనే పెసా అధికారాన్ని కల్పిస్తుంది. వీటిని లఘు అటవీ ఉత్పత్తులు అంటున్నారు. పెసా చట్టం ప్రకారం గ్రామసభల పూర్తి ఆమోదం లేకుండా ప్రభుత్వం సైతం రైతుల సాగు భూములనేగానీ, ప్రజల అడవులనే గానీ స్వాధీనం చేసుకోజాలవు. ఆదివాసీ రైతుల భూములను ఆదివాసేతరులు కొనుగోలు చేయరాదు. అలాగే ఆదివాసీ ప్రజల ఆర్థిక

వ్యవహారాలలో ఆదివాసేతరులు జోక్యం చేసుకోకుండా ఉండడానికి ప్రభుత్వాలే ఆ లావాదేవీలను నెరపాలనీ పెసా చెబుతోంది. ఇలాంటి హామీలు మరి కొన్ని ఉన్నాయి. కానీ ఇక్కడ అమలవుతున్న కొన్ని వాస్తవ విషయాలను ప్రస్తావించుకోవాల్సి ఉంది.

పెసా చట్టం లఘు ఉత్పత్తులపైనే ఆదివాసీ ప్రజల అధికారాలను ఖాయం చేస్తుంది గానీ భారీ ఉత్పత్తులు (గనులు, ఖనిజాలు) మాత్రం వారికి చెందవంటున్నది. దోపిడీ ప్రభుత్వాల నిలువు దోపిడీ విధానాలను ఇది అద్దం పడుతోంది. అతి స్వల్పమైన విలువగలిగిన అటవీ లఘు ఉత్పత్తులను ఆదివాసులకు ఇచ్చి వాని ప్రసన్నులను చేసి, భారీ ఉత్పత్తులను కార్పొరేటు వర్గాలు కొల్లగొట్టుకపోవడానికి వీలుగా ప్రభుత్వాలు కీలకమైన అధికారాన్ని తామే అట్టిపెట్టుకున్నాయి. ఈ విషయంలో బి.డి.శర్మగారు ప్రతిపాదించిన గనుల తవ్వకాల ప్రతిపాదనలను ప్రభుత్వాలు బుట్టదాఖలా చేశాయి. గనుల తవ్వకాలలో 26% ఆ ప్రాంత ప్రజలకు చెందాలన్నది ఆయన ప్రతిపాదనలలో ప్రధానమైనది.

### పెసా చట్టానికి తూట్లు పొడుస్తున్న ప్రభుత్వాలు

పెసా చట్టం రూపొందించిన తరువాత 'జల్-జంగల్-జమీన్' నినాదాన్ని ముందుకు తెచ్చి విస్తృతంగా ప్రచారం చేసిన సంస్థలలో భారత్ జన్ ఆందోళన్, దాని వ్యవస్థాపక నాయకులు బి.డి.శర్మ ఒకరు. ఆయన జీవితాంతం ప్రధానంగా ఆదివాసీ ప్రజల సేవకే అంకితమైపోవడంతో పెసా చట్టాన్ని సరళమైన నినాద రూపంలో ప్రస్తుతిస్తుంటాడు. అంతేకాదు, పెసా చట్టంలో చట్టసభలు కూడా జోక్యం చేసుకోలేవన్న విషయాన్ని సాధారణ ప్రజలకు సరళంగా బోధించడానికి ఆయన 'లోక్‌సభ కాదు, రాజ్యసభ కాదు అన్నింటికి మిన్న గ్రామసభ' అన్నాడు. కానీ, ఇవన్నీ హుళక్కే అంటున్నాయి దోపిడీ ప్రభుత్వాలు. ఆదివాసీ ప్రజలను పేదవాళ్ళంటేనే మండిపడుతూ, వారు అపార ప్రాకృతిక సంపదల యజమానులు, సంరక్షకులు అంటూ కొనియాడేవాళ్ళలో బి.డి.శర్మ ఒకరు. కానీ నూతన సరళీకృత ఆర్థిక విధానాల ముందు అన్ని చట్టాలు దిగతుడుపేనన్నది ఏనాటికానాడు మరింత బహిర్గతమవుతున్నది. చట్టాల రూపకల్పనలో ఘరానా కార్పొరేటు శక్తుల పాత్రను అంచనా గట్టకలిగిన వారు చట్టాల ఉల్లంఘనలో వాటి క్రూర దోపిడీ స్వభావాన్ని అలాగే చట్టాల ద్విముఖ (రెండు నాల్కల) ధోరణిని సులభంగానే అర్థం చేసుకోగలుగుతారు. కాకపోతే వాటి అమలుకు క్రియాశీలంగా పూనుకోవడం అంటూ ముఖ్యంగా మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలలో కత్తిమీద సాములాగే తయారైంది పరిస్థితి.

ఉదా: పెసా చట్టం ప్రకారం గ్రామసభల సర్వసమ్మతితోనే కార్పొరేటు వర్గాలకు ప్రభుత్వాలు భూములను సమకూర్చవలసి ఉంటుంది. కానీ ప్రభుత్వం దేశంలో పెంపొందుతోన్న భూ పోరాటాలు, రైతాంగ ప్రతిఘటనోద్యమాల ఫలితంగా బ్రిటిష్ వారు 1894లో రూపొందించిన భూసేకరణ చట్టానికి 2013లో యు.పి.ఎ. సవరణలు చేసి నూతన భూసేకరణ చట్టం అమలులోకి తెచ్చింది. దాని ప్రకారం మూల పెసాలో పేర్కొన్న సర్వసమ్మతి స్థానంలో భూసేకరణ విషయంలో 75% ప్రజల ఆమోదం ఉంటే సరిపోతుందన్న సవరణ ముందుకు వచ్చింది. ఆ తరువాత 2014లో గద్దెనెక్కిన మోదీ ప్రభుత్వం వరుసగా తీసిన మూడు భూసేకరణ బిల్లులలో మూల పెసాలోని భూసేకరణకు కావాల్సిన గ్రామసభల సర్వసమ్మతిని పూర్తిగానే బుట్టదాఖలా చేసింది. ఇది ఒక రకంగా 1894లో బ్రిటిష్‌వాడు రూపొందించిన భూసేకరణ చట్టాన్ని తలదన్నే విధంగానే తయారైందని చెప్పవచ్చు. మరోవైపు గ్రామసభల అనుమతి లేకుండా దేశంలో ఇప్పటికే 1,82,389 హెక్టార్ల భూములను ప్రభుత్వాలు కబ్జా చేసుకున్నాయి.

దోపిడీ చట్టాలు ఎంత తిరకాసులతో కూడుకుని ఉంటాయో ప్రజలు అర్థం చేసుకోవాలి. పెసా చట్టం ప్రకారం భూమిపై రైతాంగానికే అధికారం ఉంది. కానీ భూమిలో నిక్షిప్తమై ఉన్న భారీ ఉత్పత్తులు మాత్రం ప్రభుత్వాలకే చెందుతాయనే వితండవాదనను సవాలు చేస్తూ ఝార్ఖండ్ ఆదివాసీలు సుప్రీంకోర్టు వరకు వెళ్ళారు. తుదకు సుప్రీంకోర్టు కూడా తప్పని పరిస్థితిలో రైతుల పక్షం తీసుకుని తీర్పు వెలువరించక తప్పలేదు. చట్టసభలు రూపొందించే చట్టాల పట్ల ప్రజల్లో విశ్వాసం, గౌరవ భావం నిలిపి ఉంచడానికి అలాగే, న్యాయవ్యవస్థ సాధికారతను వ్యక్తం చేసుకోవడానికి సుప్రీంకోర్టు ఇలాంటి ప్రజాహిత తీర్పులు కదాచితగానైనా వెలువరించడం అనివార్యమైనది.

పెసా ఆదివాసీ జీవనవిధానాన్ని, వారి సంప్రదాయాలను, సంస్కృతిని సంరక్షించే భాష మాట్లాడుతుంది. కానీ 2014లో అధికారాన్ని చేపట్టిన మోదీ ప్రభుత్వంగానీ, అంతకు ముందరి యు.పి.ఎ. గానీ పెసాని ఘోరంగా ఉల్లంఘిస్తూ వస్తున్నాయి. కాషాయ రాజకీయాలకు అంకితమైన భాజపా, దాని నాయకుడు మోదీ మరీ దూకుడుగా వ్యవహరిస్తూ అల్ప సంఖ్యాక ప్రజల మత భావనలను, ఆచార వ్యవహారాలను అవమానిస్తూ దాడులకు పాల్పడుతున్నారు. ఇక్కడ పెసాకే పరిమితమై ఆదివాసీ ప్రజల సాంస్కృతిక విషయాలనే చెప్పాల్సి వస్తే, వారు మాంసప్రియులు. కానీ దేశంలోని మెజారిటీ రాష్ట్రాలు మరో మాటలో ఐదవ షెడ్యూల్ అమలయ్యే దాదాపు మెజరిటీ రాష్ట్రాలలో గోహత్య నిషేధం దశాబ్దాలుగా అమలవుతోంది. ఈ మధ్య చట్టం తీసుకొచ్చిన మహారాష్ట్ర, హర్యానా రాష్ట్రాలు (బి.జె.పి. పాలిత) కఠిన శిక్షలను సైతం పేర్కొన్నాయి. పెసాను కాపాడాల్సిన సంరక్షకులు, గవర్నర్లు ఈ చట్టాలకు ఆమోద ముద్రలు వేసి ఆదివాసీ ప్రజల ఆహారపు అలవాట్లను 'ప్రజాస్వామికంగానే' హత్య చేశారు.

దేశంలో పౌష్టికాహార లోపంతో బాధపడే పిల్లల్లో, అకాల మృత్యువాత పడే పిల్లల్లో ఆదివాసీ పిల్లలు ముందు వరుసలో అగ్రభాగాన ఉంటారు. అయినప్పటికీ ఆదివాసీ జనాభా గణనీయంగా ఉన్న మధ్యప్రదేశ్ రాష్ట్రంలో అక్కడి శివరాజ్‌సింగ్ చౌహాన్ బి.జె.పి. ప్రభుత్వం పాఠశాలల్లోని పిల్లలకు కోడిగుడ్డు ఇవ్వడాన్ని నిషేధించింది. దాని స్థానంలో పాలు, అరటిపండ్లు ఇస్తామనడం ఆహార విషయాలలో ప్రజాస్వామిక అలవాట్లపై కషాయ బ్రిగేడ్ తన హిందూత్వ ఆధిపత్యాన్ని చలాయించడమే తప్ప పెసాను గౌరవించడం లేదు. గవర్నర్లు మౌనం వహిస్తున్నారు. బర్రె, ఆవు, మేక లాంటి పశువుల పాలు పితకడమే నేరంగా భావించే

ఆదివాసీలచే వాటి పాలు తాపించడం ఖండనార్హమైనది. మాంస ప్రియులను శాకాహారులుగా మార్చే సుదీర్ఘ కుట్రల్లో ఇది ఒక అంతర్భాగమే తప్ప మరేమీ కాదు.

పెసా చట్టం ప్రకారం గ్రామసభలకు ఆదివాసీ గుర్తింపు పత్రాలు ఇచ్చే అధికారం ఉంది. పిల్లలు, స్కూల్, కాలేజీలలో సమర్పించాల్సిన ఆదివాసీ గుర్తింపు పత్రాన్ని గ్రామసభలే ఇవ్వాల్సి ఉంటుంది. కానీ ఇప్పటికీ విద్యార్థులు తహశీల్ కార్యాలయాలు చుట్టే రోజుల తరబడి గుర్తింపు పత్రాల కోసం చక్కర్లు కొడుతున్నారు. ఇలాంటి వాటిలో గవర్నర్లు కల్పించుకోవలసింది పోయి నిమ్మకు నీరెత్తినట్టుంటున్నారు.

వాస్తవంగా గవర్నర్లు పెసా అమలుపై ఏటేటా రాష్ట్రపతికి క్షేత్ర నివేదిక సమర్పించుకోవాల్సి ఉంటుంది. కానీ పెసా అమలులోకి వచ్చి రెండు దశాబ్దాలు కావస్తున్నా పెసా ఏ రాష్ట్రంలోనూ శక్తివంతంగా అమలు కాని అధ్వాన్న పరిస్థితులలో ఉంది. అందుకు ప్రధాన దోషులు గవర్నర్లే అయినప్పుడు ఇక రాష్ట్రపతికి వార్షిక నివేదికలు ఎక్కడ అందుతాయి?

ఆపరేషన్ గ్రీన్‌హంట్ కొనసాగుతోన్న విప్లవోద్యమ ప్రాంతంలో 2009 నుండి పోలీసులు కార్పెట్ సెక్యూరిటీని అమలు చేస్తున్నారు. 3-5 కి.మీ. పరిధిలో పోలీసు క్యాంపులు / స్టేషన్‌లు నెలకొల్పుతున్నారు. చాలా చోట్ల ప్రజలు దీని పట్ల తమ నిరసనను వ్యక్తం చేస్తూ పోలీసు క్యాంపులు గ్రామాల్లో తమ భద్రతకు, శాంతియుత జీవితానికి పెను ప్రమాదకరం అంటున్నారు. ఎక్కడా గ్రామసభలు వాటిని అనుమతించడమే లేదు. అయినప్పటికీ బలవంతంగా పోలీసు క్యాంపులు బిఠాయిస్తున్నాయి. కళ్ళు, చెవులు, నోరు మూసుకునే మూడు కోతుల గవర్నర్లకు ప్రజల ఘోష వినపడదు. కాబట్టి వాళ్ళు మాట్లాడలేదు. ఫలితంగా గ్రామాలు 'అశాంతి'కి కేంద్రాలవుతున్నాయి.

### ఒకే ఒరలో పొసగని రెండు కత్తులు పెసా, నూతన అటవీ చట్టం:

పెసా, ఆదివాసుల జీవితాల్లో విప్లవాత్మకమైన చట్టంగా పేర్కొనేవాళ్ళు అది స్వయం శాసనం (Self governance), అభివృద్ధి సహితమైనది, ప్రజాస్వామ్య సహితమైనది (Inclusive growth, Inclusive democracy) అనడమే కాకుండా దానిని 'రాజ్యాంగంలో రాజ్యాంగంగా' కూడా చెబుతుంటారు. అంటే అది ఎంత శక్తిమంతమైందో తెలుపడానికి లబ్ధ ప్రతిష్టులైన పెద్దలు ఈ విశేషణాలన్నీ వాడుతున్నారు. దాదాపు ఇలాంటి విశేషణాలనే వినియోగిస్తూ నూతన అటవీ చట్టాన్ని కీర్తిస్తున్నారు.

నూతన అటవీచట్టం 2006లో అమలులోకి వచ్చింది. అంటే దానికి ఇప్పటికే పదేళ్ళు నిండుతున్నాయన్న మాట. ఈ చట్టం ప్రకారం గ్రామ సమూహానికే రైతుల పంట భూములకు పట్టాలిచ్చే అధికారం ఉంది. గ్రామంలో ఒక కమిటీని ఏర్పరచుకోవాలి. ఆ కమిటీ సదరు రైతుల పంట భూములను పరిశీలించి 10 ఎకరాల లోపు భూమికి పట్టా ఇస్తుంది. ఆదివాసులకే కాకుండా గైరాదివాసులు ఎవరైతే మూడు తరాలుగా (75 సంవత్సరాలు) గ్రామంలో ఉంటూ వస్తున్నారో వారికి సైతం భూమి పట్టా ఇవ్వవచ్చని చట్టం స్పష్టం చేస్తోంది.

ఆదివాసుల భూముల గైరాదివాసులు కైవసం చేసుకోకుండా, చేసుకున్నవి ఉంటే తిరిగి ఇప్పించేంతటి అధికారం పెసా ద్వారా గ్రామసభకు ఉన్నప్పుడు నిజంగా ఆదివాసుల సమున్నతి కోసం ఈ కొత్త చట్టం 'The scheduled Tribes and other traditional forest dwellers (Recognition & forest rights) Act, 2006' అవసరమేమొచ్చిందన్నది అసలు విషయం. అడవులపైనే ఆదివాసులతో కూడిన గ్రామసభకు పెసా అధికారం ఇచ్చి రాజ్యాంగంలోనే రాజ్యాంగంగా దాని అధికార శక్తిని పేర్కొన్నప్పుడు ఈ కొత్త చట్టం ద్వారా మళ్ళీ ఓ వన రక్షణ సమితిని ఎన్నుకోవడం, అది సాగు భూములను పరిశీలించడం, ఆదివాసీ-గైరాదివాసులు తారతమ్యాన్ని విచారించి గైరాదివాసులు నివాస కాలాన్ని నిర్ణయించడం లాంటి అధికారాలు ఎందుకు చట్టం ప్రస్తావిస్తుందో చట్టాల తిరకాసులు తెల్సిన వాళ్ళకు తప్ప సామాన్యులకు బోధపడని విషయం. వాస్తవం చెప్పాలంటే, పెసా గ్రామసభలకే సర్వాధికారాలు అన్న స్థాయిలో మాట్లాడుతుంటే, నూతన అటవీ చట్టం ప్రభుత్వ అటవీశాఖకే అడవులపై సంపూర్ణ అధికారాలంటూ చెప్పకనే చెబుతున్నది. అందుకే ఇప్పటివరకు దేశంలో 5వ షెడ్యూల్ అమలయ్యే ఏ రాష్ట్రంలో కూడా (ఓ మేరకు మధ్యప్రదేశ్ ఎం.పి. ఛత్తీస్‌ఘడ్‌లు మినహా) రైతుల సాగు భూములకు పట్టాలే పూర్తిగా లభించలేదు. మహారాష్ట్రలో 2010 వరకు మూడు లక్షల మూడు వేల తొమ్మిది వందల అరవై మంది రైతులు పట్టాల కోసం దరఖాస్తు చేసుకుంటే 2,453 (0.8%) మందికి మాత్రం పట్టాలు ఇచ్చినట్లు ప్రభుత్వ రికార్డులు చూపుతున్నాయి. వాస్తవంగా ఇప్పటివరకు ఏ రాష్ట్రం కూడా తమ రాష్ట్రంలోని పాత చట్టాలను పెసాకు అనుగుణంగా పెసా వచ్చి 20 ఏండ్లు అవుతున్నా జరగనే లేదు. ఆదివాసీలకు ఉండాలంటూ కట్టి పడేస్తున్నది. నిస్తార్ కూపులు దాటి అడవిలో అడుగుపెడితే ఆదివాసులు మళ్ళీ నేరస్థులే అవుతున్నారు. ఆచరణలో పెసా, నూతన అటవీచట్టంల మధ్య సారూప్యతలు, తేడాలు గుంటచిక్కులు అర్థం కాకుండా పోతున్న సాధారణ ఆదివాసీ ప్రజలు చట్టాల కోరల్లో చిక్కుకుని అనాదిగా నలిగిపోతున్నట్లే పెసా ఉనికిలోకి వచ్చాక కూడా అనేక పెను సవాళ్ళ మధ్య సతమతమవుతున్నారు.

### పెసా కోసం వెలువెత్తుతున్న ప్రజాగ్రహం :

దేశంలోని మెజారిటీ ఆదివాసీ ప్రాంతాలలో విప్లవోద్యమం లేదనే చెప్పుకోవాలి. ఉన్నచోట కొన్ని ప్రాంతాలలో మినహా అన్నిచోట్ల బలంగా లేదు. విప్లవోద్యమం బలంగా లేనిచోట విప్లవ ప్రజా కమిటీల నిర్మాణం లేదు. అంటే నిజమైన విప్లవ ప్రత్యామ్నాయ రాజ్యాధికార వ్యవస్థ రూపొందడం లేదు. ఫలితంగా ప్రజలు చట్టాల అమలుకోసం రోడ్లపైకి రాక తప్పడం లేదు. దేశవ్యాప్తంగా అనేక ఆదివాసీ ప్రాంతాలలో పెసా చట్టాన్ని అమలు చేయాలంటూ ప్రజలు నినదిస్తున్నారు. కేంద్రంలో మోదీ ప్రభుత్వం ఏర్పడ్డాక పెసా చట్టాన్ని బలహీనం చేయడాన్ని వ్యతిరేకిస్తూ 2014 నవంబర్‌లో 16 రాష్ట్రాల

# భారతదేశంలోని ఒక ఆవు ఆలోచనల నెమరు

సత్యసాగర్

తెలుగు: బి. అనూరాధ

నేను భారతదేశంలోని ఒక అణకువ గల ఆవును. నా గురించి, మా కుటుంబ సభ్యుల గురించి చాలా కాలంగా వాడిగా జరుగుతున్న ప్రచారానికి సంబంధించి వివరణలు ఇవ్వడానికే ఇది రాస్తున్నాను.

'అణకువ' అనే పదాన్ని నేనేదో మొహమాటం కొద్దీ వాడాననుకొనేరు! ఎందుకంటే ఈ దేశంలోని ఆవుల వాస్తవ పరిస్థితిని అది ప్రతిబింబిస్తుంది కాబట్టి మాత్రమే దానిని వాడాను. మా "ఉన్నతమైన స్థితి" గురించి ఎంత గొప్ప ప్రచారం జరుగుతున్నప్పటికీ భారతదేశంలోని సాధారణ ప్రజలతో సమానంగా, భారతదేశంలోని ఆవులు కూడా అణగారిన వర్గానికే చెందుతాయి.

నిజానికి, మానవజాతి మొట్టమొదట 'మచ్చిక చేసుకున్న' జంతువులుగా ఆవులు ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న దోపిడీకి ఒక నమూనాగా ఉన్నాయి. ఒక్కసారి ఆవుల్నీ, కుక్కల్నీ, గొర్రెల్నీ బానిసలుగా చేసుకోవడమే తరువాయి, ఈ దుష్ట జాతిలోని మగజాతి- 'అబ్బ! మహిళల్నీ, పిల్లల్నీ, చుట్టు పక్కలున్న జాతుల్నీ కూడా మచ్చిక చేసుకోగలిగితే ఎంత బాగుండును' అనుకోవడం మొదలు పెట్టేసింది. ఆ తర్వాతదంతా చరిత్ర. అదేలెండి! మానవ 'నాగరికత' కి సంబంధించిన చరిత్ర. 'స్వాధీనం చేసుకోవడం', 'పగ్గాలు వేయడం', 'పిండుకోవడం', 'నరకడం' (ఇప్పటి వరకూ వందలాది సంవత్సరాలుగా ఆవులకి జరుగుతున్నదదే) ఈ నాలుగు పదాలు చాలు, మానవ సమాజాలు భూస్వామ్య సమాజం నుండి ఆధునిక ద్రవ్య పెట్టుబడి సమాజం వరకూ చేసిన, "పురోభివృద్ధి"నంతటినీ చక్కగా వర్ణించడానికి!.

ఈ మధ్యే మార్క్సు రాసింది చదివి పగలబడి నవ్వేసాను నేను. (ఒక చెత్తకుండీలో తిండి వెతుక్కుంటుంటే దొరికింది). అందులో ఆయన 'మనిషిని మనిషి దోచుకోవడాన్ని అంతం చేయడం' గురించి మాట్లాడాడు మరి. అంతకు చాలా ముందే ఆవులపై మనుషుల దోపిడీ మొదలైంది.

మా గురించి సాధారణంగా వ్యవహరించే పదం పశువులు అని. అంటే క్యాటిల్. ఈ పదం ఎక్కడి నుంచి వచ్చిందో మార్క్సు గనుక పరిశీలించి ఉంటే ఆయనకి అర్థం అయి ఉండేది. ఇది ఛాటిల్ అనే పదం నుండి ఆవిర్భవించింది. 'ఛాటిల్ అంటే కదిలే వ్యక్తిగత సంపద'. కాపిటల్ పదం కూడా దీని నుంచే జనించింది. అసలు మార్క్సు దకాపిటల్ కాదు, ద క్యాటిల్ రాయవలసి ఉండింది. (మార్క్సిస్టులకి బొత్తిగా జంతు వాసనలు లేవు)

సరే, నా సణుగుడులోని 'సారాంశం' దగ్గరికి వద్దాం. అది-ఏంటంటే, భారతదేశంలో "పవిత్రంగా" భావించబడుతున్న ఆవుల పరిస్థితి. 'కమినిస్టోల' భాషలో చెప్పాలంటే "ఆవు సమస్య" మీరు గమనించే ఉంటారు, నేను నా గురించి చెప్పేటప్పుడు 'భారతీయ ఆవు' అని కాకుండా 'భారతదేశంలోని ఆవు' అనే అంటున్నాను.

కారణం చాలా మామూలుది. ఎందుకంటే అసలు 'భారతీయ ఆవు' అనేదే లేదు కనుక. అలాంటి ఆవు నిజంగా రక్త మాంసాలు, పాలు ఉన్న ఆవుతో, ఎప్పుడూ వ్యవహరించకుండా ఏదో రవివర్మ చిత్రాల ప్రభావంతో వేసిన క్యాలెండర్లు చూసేసి చేసే సారవంతమైన ఊహలలో తప్ప మరెక్కడా లేదు.

నన్ను వివరించనివ్వండి. విశ్వవ్యాపితంగా 800 జాతుల ఆవులు, భారతదేశంలో కనీసం 26 గుర్తింపబడిన జాతుల ఆవులు ఉన్నాయని మీకు తెలుసా? మీకు ఊరికే ఉదాహరణ కోసం చెప్తున్నాను- గిర్, సాహివాల్, ఎర్రసింధీ, థార్‌పాకర్, అమ్రిత్‌మహల్, నాగోరి, మాల్వి, హల్లికర్, ఖిల్లారీ, కన్‌గాయమ్, క్రిష్ణవ్యాలీ, ఒంగోలు, నిర్మారి, హరియాణా, దేవ్‌నీ, కొంక్రేజ్, దాంగీ......ఇట్లా కొన్ని. అందరూ అంతే సమానంగా అందంగా ఉన్నప్పటికీ ఒక కాశ్మీరికీ, ఒక మలయాళీకి ఎంత తేడా ఉంటుందో ఈ జాతులు కూడా అంతే భిన్నంగా కనిపిస్తాయి. కాబట్టి 'ఆవు' అనే ఒక సాధారణ నమూనా అంటూ ఏం లేనే లేదు.

ఇందులోని చాలా తెగలు అసలు భారతదేశంలోని స్థానికమైన తెగలు కానే కావు. ఆసియాలోని సంచార పశువుల కాపరులు

---

ఆదివాసులు ఎక్కడికక్కడే రోడ్లపైకి వచ్చారు. తిరిగి 2015లో కూడా మోదీ ముందుకు తెచ్చిన భూసేకరణ బిల్లును వ్యతిరేకిస్తూ మిలిటెంటుగా పోరాడారు. ఫలితంగా మోదీ ఆ బిల్లును 2015 ఆగస్టులో విరమించుకున్నాడు. ఇది ప్రజల విజయమే.

2014 శీతాకాలం పార్లమెంటు సమావేశాలలో మోదీ ప్రభుత్వం గనులు, ఖనిజాలు తవ్వకాల చట్టాన్ని రూపొందించింది. దీనితో అనేక అటవీ ప్రాంతాలలో నూతన గనుల తవ్వకాలకు దారులు తెరుస్తూ కేంద్రం కార్పొరేటు వర్గాలకు ఆహ్వానం పలికింది. దీన్ని వ్యతిరేకిస్తూ ఉత్తర ఛత్తీస్‌గఢ్ ఆదివాసీ, గైరాదివాసీ ప్రజలు మిలిటెంటుగా పోరాడుతున్నారు. ఈ చట్టం పెసా చట్టానికి పూర్తి ఉల్లంఘనే అంటూ వారు ఖండిస్తున్నారు. పెసా కోసం, గ్రామసభల అధికారాల కోసం ఉద్యమిస్తున్న దేశవ్యాప్త ప్రజానీకం రేపటి నిజమైన విప్లవ ప్రజాస్వామ్యం కోసం, ప్రత్యామ్నాయ రాజ్యాధికార వ్యవస్థ నిర్మాణం కోసం దారులు సుగమం చేస్తున్నారు.



తెచ్చినవి ఎన్నో ఉన్నాయందులో. ఇటీవలి కాలంలోనైతే యూరోపుకి చెందిన అనేక జాతులను దిగుమతి చేసుకుంటున్నారు. డెయిరీ ఫార్మ్‌లలో ఇవి చాలా ప్రసిద్ధం. అలాగే ఒంగోలు బ్రాహ్మణ గిత్తలు ప్రపంచం అంతటా కనిపిస్తాయి. వాటిని కావాలంటే మీరు ప్రవాస ఎద్దులు (నాన్ రెసిడెంట్ బుల్స్) లేదా, ఎన్‌ఆర్‌బి అని పిలుచుకోవచ్చు. అంతేకాదు, కనీసం ఇందులో రెండు జాతులు, ఎర్రసింధీ, సాహివాల్ అనేవి స్థానికంగా ఇప్పటి పాకిస్థాన్‌కి చెందినవి.

ఇదంతా అనేక ప్రశ్నలని లేవనెత్తుతుంది. యూరోపియన్ ఆవులూ, పాకిస్థాన్ ఆవులూ కూడా హిందువులకి "పవిత్రమైనవే" నా? ఒకవేళ భారతదేశంలోని ఆవులు మాత్రమే పవిత్రమైనవి అనుకున్నా కూడా, ఈ 26 కంటే ఇంకా ఎక్కువే అయిన ఆవుల జాబితాలో ఏవి పవిత్రమైనవన్నట్టు? కుల వ్యవస్థ ఆవులకి కూడా వర్తిస్తుందా? అలా గుంభనంగా నవ్వకండి మరి, ఈ గంభీరమైన ప్రశ్నలు నన్ను కొన్ని నెలలుగా తినేస్తున్నాయి. వీటి జవాబులు నాకు, నా తోటి ఆవులకూ అక్షరాలా చావు బతుకుల సమస్యవంటివి.

ఒకవేళ 'పవిత్రమైన ఆవు' అంటే భారతదేశ రాజకీయ పరిపాలనా సరిహద్దులలో సంచరించే ఏదేని పశువు అని నిర్వచించాలనుకోండి, అంతర్జాతీయ సరిహద్దులని దాటి ఏ ఆవైనా బంగ్లాదేశ్ నుండి 'చొరబడి'తేనో? అప్పుడేమవుతుంది? అప్పుడు మరి ప్రభుత్వం ఒక 'పశు ట్రిబ్యునల్' ఏర్పాటు చేసి, "విదేశీ ఆవులను" పంపించేసి భారతదేశంలోని ఆవులకి ఆధార్‌కార్డులు ఇస్తుందా? భారతదేశంలో లాగా కాకుండా ఆవు "పవిత్రం" కాని దేశాల నుండి 'గోమాంసం' దిగుమతిని అనుమతిస్తారా?

నిజానికి వేదాలలో ఆవు గురించి 'అఘన్య' లేదా "ఎట్టి పరిస్థితుల్లోనూ చంపకూడనిది" గా వ్యాఖ్యానించినప్పటికీ దానిని అనిర్దిష్ట పద్ధతుల్లో అమలు చేసారు. కాబట్టి ప్రపంచంలోని ఆవులకి పవిత్రతని ఆపాదించేది ఆవు 'జాతీయత' కానీ 'జాతి' కానీ కాదు. అలా అంటే మళ్ళీ ఆవునిష్టపడే ప్రస్తుత ప్రభుత్వం గోమాంసం తినే అన్ని దేశాలతోనూ దౌత్యసంబంధాలు తెంచుకోవాల్సి ఉంటుంది.

మొహమాటం లేకుండా చెప్తున్నాను, పూజలు చేయించుకోవడం పట్ల నాకేమీ సమస్య లేదు కానీ ఆవులకి మాత్రమే ఈ అవకాశం ఉండటం సరైంది కాదు. ఈ గ్రహం మీది అన్ని జంతువులూ, మనుషులతో సహా పవిత్రమైనవే. లేదా ఏదీ కాదు. ఇలా మాకు మాత్రమే పవిత్రత ఆపాదించడం, మా మీదున్న భారాన్ని మరింత పెంచుతుంది తప్ప మరొకటి కాదు. పైగా "తక్కువ స్థాయి" కలిగిన ఇతర జంతువులలో అనవసరంగా మాకు అప్రతిష్ట.

అసలు చెప్పాలంటే, భారతదేశంలోని ఆవులు తమ స్థితిని గురించి ఆక్షేపణ లేకుండా ఏదోలా బతికేయడం అనేది, చాలా విషాద ఫలితాలనిచ్చింది. ఉదాహరణకు, ఆవులకి వాటి భక్తులు మేత వేసి నివాస స్థలం కల్పించి, వృద్ధాప్యంలో బాగోగులు చూసుకోవాల్సి ఉంది. కానీ ఒకసారి మాతో ఉపయోగం అయిపోయాక మామూనాన మమ్మల్ని వదిలేస్తారు. భారతదేశంలోని ఏ చిన్న పట్టణంలోనైనా ఒక కూరగాయల దుకాణం నుంచి మరొక దానికి నిరంతరం తరమబడే ముసలి, రోగిష్టి ఆవుల సంఖ్యని బట్టి మీరే అంచనా వేయవచ్చు.

ఇంకా ఘోరం ఏమిటంటే మమ్మల్ని మేము పోషించుకోలేని పరిస్థితి. ఒకప్పుడు మేము మేత మేసే బహిరంగ ప్రదేశాలన్నిటికీ ఇప్పుడు "సొంత ఆస్తి" అని చెప్పి కంచెలు వేసారు. ఇదివరకు అయితే ఆవలి వైపంతా కూడా పచ్చగా ఉండేది. కానీ ఇప్పుడేమో ఒకే వైపు మిగిలింది. అది కూడా అంబానీలది. అన్నిటికీ మించి క్రిమిసంహారక మందులు కొట్టీ కొట్టీ మాకు దొరికేది విషపూరితమైన ఎండుగడ్డి. ఆకలికి తట్టుకోలేక ఒక్కసారి మేము తినేసే ప్లాస్టిక్ బ్యాగులు మమ్మల్ని అర్ధాంతర చావులకు గురి చేస్తున్నాయి.

"పవిత్రమైన ఆవు" అనే మిథ్య వల్ల మాచెడ్డ ప్రమాదం ఉంది. 'పవిత్రం' అనే దాన్ని కొన్ని ఆవులు 'చావు లేనిది' అని పొరపాటుగా అర్థం చేసుకుంటాయి. అంటే ట్రాఫిక్ నియమాలు కానీ, ఆ మాటకొస్తే భౌతికశాస్త్ర నియమాలు సైతం తమకు వర్తించవని భావిస్తాయి. అందువల్ల ప్రతి ఏడాదీ రోడ్డు ప్రమాదాల్లోనూ, భారత జాతీయ రహదారుల్ని దాటేటప్పుడు అలవాటుగా గుద్దేయడం వల్లా చనిపోతున్న ఆవుల సంఖ్య వేలల్లో ఉంటుంది.

మా ఈ 'పవిత్రత' అనే ముద్ర వల్ల మరొక సమస్య ఉంది. భారతదేశంలోని అత్యధిక శాతం పాలు, మాంసం ఉత్పత్తి చేసేది బర్రెలే. అయినా, నల్లగా ఉంటాయని చెప్పి హిందువులు వాటిని రాక్షసుల్లాగా చూస్తారు. మా మీదున్న ఈ పవిత్రత అనే ముద్ర వెనుక బర్రెలకు జరుగుతున్న అన్యాయం కప్పబడిపోతుంది. హిందువులు బర్రెలను మృత్యుదేవత అయిన యముని వాహనంగా చూడడం అంటే 'జాత్యహంకారాన్ని' మనుషుల నుంచి జంతు ప్రపంచానికి కూడా విస్తృతపరచడం తప్ప మరొకటి కాదు.

ఆవులపై 'పవిత్ర' అనే ముద్ర వేయడం పట్ల నాకున్న అభ్యంతరానికి మరో కారణం కూడా ఉంది. ఎందుకంటే కేవలం పోషక విలువల కోసం మాత్రమే కాకుండా మమ్మల్ని పిండుకొనే వాళ్ళకి మరి కొన్ని లాభాలు కూడా ఉండటం వల్ల ఇది కేవలం ఒక ఎర. గోవధ నిషేధించాలని గగ్గోలు పెట్టేవాళ్ళంతా జాతీయ రాజకీయాలను తమకు నచ్చేదిశలో వాటిని నడుపుకోవడానికి ప్రయత్నిస్తున్న కొంత మంది రాజకీయ అతివాదులు. బర్రె కొవ్వుని డాల్డాలో కలిపేసి హిందూ భక్తులకి సైతం అమ్మడానికి వెనుకాడని వాళ్ళు, గోవధ నిషేధించాలో.. అని గొడవ చేస్తారు!

తమ తోటి మనుషులు పోషణతో, రోగాలతో, పేదరికంతో చనిపోతుంటే పట్టించుకోని మనుషులు ఈ దేశంలో ఆవులు బతుకుతున్నాయో, చస్తున్నాయో పట్టించుకుంటారా? ఖచ్చితంగా పట్టించుకోరు. ఇదంతా ఒక సంకుచిత అసహ్యాన్ని రాజకీయ లబ్ధి కోసం చేసే ప్రచారంలో అమాయక ఆవుని బలిపశువుని చేయడమే!

ఇకపోతే గోవధ గురించి, గోమాంస భక్షణ గురించి నా సొంత అభిప్రాయాలు ఏమిటి? గోమాంస భక్షణని సమర్థించే వాళ్ళో, వ్యతిరేకించే వాళ్ళో ఒక్క ముక్కలో చెప్పే సమాధానాల కంటే నా అభిప్రాయాలు సంక్లిష్టమైనవి. సంకుచిత మనస్కులు ఇక్కడితో చదవడం మానేస్తే మంచిది.

నా అభిప్రాయంలో బీఫ్, మటన్, చికెన్, ఫిష్ వీటన్నింటిలో ఏమీ తేడా కనిపించదు. నిజానికి అసలు మాంసాహారం, శాఖాహారంలోనే నాకు తేడా కనబడదు. మనుషులు, జంతువులూ అన్నీ ఒకే రకమైన పదార్థంతో తయారయ్యాయి. వివిధ రకాలైన హైడ్రోకార్బన్లను భిన్న పద్ధతుల్లో అమర్చడం వల్ల ఇవి తయారైనవి. ఫండమెంటల్‌గా (సూత్రబద్ధంగా) చెప్పాలంటే (ఫండమెంటలిస్టు..మతోన్మాది లాగా కాదు). అవన్నీ కేవలం హైడ్రోకార్బన్లు అంతే. కావాలంటే మీ ప్రాథమిక సైన్సు పాఠ్యపుస్తకాలు చూసి, నేను తప్పయితే చెప్పండి.

సరే చాలా లక్షణాలు జంతువులకున్నవి మొక్కలకు లేవు. అదీ, ఇదీ అని మీలో కొందరు దున్నపోతు ముందు ఆడించే ఎర్రగుడ్డలా ఎగిరెగిరి పడుతున్నారని నాకు తెలుసు. అదంతా ఒట్టిది. మొక్కలు కూడా జంతువులకు ఉండే లక్షణాలన్నింటినీ కలిగి ఉంటాయి. కమ్యూనికేట్ చేయడం కావచ్చు భావావేశాలు కలిగి ఉండటం కావచ్చు. కావాలంటే http://www.scientificamerican.con/article/do-plants-think-daniel-chamovit3/. చూసుకోండి. (ఆఁ..అవును ఈ ఆవు ఇంటర్‌నెట్ కూడా చూస్తుంది)

ఆ రకంగా చూస్తే ఆవుకీ, దోసకాయకీ మధ్య తేడాలేదు. మరింక చర్చ దేనికి? చనిపోయిన మనుషులని పాతిపెట్టాక తిరిగి నేల మీద గడ్డిలో మొలుస్తారు. దానినే మేం తింటాం. ఆ రకంగా చూస్తే మేం మనుషులని తినేవాళ్ళం అని కూడా ఎవరైనా ఆరోపించవచ్చు. భారతదేశంలో మా ఆవుల మధ్య ఒక పురాణ కథ ప్రచారంలో ఉంది. మహాభారత యుద్ధం ముగిసాక, కురుక్షేత్ర యుద్ధంలో కొట్టుకొని ఒరిగిపోయి- మేతగా మిగిలిపోయిన మహాపురుషులని తినీతినీ ఆవులు విపరీతంగా లావయిపోయాయట.

ఈ గ్రహం మీద మానవ జనాభా వంద సంవత్సరాలలో ఎట్లా మూడింతలైపోయిందో చూడండి. 2 బిలియన్ల నుండి ఏకంగా ఆరు బిలియన్లకు పెరిగింది. ఆ అదనపు జనాభా ఏర్పడడానికి కావాల్సిన హైడ్రోకార్బన్లన్నీ ఎక్కడి నుంచి వచ్చినట్టు? చెట్లనీ, జంతువులనీ, ఇతర జాతులనీ చంపి ఆ హైడ్రోకార్బన్లనే మానవులు రక్తమాంసాలుగా మార్చుకుంటున్నారు. నిజానికి ఏదైనా పెద్ద మనుషుల గుంపు వెళ్తుంటే - 'ఆహాఁ వీళ్ళందరి నుండీ ఎంచక్కని అడవి తయారయ్యి ఉండేది' అనుకుంటాను. ఒక ఆసక్తికరమైన సిద్ధాంతం ప్రకారం, వేదకాలంలో గోమాంసం తినే హిందువులు (ఉపనిషత్తులలో ప్రసిద్ధుడైన ఆర్య రుషి యాజ్ఞవల్క్యుడిని గోమాంసం తినడం గురించి అడిగితే ఎల్విస్ పాటలాగా పరవశంగా కూనిరాగం తీసాడట) కొన్ని సైకోయాక్టివ్ కుక్కగొడుగులు ఆవుపేడలో బాగా పెరుగుతాయనే కనుగొన్నాక తినడం మానేసారట. ఈ మ్యాజిక్ కుక్కగొడుగులు తిన్నాక వారికి దైవాంశ భ్రాంతులు కలిగి ఆవుని పవిత్రమైన జంతువుగా ప్రకటించడానికి దారి తీసింది. అదే విషయమైతే పూజించాల్సినది ఆ కుక్కగొడుగుల్ని కానీ ఆవుల్ని కాదు.

ఊరికే తమాషా కన్నాననుకోండి. వాస్తవం ఏంటంటే అనేక పేద భారతీయులను చేసినట్టే ఆవుల్ని కూడా వాడుకొని వదిలేస్తున్నారు. మమ్మల్ని 'పవిత్రం' అని అనడం మాకున్న ఇమేజ్‌ని వాడుకొని, ఇతర 'మచ్చిక' అయిన మానవ జాతులను ప్రస్తుత పరిస్థితికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయకుండా నిరోధించడానికి తప్ప మరెందుకూ కాదు. ఈ గ్రహం మీది అన్ని జీవరాశులకీ అంతే సమాన హోదా కల్పించినప్పుడే ఈ పవిత్రతని మేము ఆమోదించేది. అంతవరకూ ఈ 'చెత్తంతా' (బుల్‌షిటింగ్) ఆపండి!!

('సిటిజన్' అంతర్జాల పత్రిక సౌజన్యంతో..)



---

*లేఖ :*

# వాచక వ్యాఖ్య - గబ్బిలం - మేఘసందేశం

**కె. సుబ్బనాచారి**

అక్టోబర్ 2015 సంచికలో ఇద్దరు మహాకవులను పోల్చుకుంటూ వరవరరావు వ్యాసం రాశారు. ఒకరు మహాకవి 'కాళిదాసు' రెండవవారు 'జాషువా' మహాకవి. వారి వారి వర్గ దృక్పథాన్ని అంచనా వేసి సమాజానికి వారు అందించిన సందేశం ఏమిటి? అనే అంశాన్ని చాలా గొప్పగా వరవరరావు అందించారు. 'కాళిదాసు', 'మేఘసందేశం' కావ్యం ప్రేయసి ఎడబాటు భరించలేక పడిన వ్యథ. జాషువాగారి 'గబ్బిలం' కావ్యం అగ్రవర్ణాధిపత్యంలో సమాజం నుండి వెలివేయబడిన ఒక అభాగ్యుడి ఆవేదన. ఒకటి కల్పితం, రెండవది యదార్థ జీవితంలోనిది. ఒకదానిలో దేవేంద్రుని కోపానికి గురైన శాపగ్రస్తుడు. రెండవదానిలో అగ్రవర్ణ బ్రాహ్మణ వర్గం సమాజానికి దూరంగా విసిరివేయబడిన అభాగ్యుడు. మేఘసందేశంలో ప్రకృతి వర్ణన అత్యద్భుతంగా వినిపిస్తున్నది. 'గబ్బిలం' సంఘ బహిష్కృతుని దీనాలాపన గాఢంగా వినిపిస్తున్నది. ఈ రెండు కావ్యాలను పోల్చుకుంటూ యథార్థంగా స్వీకరించి వాస్తవాన్ని వెలికి తీసారు రచయిత. పక్షపాతరహితంగా ఉన్నది ఉన్నట్లు విశ్లేషించి రాసిన వ్యాసం ఇది. ఇంతకు ముందు ఎన్నో వ్యాసాలు వచ్చినవి గాని, ఏదో ఒక వైపు కొట్టుకొని పోవడం తప్ప యథార్థాన్ని వ్యక్తం చేయలేకపోయారు. మహాకవి 'కాళిదాసు'తో పోల్చి 'జాషువా'ని అంచనా వేశారు. ఇదే ఈ వ్యాసం ప్రత్యేకత. అందుకనే ఇది చాలా గొప్ప వ్యాసమని అందరూ చదివి తెలుసుకోగలరని అనుకుంటున్నాను. అందుకు దీనిని ఒక పుస్తకంగా తీసుకొని వస్తే బాగుంటుంది.

# మార్క్స్ పెట్టుబడి - రచనా క్రమం

ఫ్రాన్సిస్ వీన్

అనువాదం: ముక్తవరం పార్థసారథి

(6)

గత సంచిక తరువాయి...

జననం

'దాస్ కాపిటల్'కు రాసిన ముందుమాటలో 'ఏది నేర్చుకోవాలన్నా మొదట కాస్త కష్టంగానే ఉంటుంది' అని పాఠకుల్ని హెచ్చరించాడు మార్క్స్. కాని, ప్రారంభించటమే కాదు, ముగించటం మరీ కష్టం. అని కూడా ఆయన రాసి ఉండాల్సింది. జీవితకాలంలో మొదటి సంపుటం మాత్రమే ముగించాడు. దశాబ్దాల నిరంతర శ్రమ, కనీసావసరాల కోసం చేసిన నిత్య పోరాటాలు అప్పటికే ఆయన్ను పీల్చి పిప్పిచేసాయి.

"మీరు రెండవ సంపుటం కోసం నిరీక్షించకూడదు.దాని ప్రచురణ మరో ఆరు నెలలు ఆలస్యం కావచ్చు. గత సంవత్సరం (1866)లో, ఫ్రాన్సు, అమెరికా, ఇంగ్లండులలో జరిగిన కొన్ని పరిణామాలను అధ్యయనం చేస్తే తప్ప పుస్తకం ముగించలేను" అంటూ తన రష్యన్ అనువాదకుడికో లేఖ కూడా రాసారు. 1870 నాటికి మరో కొత్త సాకు దొరికింది.

"చలికాలమంతా ఆరోగ్య సమస్యలతో బాధ పడ్డాను, రష్యాలో 'భూమి సమస్య' గురించి కూలంకషంగా తెలుసుకోవాలంటే రష్యన్ నేర్చుకోవటం తప్పనిసరి అనిపించింది". ఆ తర్వాతి సంవత్సరాలలో రష్యన్ పుస్తకాల గుట్టలూ, గణాంక వివరాలూ పేరకు పోయాయి. "వాటిని తగలెయ్యాలనిపిస్తుంది" అంటూ ఎంగెల్స్ చిరాకుపడ్డాడు. పెట్టుబడి ముగించమని వెంటపడుతున్న మిత్రులు, ప్రచురణకర్తల నుంచి మొహం చాటెయ్యటానికి మార్క్స్ వీటిని రక్షణ కవచంలాగ వాడుకుంటున్నాడని కూడా సందేహించాడు.



అయితే, ఎంగెల్స్ అనుమానం నిజమని రుజువయ్యింది. 1883లో మార్క్స్ మరణం తర్వాత లభించిన రాతప్రతి గల కట్టల్లోంచి రెండవ సంపుటం తయారుచెయ్యటం కోసం పని ప్రారంభిస్తూ తన జర్మన్ సోషలిస్టు మిత్రుడు ఆగస్ట్ బెబెల్‌కు ఇలా రాసాడు.

"(రాతప్రతులు) కొన్ని ముగింపు దశలో ఉన్నాయి. మరికొన్ని కేవలం తన కోసం రాసుకున్న నోట్స్. దండిగా కొటేషన్లు రాసుకున్నాడు. కాని వాటినెక్కడెక్కడ ఇమడ్చాలో సూచించలేదు. అసలు అన్నింటికన్నా పెద్ద సమస్య మార్క్స్ దస్తూరి. నాకు తప్ప మరెవరికీ అర్థం కాదు- అదికూడా, ఒక్కొక్క పదం చదవటానికి చాలా శ్రమించాల్సి వస్తున్నది. ఇతర్ల సంగతి సరే, ఈ పుస్తకం ఎందాకొచ్చిందో నేనెందుకు అప్పుడే తెలుసుకో లేదంటావు నువ్వు. చాలా సింపుల్. తెలిస్తే వెంటపడి పుస్తకం ముగించే దాకి వదిలేవాణ్ణి కాదు. ఈ విషయం మార్క్స్‌కు కూడా తెలుసు"

రెండవ సంపుటం, 1885లో ప్రచురితమైంది. ఎంగెల్స్ కృషితోనే 1894లో మూడవ సంపుటం కూడా వెలుగు చూసింది. 1860 లలో మార్క్స్ రాసుకున్న నోట్స్ ఆధారంగా కార్ల్ కాట్స్కీ సంకలించిన నాల్గవ సంపుటం 'అదనపు విలువ సిద్ధాంతాలు' పేరుతో 1905లో ప్రచురించబడింది. (ఆడాంస్మిత్, డేవిడ్ రికార్డో మొదలైన వాళ్ళ రచనల్నుండి చరిత్ర, ఆర్థికశాస్త్ర విషయాల గురించి సేకరించిన సమాచారమిది)

ఒక్కమాటలో చెప్పాలంటే దాస్ కాపిటల్ అసంపూర్తిగా ఉన్న పుస్తకమని పిస్తుంది. మొదట మార్క్స్ ఆయా సంపుటాల రచన చెయ్యాలనుకున్నాడు. మార్క్సియన్ పండితుడు మాక్సిమిలిమల్ రూబెల్ మాటల్లో "ఇది మార్క్సిస్ట్ బైబిల్ కాదు. శాశ్వత సత్యాలిందులో ఉన్నాయనుకోకూడదు" ఈ విషయం ఎందుకు స్పష్టం చెయ్యాల్సి వస్తుందంటే చాలామంది ఇదో పవిత్ర గ్రంథమనీ, ఇందులో ఉన్న ప్రతి విషయాన్నీ తుచ తప్పకుండా పాటించాల్సిందేననీ- మార్క్స్ చెప్పిందంతా రచ్చలకు, వివాదాలకు అతీతమైన సత్యమనే భ్రమలో ఉన్నారు. ఈ పుస్తకాన్నెవరూ గుడ్డిగా ఆరాధించవలసిన అవసరం లేదు. మార్క్స్ చెప్పిందంతా నూటికి నూరు పాళ్ళు నిజం కాదు. చెప్పిందంతా అబద్ధమూ కాదు. ఆరోగ్యం సహకరిస్తే, సమయం చిక్కితే రచయిత మరింత వివరంగా, స్పష్టంగా రాసుండేవాడు. దాస్‌కాపిటల్‌ను చదవకుండానే ద్వేషించే వాళ్ళూ, మూఢ భక్తులు కూడా ఈ సత్యం గ్రహించాలి. "మార్క్స్ మరో ప్రపంచాన్ని ఆవిష్కరించిన మాట నిజమే గాని అంత మాత్రాన ఆయన దాని నరిహద్దుల్ని ఖచ్చితంగా

నిర్ధారించాడనుకోనక్కర్లేదు" అంటాడు ఆర్థిక శాస్త్రజ్ఞుడు మైకెల్ లెబోవిట్జ్.

మార్క్స్ కనుగొన్న పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థే ఆ మరో ప్రపంచం. ఆడాంస్మిత్ కు దీని గురించి తెలియదు. ఇదొక అద్భుత, మాయాజాలం. ఒక మయసభ. కనిపించేదేదీ వాస్తవం కాదు అని పాఠకుల్ని హెచ్చరిస్తాడు. దాస్ కాపిటల్‌లోని మొదటి వాక్యాన్ని ఒకసారి పరిశీలించండి. 'పెట్టుబడిదారీ వ్యవస్థలో సంపదంతా సరుకుల రూపంలో కనిపిస్తుంది' ఇది కమ్యూనిస్ట్ మానిఫెస్టో లోని మొదటి వాక్యం. "యూరోప్‌ను ఒక భూతం ఆవహించింది" లాగ ఉత్తేజకరంగా, నాటకీయంగా లేదు. అయినా రెండింటి అంతరార్థమూ ఒకటే. మనం భూతప్రేతాలు, మంత్రాలు, మాయల లోకంలోకి ప్రవేశిస్తున్నాం. దాస్‌కాపిటల్ నిండా "భూతంలాంటి కామరూపి", "మనం స్పర్శించలేని మాయావి", "కేవలం భ్రమ", "వాస్తవమని భ్రమింపచేసే అబద్ధం" లాంటి మాటలు కోకొల్లలుగా కనిపిస్తాయి. ఈ మాయాజాలాన్ని ఛేదిస్తే తప్ప పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క దోపిడీ స్వభావాన్ని- పెట్టుబడిదారీ భూతం శరీరంలో ప్రవహిస్తున్న నెత్తురు గురించి తెలుసుకోలేం.

సరుకు (కమోడిటీ) కు రెండు లక్షణాలున్నాయి. ఒకటి ఉపయోగపు విలువ. మరొకటి మారకపు విలువ. ఒక సరుకు వల్ల ఉపయోగమేమిటో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. కోటు వేసుకుంటే వెచ్చగా ఉంటుంది. రొట్టె తింటే ఆకలి తీరుతుంది. ఉపయోగాన్ని బట్టి మాత్రమే మారకపు విలువ నిర్ణయిస్తే సిల్కు కోటు కన్నా రొట్టె విలువ ఎక్కువ. కాని అలా జరగటం లేదు. మరి, మారకం విలువ ఎలా నిర్ణయించబడుతుంది?

"ఉదాహరణకు రెండు సరుకుల్ని పరిశీలిద్దాం. ఒకటి మొక్కజొన్న. మరొకటి ఇనుము. వీటి మారకపు సంబంధం ఏమైనప్పటికీ, కొంత పరిమాణం గల మొక్కజొన్న, కొంత పరిమాణం ఉన్న ఇనుముకు సమానమవుతుంది. అంటే అర్థమేమిటి? ఈ రెంటి విలువనూ సమానంగా నిర్ధారించగల అంశం మరొకటుంది. రెండూ కలిసి ఈ మూడవదానికి సమానమన్నమాట. ఈ విలువతో రెంటినీ మార్చుకోవచ్చు"

ఈ రెండు సరుకుల (పరస్పర) మారకపు విలువను నిర్ణయించిన మూడో అంశం శ్రమ- వీటిని ఉత్పత్తి చేయటంలో అవసరమైన శ్రమ. ప్రతి వస్తువూ దాని తయారీలో అవసరమైన శ్రమకు ప్రతిరూపం- (ముడిసరుకును వెలికి తియ్యటానికి ఉపయోగమైన) యంత్రాలను తయారు చేసిన శ్రమతో సహా. ('సామాజికంగా అవసరమైన శ్రమకాలం' అంటాడు మార్క్స్) అంటే సగటు కార్మికుడు పని పూర్తి చెయ్యటానికి అవసరమైన సమయం. ఈ విషయం స్పష్టం చెయ్యటం అవసరం. బద్ధకస్తుల్లో, అసమర్థులైన కార్మికుల్లో పని ముగించటానికి ఎక్కువ సమయం తీసుకుంటారు.

ఇక్కడి దాకా ఇవన్నీ పాత ఆర్థిక సిద్ధాంతాలే. ఆడాంస్మిత్, డేవిడ్ రికార్డో వగైరా అనేకమంది చెప్పినవే. శారీరక శ్రమ వల్లనే ఒక దేశంలో అన్ని అవసరాలూ తీరతాయి. అన్ని సదుపాయాలూ సమకూరుతాయి అంటాడు ఆడాంస్మిత్ తన 'వెల్త్ ఆఫ్ నేషన్స్'లో. కాని మార్క్స్ మరో అడుగు ముందుకు వేసి సరుకులకున్నట్టే, శ్రమకు కూడా రెండు రకాల విలువలు (ఉపయోగపు విలువా, మారకపు విలువా) ఉన్నాయన్నాడు. (సామాజికంగా) ఉపయోగకరమైన, నిర్దిష్టమైన శ్రమ వలన ఉపయోగపు విలువ సృష్టించబడుతుంది. "ఒక ఖచ్చితమైన లక్ష్యంతో చేసిన ఖచ్చితమైన శ్రమ" అని దీన్ని నిర్వచించాడు మార్క్స్. అరూప (అబ్‌స్ట్రాక్ట్) లేదా శ్రమ చేసిన సమయాన్ని బట్టే నిర్ధారించబడుతుంది మారకపు విలువ. ఈ రెంటి మధ్యా అంతర్లీనంగా కొంత వైరుధ్యం కూడా ఉంది. ఉదాహరణకు ఒక దర్జీ చాలా కష్టపడి, చాలా కాలం పనిచేసి, చాలా కాలం మన్నగలిగిన ఒక కోటు కుట్టాడనుకోండి. కాని అందువల్ల వినియోగదారుడికి మరో కోటు కొనవలసిన అవసరమే రాదు. దీనివల్ల దర్జీకి నష్టమే గదా. బట్టలు నేసే వాళ్ళ పరిస్థితీ ఇంతే. ఓ పట్టాన చిరగని బట్టలు నేస్తే కొత్త బట్టలు ఎవరు కొంటారు? అలాగ ఉపయోగపు విలువకూ, మారకపు విలువకూ మధ్య ఘర్షణ తప్పదు.

శ్రమకున్న ఈ రెండు పార్శ్వాలనూ సుదీర్ఘంగా చర్చించాడు మార్క్స్: "వస్త్రానికున్న విలువకన్నా కోటు విలువ ఎన్నో రెట్లు ఎక్కువ- బంగారు దారాలతో కుట్టిన కోటు తొడుక్కున్నప్పుడు మనిషి విలువ పెరిగినట్టు". ఉపయోగపు విలువగా చూసినప్పుడు కోటు విలువ వస్త్రం విలువ కన్నా ఎక్కువనిపించినా- రెంటిలోనూ (రెండు వస్త్రాలలోను) ఉన్న శ్రమకు తేడాలేదు. కాని కోటుగా మారినప్పుడు వస్త్రం విలువ పెరిగిపోయింది- రెండు గుడ్డల్లోనూ ఉన్నది ఒకే రకమైన శ్రమ. గుడ్డగా రెండూ సమానమే. గొర్రెల్లాంటి క్రైస్తవులు జీసస్ కు వారసులైనట్టు.

మాటలతో వాతలు పెట్టటమంటే ఇదే. ఎంత వ్యంగ్యమో! పైగా ముఖ్యమైన సైద్ధాంతిక విషయాలను చర్చిస్తూ ఇలా ఎత్తిపొడుపులెందుకు? విద్యార్థిగా ఉన్నప్పుడు తను చదివిన లారెన్స్‌స్టెర్న్ నవల "ట్రిస్ట్రాం షాండీ" అంటే మార్క్స్‌కు చాలా ఇష్టం. కథను సూటిగా చెప్పకపోవటమే ఇందులోని ప్రత్యేకత. అయినా, హాస్యం, వ్యంగ్యం, ఛలోక్తులతో పాఠకులను కట్టిపడేస్తుంది. ముప్పై ఏళ్ళ తర్వాత, లారెన్స్ స్టెర్న్ శైలిని మార్క్స్ ఇలా ఉపయోగించుకున్నాడు. ట్రిస్ట్రాం షాండీ లాగే దాస్‌కాపిటల్‌లో కూడా అవసరానికి మించిన వ్యంగ్యం, అధిక్షేపణ తరచూ కట్టలు తెంచుకున్న కోపం పుస్తకం లోని అదనపు ఆకర్షణలు. లేకపోతే, తలకిందులుగా కనిపించే ఈ పెట్టుబడిదారీ వ్యవస్థను వర్ణించడమెలా సాధ్యపడుతుంది మరి? గుడ్డా, కోటు గురించిన అనేక పేజీల చర్చ తర్వాత "పైన సరుకు అతి సామాన్యమైన, అముఖ్యమైన విషయంలాగే కనిపించనప్పటికీ, లోతుగా విశ్లేషిస్తే నిగూఢమైన అనేక విషయాలను లోపల దాచుకున్నట్టుగా ఉంటుంది. మతపరమైన, అలౌకిక పనులు కూడా ఇందులో ఉన్నాయి" అంటాడు.

బల్లచెక్కను టేబుల్‌గా తయారుచేసినా, అందులో బల్లచెక్క లక్షణాలు ఎక్కడికీ పోవు. కాని వినియోగ వస్తువుగా- సరుకుగా- బల్లచెక్క విలువ కన్నా ఎంతో ఎక్కువ అది. "నిటారుగా ఉన్న కాళ్ళ మీద తలెత్తుకుని నిలబడమందది". అన్ని సరుకులూ తమ

సృష్టికర్తల శ్రమకు ప్రతిరూపాలే. మనుషుల మధ్య సామాజిక సంబంధాలకు ప్రత్యక్ష సాక్షులు. వస్తువుల మధ్య ఉన్న సంబంధాలే మనుషుల మధ్య సంబంధాలుగా మారిపోతాయి. "అయితే దీన్ని వర్ణించటానికి ఆయనకు ఒక మత సంబంధమైన ఉదాహరణ మాత్రమే దొరికింది"

"మనుషులు తమ ఊహల్లో సృష్టించుకున్న కొన్ని భావనలు (దేవుళ్ళు) మానవాతీతమైన సర్వశక్తిమంతమైన వారిగా కనిపిస్తారు. వాళ్ళు తమలో తాము సంబంధాలు పెట్టుకుంటారు. మనుషులతోనూ సంబంధాలు పెట్టుకుంటారు. మనుషులు సృష్టిస్తున్న సరుకులూ ఇలాంటివే. సృష్టించబడిన వెంటనే సరుకులు కొన్ని అతీంద్రియ శక్తులు సంతరించుకుంటాయి. వీటి పట్ల ఆరాధనా భావం పెరుగుతుంది. దీన్నే నేను ఫెటిసిజం అంటాను"

మతానికి సంబంధించినంత వరకూ "మానవాతీత శక్తులున్న వస్తువులను (విగ్రహాలు వగైరా) ఫెటిష్ అంటారు. వీటి ఆరాధన వలన జంతు సమానులైన మానవులు ఉన్నత దశకు చేరుకుంటారు" అన్నాడొక జర్మన్ రచయిత. అతన్ని ఎద్దేవా చేస్తూ, 1842లోనే ఇరవై నాలుగేళ్ళ మార్క్స్ "ఈ ఆరాధనతో కల్పించుకున్న భ్రమ వల్ల మనిషి ఒక జడపదార్థం, తన సహజ లక్షణాలను అధిగమించి తన కోరికల ప్రకారం రూపాంతరం చెందుతుందనుకుంటాడు" అన్నాడు. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో సరుకులకు అతీంద్రియ శక్తులు ఉంటాయన్న విశ్వాసం ప్రధానం. ఇదొక భ్రమ. "ముత్యంలోనూ, వజ్రంలోనూ ఉన్న మారకపు విలువ ఏమిటో ఇంతవరకూ ఏ రసాయనిక శాస్త్రజ్ఞుడూ గుర్తించలేకపోయాడు" అంటాడు మార్క్స్.

అయితే, ఆయన ఆలోచనల పరిమితికి ఇదొక ఉదాహరణ. ముత్యాలనూ, వజ్రాలనూ వెలికి తియ్యటంలో అవసరమైన శ్రమ అని గనక ఆయన వాదన అయితే, ఒక్క వజ్రం కోసమో, ఒక్క ముత్యాల హారం కోసమో జనం ఎందుకు లక్షలు వెచ్చిస్తున్నారు? ఇవి అరుదుగా లభ్యమవుతున్నాయి గనకే వీటి విలువ పెరగలేదా. లేదా వాటి అందం మరొక కారణం కాదా? శ్రమ వెచ్చించిన సమయమే ముఖ్యమనుకుంటే ఒక రెస్టారెంట్‌లో నాప్కిన్ మీద పికాసో గీసిన నాలుగు ఆషామాషీ గీతలకు, లేదా జాన్‌లెనన్ (బీటిల్స్ గాయకుడు) ధరించిన హ్యాట్‌కు లక్షల్లోనో, కోట్లలోనో ధర ఎందుకు పలుకుతుంది? కేవలం ఒక వస్తువుగా వాటి విలువెంత? వందేళ్ళ నాటి వైన్ బాటిల్‌కూ, ఇప్పుడు నింపిన వైన్ బాటిల్‌కూ తేడా ఏమీ లేదే? కాని వైన్ ఎంత పాతదైతే అంత ఎక్కువ ధరకు ఎందుకు అమ్ముతారు?

మార్క్స్ చెప్పిందంతా నిర్ద్వంద్వంగా నూటికి నూరుపాళ్లు నిజమనుకునే వాళ్ళు దీని గురించి ఎక్కువగా మాట్లాడటానికి ఇష్టపడరు. పైగా, 'సరుకులు దైవిక శక్తులను సంతరించుకుంటాయని మార్క్స్ స్వయంగా చెప్పలేదా?' ఎల్విస్ ప్రెస్లీ (ప్రముఖ పాప్‌గాయకుడు) జుత్తు (కొద్ది ముక్కలు మాత్రమే) 2002లో 1,15,000 డాలర్లకు ఎందుకు అమ్ముడుపోయిందో వివరించటానికి శ్రమ సిద్ధాంతం సహాయం చెయ్యదు కాని "శ్రమవల్ల తయారైన సరుకుకు మాంత్రిక, దైవిక శక్తులు సంతరిస్తాయి" అనటం వల్ల పాక్షిక సమాధానమైనా దొరుకుతుంది. "మృతశ్రమ (డెడ్ లేబర్) సజీవమైన శ్రమ మీద ఆధిపత్యం చలాయిస్తుంది. అంటే సృష్టించిన కార్మికుణ్ణి తనకు దాసుణ్ణి చేసుకుంటుంది సరుకు" అన్నది మార్క్స్ సిద్ధాంతం.(ఇవి కూడా మార్క్స్‌కు తొలి దశలోనే కలిగిన అభిప్రాయమని పిస్తుంది. 1842లో రైనిష్ జైటుంగ్ పత్రికలో రాసిన తన వ్యాసంలో జమీందార్ల ప్రైవేటు అరణ్యాల నుండి పేదలు (కిందపడి ఎండిన) కలపను సేకరించటం మీద నిషేధం విధించటాన్ని వ్యతిరేకించాడు మార్క్స్. వందల సంవత్సరాలుగా పేదలు చేస్తున్న పనే ఇది. "కలప సేకరణలో కొన్ని చెట్లకు నష్టం జరిగే అవకాశం లేకపోలేదు. మొత్తం మీద కలప కోసం మనుషులు బలిపశువులవుతున్నారు" అన్నాడు. 1856లో బార్టిస్ట్ సభలో ఇచ్చిన ఒక ఉపన్యాసంలో కూడా ఈ అభిప్రాయం పునర్ధ్వనించింది. "మన ఆవిష్కరణలు, అభివృద్ధి అంతా జడ వస్తువులకు మేధో శక్తులు ఉన్నట్లుగా భ్రమింప చేస్తున్నాయి. ఫలితంగా మనిషి జీవితం జడ పదార్థంగా మారిపోతున్నది". ఘన పదార్థం ఆవిరై గాలిలో కలిసిపోతుంది. మానవ జీవిత సారం, లక్ష్యం జడ పదార్థంగా మారిపోయింది. మనుషులకు ఉండవలసిన చైతన్యాన్ని జడ పదార్థాలు సంతరించుకుంటున్నాయి" అంటాడు కమ్యూనిస్టు మానిఫెస్టోలో.



(ఇంకా ఉంది)


Statement about ownership and other particulars of periodical **ARUNATARA** as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Hyderabad |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 12-15-963, Manikeshwarinagar, Osmania University Campus, Tarnaka, Hyderabad-500007. |
| 4. Publisher's Name | : | Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 12-15-963, Manikeshwarinagar, Osmania University Campus, Tarnaka, Hyderabad-500007. |
| 5. Editor's Name | : | Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 12-15-963, Manikeshwarinagar, Osmania University Campus, Tarnaka, Hyderabad-500007, |
| 6. Name and addresses of Individuals who own the newspaper | : | Duvvuri Venkata Ramakrishna Rao |

I, Duvvuri Venkata Ramakrishna Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-

Date : 1st March, 2016 — *(Duvvuri Venkata Ramakrishna Rao)* Signature of the Publisher

## విప్లవ రచయితల సంఘం 25వ మహాసభలలో పుస్తకావిష్కరణ దృశ్యాలు


వరవరరావు


పాణి


భూపాల్


కె.వి. కూర్మనాథ్


అరసవిల్లి కృష్ణ


మాచర్ల మోహనరావు


కె.సి. వెంకటేశ్వర్లు


తాటి శ్రీకృష్ణ


ఎం. రత్నమాల


భాస్కర్


జి. కళ్యాణరావు


ఎన్. వేణుగోపాల్


కాకరాల


క్రాంతి


ఖాదర్ మోహీయుద్దీన్


తంగెళ్ల సుదర్శనం


పచ్చల కిరణ్‌కుమార్


సి.ఎస్.ఆర్. ప్రసాద్


కొండారెడ్డి



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M185 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | naema |
| పేజీలు విడదీసినది | bhanu |
| స్కాన్ చేసినది | naveen |
| పరీక్ష చేసినది | sireesha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |